




# వేదములు

విచారణ

# ఉపనయన సంస్కారము





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓం

# ఉపనయనసంస్కారము

## మంత్రార్థ తాత్పర్యసహితము

రావకొండ వేంకటేశ్వర్లు M. A.
సాహిత్య విద్యాప్రవీణ
భాషా ప్రవీణ
రిటైర్డ్ ఓరియంటల్ డిగ్రీకాలేజీ లెక్చరర్

'This Book is Published with the financial Assistance of Tirumala Tirupathi Devasthanams under their Scheme AID to Publish Religious Books.'

ప్రకాశకులు

దువ్వూరి రామకృష్ణారావు ట్రస్ట్‌బోర్డ్
రామకృష్ణారావుపేట. రాజమండ్రి - 5 (A. P.)

# విజ్ఞప్తి

శ్రీ దువ్వూరి రామకృష్ణారావుగారు జమీందారులగు దువ్వూరి వీరభద్రయ్యగారి కుమారులు. తండ్రియగు ఈ వీరభద్రయ్యగారి పేరున రాజమహేంద్రవర పట్టణమున 'వీరభద్రపురమను పేట, సత్రము కలవు. వీరభద్రయ్యగారు నిరంతర ధర్మకార్య నిరతులు.

వీరిపుత్రులగు రామకృష్ణారావుగారు బి. ఏ. పట్టభద్రులు, ధర్మకార్యాచరణాసక్తులు. త్యాగశీలురు. వీరిత్యాగమెంతటిదనగా రామకృష్ణ మఠాధిపతులను రాజమహేంద్రవరమునకు పిలచి వారికి ఎనుబది యకరములభూమిని వేలకొలది ధనమును సమర్పించుటయేకాక వీరభద్రపురమందున్న తమ తాత తండ్రులనాటి భవనములను అన్నింటిని (తన నివాసమునకై ఒకటియుకూడ మిగిల్చికొనకుండ) త్యాగమొనర్చినవారు. ఇట్టి వితరణశూరులు రామకృష్ణారావుగారు.

వీరికి ఉపనిషద్విజ్ఞానమును సంపాదింపవలెనని చాలకోరిక. అందులకై తీర్థయాత్రలోనర్చి కాశీక్షేత్రమున శిష్యులకు ప్రవచన మొనర్చుచు ప్రజ్ఞానఘనులని ప్రసిద్ధినందిన శ్రీ శ్రీ బ్రహ్మస్వరూపానంద స్వాముల దగ్గఱ బృహదారణ్యకోపనిషత్తును అభ్యసించిరి. తరువాత తత్తుల్య ప్రజ్ఞాఘనులగు శ్రీశ్రీ తపోవన స్వాములదగ్గఱ శంకర భాష్యముతో కూడిన దశోపనిషత్తులను ఆంగ్లమున అభ్యసించిరి.

శ్రీశ్రీ శృంగేరీ జగద్గురు మహాసంస్థానాధీశ్వరులును ప్రస్తుత పీఠాధిపతులైన శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య శ్రీమదభినవ విద్యాతీర్థ స్వాములవారు ఆంధ్రదేశ పర్యటనమునకు వచ్చి రాజమహేంద్రవరము

రాగాస్త్రీ వారి దర్శనమొనర్చి పవిత్రులయిరి. అటుపై గౌతమీతీరమున కోటిలింగక్షేత్రమునకు దగ్గఱగా రామకృష్ణారావు పేటను నిర్మించిరి. అక్కడి మూడు యకరముల భూమిని శ్రీవారి యనుమతిని పొంది శ్రీ జగద్గురు యాజమాన్యమున వేదశాస్త్ర గురుకుల స్థాపనకై 11--10--61 తేదీన దాన పట్టా వ్రాసి శ్రీవారికి సమర్పించిరి. శ్రీవారును ఆస్థలమున భవనమును నిర్మించి గురుకులమును ఏర్పాటు చేసిరి. దానివలన రామకృష్ణారావుగారు తమజన్మ పవిత్రమైనట్లు భావించిరి.

అటుపైన రామకృష్ణారావుగారు తైత్తరీయ ఋగ్వేద స్వరసహిత సంధ్యావందనమునకు సాయణాచార్య భాష్యానుసారముగ ప్రతిపదార్థ తాత్పర్య వివరణములతో ఆంధ్రమున ప్రకటించిరి. అట్లే మంత్రపుష్ప మును ప్రతిపదార్థ తాత్పర్యములతో తెనుగున ప్రకటించిరి. ఈ ఆసక్తి తోనే వేదవేదాంత వేదార్థములకు చెందిన ఎన్నియోగ్రంథములను సంస్కృత మున, ఆంధ్రమున, ఆంగ్లమున ఏ భాషలో దొరకినను ఉద్గ్రంథముల నన్నింటిని ఎక్కడ లభింపనివానిని సంపాదించి భద్రపరచినారు. ఈనాడు వేదవేదాంతములకు శాస్త్రములకు భాష్యములతోడను, వివరణములతోడను ఇక్కడ లభించుగ్రంథములు మరియొకచోట లభించవనుట యథార్థకథనము. ధర్మశాస్త్రము, శ్రౌతము, మంత్రశాస్త్రము మొదలగువానికి చెందిన ఎన్నో ఉద్గ్రంథములను వారు సంపాదించిరి. వీరు హోమియో వైద్యమున చాల నిష్ణాతులు. ఆవైద్యమునకు చెందిన ఎన్నియో గ్రంథములను వీరు సేక రించిరి.

ఇవియన్నియు వృథగా బీరువాలయందుండుట ఆయనకు నచ్చలేదు. వేదశాస్త్ర గురుకులమునకు ఎదురుగనున్న తనభవనమునే వేదవేదాంత హోమియో గ్రంథాలయముగా మార్చివైచినారు. అక్కడికి చదువు కొనుటకు వచ్చినవారికి సమస్త సదుపాయములు సమకూర్చి చదువుకొను అవకాశమును సమకూర్చినారు.

అంతటితో నూరుకొనక ఆంధ్రదేశమందలి వేదవేదార్థములలో ఉద్దండులైన పండితులను పిలిపించి నూటపదార్లతో వారిని సత్కరించిరి. అటుపై కుమారులకు వేదము చెప్పించు తండ్రులను పిలచి వారలను సత్కరించిరి. అదికాక యెవరైన పండితులు వేదవేత్తలు ఆ శాస్త్రమునకు, ఆ వేదమునకు భాష్యగ్రంథములు కావలెనన్నచో ఆ పుస్తకములను తాము తెప్పించి బహూకరించిరి. ఆయనకూడ నిరంతరము గ్రంథములను చదువుచు అందలి విషయములను గుర్తించి మంత్రశాస్త్రముపైనను వేదాంతముపైనను గ్రంథములువ్రాసి అచ్చునొత్తించి ధర్మప్రచారమునకు పాటుపడిరి. దానికై కావలసిన గ్రంథములు ఎక్కడ ఏరీతిగ లభించునన్నను ఆయారీతుల గ్రంథములను సంగ్రహించి గ్రంథాలయాభి వృద్ధికి పాటుపడిరి.

గ్రంథాలయము గ్రంథప్రచురణము గ్రంథప్రదానము అనునవి నిరంతరాయముగా సాగవలెనని ఆయన దృఢ సంకల్పము. అందులకై 'శ్రీ దువ్వూరి రామకృష్ణారావు ట్రస్టు' అను ఒకదానిని ఏర్పాటుచేసి తన నివాసభవనమును వలసిన సంవిధానముతో ట్రస్టుపరముచేసి కార్య నిర్వాహక వర్గమును ఏర్పరచి వీలునామావ్రాసి స్వర్గస్థులయినారు.

వారి వీలునామా ప్రకారము గ్రంథాలయము నడపుటకై పండితుని నియమింపవలెను. ఆతడందే యుండి గ్రంథాలయము సనువుగా నుంచుచు స్మార్తధర్మమునకు చెందిన గ్రంథమును వ్రాయవలెను, అది ట్రసు వారిచే ప్రకటింపబడవలెను, ఈ నియమమును బట్టియే బ్రహ్మశ్రీ ముక్కవిల్లి అన్నప్ప దీక్షితులుగారు ఈ గ్రంథాలయమును పండితులుగా పనిచేసినారు. వారి తరువాత బ్రహ్మశ్రీ రాచకొండ వేంకటేశ్వర్లుగారు **M. A.** సాహిత్య విద్యాభాషాప్రవీణ హిందీ విశారదులు ట్రస్టుకమిటిచే పండితులుగా నియమింపబడినారు. వారిని, ఉపనయనసంస్కారమును రచింప వలసినదిగా కమిటీ వారాదేశించిరి. వారా గ్రంథమును మృదుమధురశైలిలో రచించి యిచ్చిరి.

రామకృష్ణారావుగారి ధర్మప్రచారాసక్తిని గమనించిన తిరుపతి తిరుమల దేవస్థాన ధర్మరక్షణ నిధివారు ముద్రణమునకై కొంత ధన సహాయమొనర్చినారు. వారికి కృతజ్ఞులము. రచయిత శ్రీరాచకొండ వేంకటేశ్వర్లు గారు అవిరళ కృషితో రచన గావించి యిచ్చినందులకు అభినందనలు తెలుపు చున్నాము. సకాలమున సర్వాంగ సుందరముగ అచ్చువేసి యిచ్చిన శ్రీ సరస్వతీ ప్రెస్సు వారి కభినందనలు.

ఈ గ్రంథము రామకృష్ణారావుగారి యాశయానుసారముగ ధర్మాచరణాభిలాషులకు ఎనలేని సేవయొనర్చునని యాశించుచున్నాము.

ఇట్లు

దువ్వూరి రామకృష్ణారావుట్రస్టు సభ్యులు.

# కృతజ్ఞత

ఈ ఉపనయన సంస్కారమను గ్రంథమునకు సహకరించిన యితర గ్రంథ రాజములు.

1. హిందూసంస్కార్ - డాక్టర్ రాజబలీ పాండేయ
2. హిందూమతము - జటావల్లభుల పురుషోత్తంగారు
3. గౌతమ ధర్మసూత్రములు - గౌతమ ప్రణీతము
4. యాజుష పూర్వప్రయోగ రత్నాకరము
5. ఏకాగ్ని కాండ
6. యాజుష పూర్వ ప్రయోగ చంద్రిక
7. యాజుషస్మార్తానుక్రమణిక
8. స్మార్తకారికావృత్తి
9. మనుస్మృతి
10. వీరమిత్రోదయము
11. సంస్కార దీపిక - పొక్కూలూరి నృసింహశర్మగారు
12. హిందూ వివాహము (వ్యాస సంపుటి)
13. ఉపనయన వివాహవిధి - శ్రీ చర్ల గణపతి శాస్త్రిగారు

ఈ పైన ఉదహరింపబడిన గ్రంథముల రచయితలకు హృదయ పూర్వక ప్రణామాంజలి సమర్పించి కృతజ్ఞతను విన్నవించుకొనుచున్నాను.

ఇట్లు

విధేయుడు

(S. D) R. వెంకటేశ్వర్లు

# ఉపనయన సంస్కారము

# విషయ సూచిక

పుట



గ్రంథవిషయ సూచిక

---

శ్రీరస్తు

శుభమస్తు　　　　　　　　　　　　　　　　　　　　　　　　　　　　　　అవిఘ్నమస్తు

శ్రీ సీతారామాభ్యాం నమః

# ఉపనయన సంస్కారము

## సంస్కారమననేమి ?

సంస్కార శబ్దముయొక్క వ్యుత్పత్తి సంస్కృత భాషలో ఇటులఁ జెప్పఁబడియున్నది. ఈ శబ్దము 'సమ్' అను ఉపసర్గతోగూడిన 'కృఞ్' అను ధాతువునకు 'ఘఞ్' ప్రత్యయమును చేర్చగా సిద్ధమయిన రూపము. (సమ్ + కృ + ఘఞ్ = సంస్కార అని. సంస్కారము అనగా సమ్యక్కరణము, అనగా చక్కగా చేయుట.

ఈ శబ్దమును పలువురు చాలఅర్థములలో ప్రయోగించి యున్నారు.

పూర్వమీమాంసకులు యజ్ఞమున కంగభూతమైన పురోడాశము మొదలగు ద్రవ్యముల శుద్ధికొఱకు జేయు ప్రోక్షణాదులను సంస్కార మని తలచుచున్నారు.

ప్రమాణము :-

"ప్రోక్షణాది జన్యసంస్కారో యజ్ఞపురోడాశేష్టిద్రవ్యధర్మః" ।

(వాచస్పత్య బృహదభిధానము, 5-5188 పేజీ)

ప్రమాణము :-

"స్నానా చమనాది జన్యాః సంస్కారాః దేహే ఉత్పద్యమానాః తదభిమానిని జీవే కల్ప్యంతే"

(వాచస్పత్య బృహదభిధానము)

నైయాయికులు అనుభవము కలిగిన భావన తరువాత గల్గు స్మృతికి హేతువగు చున్నది. దానినే 'అనుభవజన్యా స్మృతిహేతుర్భావనా' అని చెప్పిరి. దీనినే భావనాఖ్య సంస్కారమని 24 గుణములలో నొక గుణమని వ్యవహరించిరి.

శబ్దాదుల ప్రయోగయోగ్యతకొఱకు శబ్దములను వ్యాకరణముచే శుద్ధి చేయుట సంస్కారమని వైయాకరణుల మతము.

జీవునియందు జన్మజన్మాంతరాగతవాసనా సముదాయమును సంస్కారమని మఱికొందఱును వాకొనిరి.

కాని అన్నింటిలోను సమ్యక్కరణము - అనగా చక్కగా చేయుట అను సూత్ర మగుచునే యున్నది.

కావుననే దేహేంద్రియ మనోబుద్ధుల శుద్ధికొఱకు చేయఁబడిన విశేషవిధాన రూప కర్మ సంస్కారమని మా యభిప్రాయము.

శ్రీ వీరమిత్రోదయమున సంస్కార శబ్దమునకు నిర్వచన మిట్లు చేయబడినది—

"ఆత్మశరీరాన్యతరనిష్ఠో విహితక్రియా జన్యోతిశయవిశేష స్సంస్కారః !"

ఆత్మక్కి(జీవుని) యందుగాని శరీరమందుగాని యే యే వేదవిహితము లగు క్రియల యనుష్ఠానముచే అతిశయాధానమగునో యదియే సంస్కారము.

సంస్కృత సాహిత్యములో ఈశబ్దమును సంస్కృతి, ప్రశిక్షణము, సౌజన్యపూర్ణత, వ్యాకరణ సంబంధిశుద్ధి, పరిష్కరణము, ఆభూషణము, ప్రభావము, ముద్రణము, స్మరణశక్తి, స్మరణశక్తిపై పడునట్టి ప్రభావము, శుద్ధిక్రియ, ధార్మికవిధి, విధానము, క్రియావిశిష్టత మొదలగు అర్థములందు కవులు ప్రయోగించియున్నారు.

ప్రశిక్షణము అను అర్థమందు ప్రయోగమున కుదాహరణము :-

నిసర్గసంస్కార వినీత ఇత్యసౌ
నృపేణ చక్రే యువరాజ శబ్దభాక్ ।

(రఘు వంశము 3-35)

వ్యాకరణ సంబంధి శుద్ధి :-

సంస్కారవత్యేవ గిరా మనీషీ తయా సపూతశ్చవిభూషితశ్చ ।

(కుమార సంభవే 1-28)

పరిష్కరణము :-

ప్రయుక్త సంస్కార ఇవాధికం బభౌ ।

(రఘువంశము 3-18)

ఆభూషణము :-

స్వభావసుందరం వస్తు నసంస్కార మపేక్షతే ।

(శాకుంతల 7-35)

ముద్రణము :-

యన్నవే భాజనే లగ్నః సంస్కారో నాన్యథా భవేత్ ।

(హితోపదేశము 1-8)

విధానము:-

కార్యః శరీరసంస్కారః పావనః ప్రేత్యచేహచ ।

(మనుస్మృతి 2-26)

క్రియావిశిష్టత :-

ఫలానుమేయాః ప్రారంభాః సంస్కారాః ప్రాక్తనా ఇవ ।

(రఘువంశము 1-20)

ఈ విధముగా సంస్కార శబ్దమునకు విలక్షణములయిన అర్థములందు ప్రయోగము కల దనువిషయము స్పష్టమయినది. అనగా శుద్ధికి సంబంధించిన ధార్మిక క్రియలను వ్యక్తియొక్క దైహిక మానసిక బౌద్ధిక విషయములను పరిష్కరించుటకు చేయఁబడు అనుష్ఠానము సంస్కారము అని తెలినది. దానివలన వ్యక్తి సమాజముయొక్క పూర్ణ వికాసము గల్గిన సదస్యుడు కాగల్గును. కాని హిందూ సంస్కారములలో అనేకములయిన ప్రారంభికములగు ఆలోచనలు, ధార్మికవిధి విధానములు, వాని సహవర్తులగు నియమములు అనుష్ఠానములు గూడ చేరినవి. వాని ఉద్దేశ్యమే మనగా కేవలము దేహసంబంధములగు సంస్కారములచే కాకుండగ సంస్కరించ దగినవ్యక్తియొక్క సంపూర్ణ వ్యక్తిత్వమును పరిష్కరించుట, శుద్ధిగలదిగాఁజేయుట, పూర్ణముచేయుట అనునది కూడ సంస్కారమే అయియున్నది. సాధారణముగా ఈయర్థము సర్వులకు విదితమైయున్నది— విధ్యుక్తముగా సంస్కారముల నాచరించుట వలన సంస్కరింపబడిన వ్యక్తిలో విలక్షణములు పవిత్రములునగు గుణముల ప్రాదుర్భావము గలుగును. ప్రమాణము :-

"ఆత్మశరీరాన్యతరనిష్ఠో విహిత క్రియా జన్యోఽతిశయ విశేషః సంస్కారః

(వీరమిత్రోదయము-సంస్కారప్రకాశ 1-132 పేజీ)

సంస్కార శబ్దమును ఈ సామూహికార్థమందే ప్రయోగించుట జరుగుచున్నది.

సంస్కారమనగా హిందూధర్మము లేదా ఒకధర్మముయొక్కగాని ఒక సంప్రదాయము యొక్కగాని మహత్వముగల్గిన ఒక అవయవమని కొందఱు చెప్పినారు.

ఇతిహాస ప్రారంభమునుండియు ఇవి ధర్మమునకు, సమాజమునకును పరస్పరసమన్వయమును గల్గించును. సంస్కారములు చాల పూర్వకాలము నుండియు సంప్రదాయసిద్ధములై యున్నవి. కాలక్రమమున అనేకములైన పరివర్తనములతో అవి నేడుకూడ జీవించియున్నవి. వీని వర్ణనము వేదము లందలి కొన్ని సూక్తములలోను, కొన్ని బ్రాహ్మణ గ్రంథములలోను, గృహ్యధర్మ సూత్రములలోను, స్మృతులలోను, అర్వాచీన నిబంధగ్రంథము లలోను లభించుచున్నవి.

## సంస్కారముల వైవిధ్యము :-

సంస్కారములు సామాన్యముగా 5 విధములని కొందఱు చెప్పినారు. 1. ప్రాగ్జన్మ సంస్కారములు. 2. బాల్యావస్థయందలి సంస్కారములు. 3. శైక్షణిక సంస్కారములు. 4. ఉపనయన వివాహసంస్కారములు. 5. అంత్యేష్టి సంస్కారములు.

ఆశ్వలాయన గృహ్య సూత్రములలో సంస్కారములు వివాహము మొదలుకొని అంత్యేష్టి వఱకు 11 అని చెప్పబడినవి.

పారస్కర గృహ్యసూత్రములలో సంస్కారములు వివాహము మొదలుకొని అంత్యేష్టి వఱకు 13 అని చెప్పబడినవి.

బోధాయన గృహ్యసూత్రములందు సంస్కారములు వివాహము మొదలుకొని పితృమేధము వఱకు 13 వఱకు చెప్పఁబడినవి.

వారాహ గృహ్యసూత్రములలో జాతకర్మము మొదలుకొని సీమంతోన్నయనము వఱకు 13 సంస్కారములని చెప్పఁబడినవి.

వైఖానస గృహ్యసూత్రములందు ఋతుసంగమనము మొదలుకొని పాణిగ్రహణము వఱకు 18 సంస్కారములు అని చెప్పఁబడినవి.

ధర్మ సూత్రములలో ఎక్కువ భాగము విధులగుఱించి, ప్రథల గుఱించియు వివరణము చేయఁబడినది. కావున ధర్మసూత్రములన్నిటిలో సంస్కారములన్నిటిని వర్ణించుట పరిగణించుట జరుపబడలేదు. అయినను వానిలో ఉపనయనము, వివాహము, ఉపాకర్మ, ఉత్సర్జనము, అనధ్యాయము, అశౌచము మొదలగువాని విషయములో నియమము లన్నిటికిని ఏకత్వము గన్పట్టుచున్నది.

గౌతమ ధర్మసూత్రములలో నలుబది సంస్కారములు, 8 ఆత్మ గుణములు "చత్వారింశత్సంస్కారాః అష్టౌ ఆత్మగుణాః" అని చెప్పబడినవి.

1. గర్భాధానము 2. పుంసవనము 3. సీమంతోన్నయనము 4. జాతకర్మ 5. నామకరణము 6. అన్నప్రాశనము 7. చౌలము 8. ఉపనయనము 9, 10, 11, 12 నాల్గు వేదవ్రతములు 13. స్నానము, 14. సహధర్మచారిణీ సంయోగము. 15, 16, 17, 18, 19 పంచ మహా. యజ్ఞములు, 20, 21, 22, 23, 24, 25, 26 అష్టకము, పార్వణము. శ్రాద్ధము, శ్రావణి, ఆగ్రహాయణి, చైత్రి, ఆశ్వయుజి అను ఏడు పాక యజ్ఞసంస్థలు, 27, 28, 29, 30, 31, 32, 33 అగ్న్యాధేయము, అగ్నిహోత్రము, దర్శపూర్ణిమాసేష్టులు, చాతుర్మాస్యము, ఆగ్ర (హా)యణేష్టి. నిరూఢ పశుబంధము, సౌత్రామణి అను ఏడు హవిర్యజ్ఞములు, 34. 35, 36, 37, 38, 39, 40 అగ్నిష్టోమము, అత్యగ్నిష్టోమము, ఉక్థ్య, షోడశీ.

వాజపేయము, అతిరాత్రము, అప్తోర్యామము, అను ఏడు సోమయజ్ఞ సంస్థలు- అన్నియు కలిపి మొత్తము 40 సంస్కారములని గౌతమమహర్షి ఉద్ఘాటించినాడు. ఆ మహర్షి మతప్రకారమున్న నలుబది సంస్కారములలో పంచమహాయజ్ఞములు ఐదు సంస్కారములు.

మానవుడు పుట్టుకతోడనే మూడు ఋణములతో పుట్టుచున్నాడని వేదములు చెప్పుచున్నవి- అందొకటి ఋషిఋణము, రెండవది దేవఋణము. మూడవది పితృఋణము.

ఋషి ఋణము :-

వేదములను చదువుటవలన ఋషిఋణము తీరును. ఏలనన మహత్తర తపస్సంపన్నులగు ఋషులు, మనకు వేదమునందఁజేసినారు. వారనుగ్రహించి యిచ్చినదానిని అధ్యయనమునుచేసి తరణోపాయ సాధకముగ మనముపయోగించుకొనుటయే మనము వారి ఋణము తీర్చుట.

దేవ ఋణము :-

యజ్ఞములను చేయుటవలన దేవతల ఋణము తీరును. ఏలయన దేవతలు అనుగ్రహించి మనకు జీవనయోగ్యమయిన సర్వవస్తుసమూహము నిచ్చుచున్నారు. ఆ కారణముచే వారికి కృతజ్ఞతను కనఁబరుచుటకై వారికా ద్రవ్యములో ఒకకొంత భాగమును అగ్నిద్వారా అర్పించుట మన విధియయి యున్నది. అందులకు వారు సంతృప్తులై మన జీవితమున బహువిధముల సాయపడుచు నుందురు.

పితౄణము :-

పితౄణము సంతానము కలుగుటవలన తీఱును. ఎట్లన, ఈ శరీరమును మనకు మాతాపితలిచ్చిరి, వారెట్లు మనకు జన్మనొసగిరో, అట్లే

మనమును సంతానమును కని వారి వంశము నిలఁబెట్టవలెననియు దానివలన శ్రాద్ధములనుగాని తర్పణములనుగాని చేయుదురనియు వారు కోరుచుందురు. కావున సంతానము కలుగుటవలన పితరుల ఋణము తీరును.

కవికులగురువగు కాళిదాసు "ప్రజాయై గృహమేధినామ్"

(రఘువంశము - ప్రథమసర్గ)

"సంతాన ప్రాప్తికై గృహస్థాశ్రమమును స్వీకరించువారలు కాని కేవలకామతృప్తికొరకు కాదు." అని రఘువంశపు రాజులను ప్రశంసించియున్నాడు. సంతానప్రాప్తి గృహస్థాశ్రమ ప్రయోజనములలో ప్రముఖమైనది. కావుననే తైత్తిరీయారణ్యకమిట్లు చెప్పుచున్నది.

"మం॥ ప్రజనంవై ప్రతిష్ఠా, లోకే సాధు ప్రజాయాస్తంతుం తన్వానః పితౄణామనృణో భవతి, తదేవతస్యానృణం, తస్మాత్ప్రజననం పరమం వదన్తి॥ "

(తై॥ ఆ॥ ప్రపాఠకము 10 అను 63)

గృహస్థాశ్రమ ప్రతిష్ఠకు సంతానము మూలము. పుత్రపౌత్రాది పరంపరను విస్తరింపచేయుటచేతనే మృతపితరుల ఋణము తీరును. అందువలననే సంతానోత్పత్తియే మోక్షసాధనములలో ప్రథమసోపానమని వచింతురు.

గృహస్థాశ్రమమును గూర్చిన ఒక ఆఖ్యాయిక భారతమున నిట్లు కలదు.

పూర్వము యాయావరవంశమున జరత్కారువను ఒక ఋషి జన్మించెను. అతడు మహాతపస్వియును, సంశితవ్రతుడును, ధర్మజ్ఞుడును, ఊర్ధ్వరేతస్కుడును, బ్రహ్మచారియునై యుండెను. అతడు దేశయాత్రకు బయలుదేరి, ఎక్కడ సాయంకాలమైన అక్కడ వసించుచుండెను. అతడు

ఆయాతీర్థములందు తిరుగాడుచు, తీవ్రవతపములచేతను వ్రతములచేతను శరీరమును శుష్కింపఁ జేయుచుండెను. అతడు వాయుభక్షకుడై, నిరాహారియై ఆయాతీర్థములందు సంచారము చేయుచు నతడొకచోట, నొకానొక గర్తమున తలక్రిందులుగా వ్రేలాడుచున్న తన పితరులను చూచెను. వారిని చూచి అతడు వారినిగూర్చియు, వారట్లు వ్రేలాడవలసిన దుఃస్థితికి కారణములను గూర్చియు నరయగా వారిట్లు సమాధాన మొసగిరి.

"మేము తీవ్రవ్రతములను సల్పిన యాయావరవంశమునులము మా సంతాన పరంపర సమాప్తము కాబోవు చుండుటచే మేము పితృలోకమున మాకుగల స్థానమునుండి భ్రష్టులమై యీభూమిపై పడఁబోవుచున్నాము. మా సంతాన పరంపరలో నిపు డొకడేయున్నాడు. అతని పేరు జరత్కారువు. కాని అతడు సంతానప్రాప్తికై దారసంగ్రహము చేయక మిక్కిలి మూర్ఖతతో ప్రవర్తించుచున్నాడు. నాయనా! మా దుస్థితిపై జాలిగొను నీవెవ్వరవో తెలుపఁగోరెదము. అని యనిన తన పితరులకు తన పరిచయమును తెల్పి వారిని తానెట్లు ఉద్ధరింపగలనో తెల్పు మని ప్రార్థించెను. అపుడు పితరులిట్లనిరి. నాయనా! నీవు మన వంశపరంపరను నీతోనుత్సన్నముగానీయక, దారసంగ్రహము చేసి మమ్ముల నుద్ధరింపుము. దీనివలన మేము ఉద్ధరింప బడుటయేగాక నీవుగూడ స్వధర్మమును పాటించిన వాడవగుదువు. నాయనా ! ఇతర ధర్మముల మూలమున గాని, పెక్కు కాలములు తపోవ్రతాదులను సలుపుటవలన గాని వచ్చు ఉత్తమగతులు సంప్రాప్తములగును, కావున నీవు దారసంగ్రహముచేసి సంతానమును గని మమ్ముల నుద్ధరింపుము."

శ్లో॥ యతస్వ యత్నవాం స్తాత సంతానాయ కులస్య నః ।
ఆత్మనోఽర్థే ఽస్మ దర్థేచ ధర్మ ఇత్యేవ వా విభో॥
నహి ధర్మ ఫలై స్తాత న తపోభి స్సు సంచితైః
తాం గతిం ప్రాపు్న వంతీహ పుత్రిణోయం వ్రజంతి వై॥

తద్దార గ్రహణే యత్నం సంతత్యాం చ మనః కురు ।
పుత్రకా ఽస్మన్ని యోగాత్త్వ మేతన్నః పరమం హితమ్॥
(భారతము - ఆది. 13 అధ్యాయము) శ్లో. 24, 25, 26

అపుడతడు వారి యాజ్ఞపై వాసుకి చెల్లెలగు జరత్కారువును వివాహమాడి ఆస్తీకమహర్షిని కనెనని భారతగాథ. అందువల్లనే శ్రుతి యిట్లు చెప్పుచున్నది :-

శ్రు॥ "సోఽయం పితృలోకం పుత్రేణైవ జయ్యో నాన్యేన కర్మణా"

తా. ఈ పితృలోకము పుత్రసంతానము చేతనే జయింపఁదగినది: అన్యముచేత. కాదు.

పై శ్రుత్యర్థమునే భారతములోని జరత్కారువు కథ వివరించుచున్నది.

సంతాన కాంక్ష సర్వప్రాణులకు సహజము. కాని వంశోన్నతిని గూర్చిన కోరిక మాత్రము కేవలము మానవ సమాజమునకు మాత్రమే పరిమితము. వార్ధక్యమున తాను తన జీవితమును నిరాఘాటముగ నడపుటకు సంతాన మావశ్యక మను సత్యమును కాదను వారెవరును లేరు, ఇది ఐహిక ప్రయోజనము. ఇక మరణానంతరము ప్రేతాత్మలకు తర్పణములు శ్రాద్ధాదులను గావించుట ద్వారా పితరుల సద్గతులకు పుత్రసంతానము సహాయపడునని శాస్త్రము వక్కాణించుచున్నది. ఇది పుత్రసంతానమువలన సిద్ధించు పారలౌకిక ప్రయోజనము.

ఈ మూడు ఋణములలో మొదటి ఋణము బ్రహ్మచర్యాశ్రమములోనే తీరినది. రెండవది యగు దేవ ఋణము తీరుటకు వివాహ మత్యవసరము. భార్యలేనివానికి యజ్ఞముచేయు నధికారము లేదని వేదము ఘోషించుచున్నది.

"అ యజ్ఞోవా ఏషః, యోఽపత్నీకః"

(తైత్తిరీయ బ్రాహ్మణము 22-2-6)

కావున దేవఋణము తీర్చుటకు మానవుడు దారపరిగ్రహణమును చేయవలెను. మూడవదియగు పితృఋణము తీర్చుటకు సంతానము గావలయును. స్వభార్యయందు గల్గిన సంతానమే మానవుని పవిత్రుని చేయగలదు; అన్యస్త్రీయందు గలిగిన సంతానము ప్రయోజనకారి కాఁజాలదు.

అట్టి సంతానము దేవ పితృకర్మలు చేయుటకు గూడ యోగ్యము కాదు.

సూ॥ సవర్ణా పూర్వశాస్త్ర విహితాయాం యథర్తు గచ్ఛతస్తేషాం కర్మభి స్సంబంధః ।

( ఆ. ధ. సూ. 2-12)

పైన తెల్పిన మూడు ఋణములను తీర్చవలసిన విధి వేదముల లోనే చెప్పబడియున్నది.

"జాయమానోవై బ్రాహ్మణః త్రిభిర్ ఋణవా జాయతే, బ్రహ్మచర్యేణ ఋషిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః ఏషవా అనృణోయః పుత్రీ యజ్వా బ్రహ్మచారి వాసీ॥ (తైత్తిరీయ సంహిత 6-3-10-4) ఈ శ్రుతి పూర్వోక్తమగు విషయమునే స్పష్టము చేయుచున్నది.

బ్రాహ్మణుడు మూడు ఋణములతో పుట్టుచున్నాడు. అవి ఋషిఋణము, దేవఋణము పితృఋణము, వేదాధ్యయనము వలన ఋషిఋణము తీరుచున్నది. యజ్ఞము వలన దేవఋణము తీరుచున్నది. సంతానము వలన పితృఋణము తీరుచున్నది.

దీనిని బట్టి పితరులు తరించుటకు సంతాన మావశ్యకమని స్పష్టము.

వాగ్దేవతావతారమగు కాళిదాస మహాకవి యిట్లు పైవిషయమునే చెప్పియున్నాడు :-

లోకాంతర ఫలం పుణ్యం తపోదాన సముద్భవమ్,
సంతతిశ్శుద్ధ వంశ్యా హి పరత్రే హ చ శర్మణే ॥

(రఘువంశము)

తా॥ తపము, దానము మొదలగు కార్యముల వలన కలుగు సుకృతము మరణానంతరము ఉత్తమలోక ప్రాప్తిని కలిగించును. కాని ఆ సుకృతము ఇహలోకమునగాక పరలోకమున మాత్రమే అనుభవింపబడును. ఎక్కువగా చేసినచో ఈ లోకములోనే ఫలమనుభవించవచ్చునని "అత్యుత్కటైః పుణ్యపాపైరి హైవ ఫల మశ్నుతే" అను స్మృతి చెప్పుచున్నది. లోకాంతర ఫలమ్ అనుస్మృతి తక్కువపుణ్యమును చేయువానివిషయము. కనుక ఉత్తమ వంశసంజాతమైన సంతానము ఇహలోక పరలోకము లందు సుఖప్రాప్తికి హేతుభూతము.

ఈ మూడు ఋణములను తీర్పక మోక్షము కోరగూడదని మనుస్మృతి చెప్పుచున్నది.

శ్లో॥ అనధీత్య ద్విజో వేదాన్ అనుత్పాద్య తథాసుతాన్,
అనిష్ట్వా చైవ యజ్ఞైశ్చ మోక్షమిచ్ఛన్ వ్రజత్యధః ॥

(మను— 6-3.)

ఋషులను, దేవతలను, పితరులను సంతృప్తినొందించుటకు గృహస్థు ప్రతిదినము యత్నించుచుండవలెను. ఋషియజ్ఞము, దేవయజ్ఞము, పితృయజ్ఞము అనునవి నిత్యకర్మలలోనివి, పితృయజ్ఞము పితరులకు శ్రాద్ధము నాచరించుట, లేక ఉదక దానము (తర్పణము) ను చేయుటయునై యున్నది. కాని సంతానోత్పత్తి పితృయజ్ఞ శబ్దవాచ్యము కాదు "యత్పితృభ్యః స్వధాకరోత్యప్యపస్తత్పితృయజ్ఞస్సన్తిష్ఠతే॥ తై ఆర - 2-10) అని శ్రుతిచెప్పుచున్నది - దేవయజ్ఞము దేవఋణమును (ఋషిఋణమును) చెప్పుటలేదు. దేవఋణము వేరు దేవయజ్ఞము వేరు. పఞ్చవాఏతె మహాయజ్ఞా స్సతతి ప్రతాయన్తె (తై = ఆర- 2-10) అను శ్రుతిలో యదగ్నౌ జుహోత్యపి సమిధం తద్దేవయజ్ఞస్సన్తిష్టతె। అని యున్నదిఅనగా దేవతలనుద్దేశించి "దేవేభ్యః స్వాహా" అని అన్న హోమమునుచేయుటయే ఈ పఞ్చమహా యజ్ఞములలో మొదటి దగు దేవయజ్ఞ మనబడును.

ఇక దేవఋణమును ఔపాసనాది పాకయజ్ఞములు అగ్నిహోత్రాది హవిర్యజ్ఞములు. అగ్నిష్టోమాది సోమయజ్ఞములను అనుష్టించినచో దేవ ఋణమును తీర్చినవాడగును. అంతేకాని మహాయజ్ఞ ములలోని దేవయజ్ఞ మొక్కదానినే చేసిన దేవఋణమును తీర్చినవాడు కాజాలడు. అట్లే ఐనచో మిగిలిన యజ్ఞములను ఆచరించనక్కరలేదు. కాబట్టి ఈ దేవయజ్ఞము పితృయజ్ఞము దేవఋణ పితౄణ శబ్దవాచ్యములు కావు. వీనికి తోడుగ గృహస్థు ప్రతిదినము చేయవలసినవి మఱిరెండు యజ్ఞములు గూడ గలవు. అవి మనుష్య యజ్ఞము, భూతయజ్ఞము అనునవి. ఈ పంచమహాయజ్ఞములు గృహస్థుడు ప్రతిదినమును చేయవలయును.

సూ॥ దేవ పితృ మనుష్య భూతర్షి పూజకః।

(గౌతమ ధర్మ సూత్రము 5-3)

**మనుష్యయజ్ఞము :-**

మనుష్యయజ్ఞము గృహస్థున కత్యంతము ముఖ్యము. గృహస్థుడు ఇతరాశ్రమములకులేని ధనసంపాదనాధికారము కలవాడు. ఆ ధనము నాతడు తన్ను భార్యాపుత్రులను, పిత్రాదిపోష్య వర్గమును పోషించుటకు మాత్రమే యుపయోగింపరాదు. ఆకటితోగాని, అవసరమువలనగాని యింటికి వచ్చిన మానవుని దేవభావముతో నర్చింపవలయును. దీనికే మనుష్యయజ్ఞమని పేరు.

అతిథియొక్క విద్యాశీలముల అర్హతనుబట్టి వానిని పూజించుటలో భేదముండవచ్చును. కాని యెట్టివానికైనను ఆహారమీయవలెను. సర్వజంతువులును తల్లినాశ్రయించుకొని యెట్లు బ్రతుకుచున్నవో, అట్లే సర్వమానవులును గృహస్థునాశ్రయించుకొని బ్రతుకు చున్నారు.

"యథా మాతరమాశ్రిత్య సర్వే జీవంతి జంతవః।
తథా గృహస్థ మాశ్రిత స్సర్వే జీవంతి మానవాః॥

బ్రహ్మచారులు, సన్యాసులు, మార్గస్థులు, దరిద్రులు మున్నగు వారికి శక్తికొలదియు భోజనము పెట్టుట గృహస్థుల విధియని మనుస్మృతి చెప్పుచున్నది.

"శక్తితోఽపచమానేభ్యో దాతవ్యం గృహమేధినా"

(మను-4-32)

హెచ్చు ధనము నిలువచేసికొనుటకుగాని, భోగములకొఱకే ధనార్జనము సేయుటగాని గృహస్థునకు తగదు.

గృహస్థుడగు బ్రాహ్మణుడు మరునాటికి గూడ తినుటకు దాచుకొనినచో అది యుత్తమపద్ధతి. మూడు మాసముల గ్రాసమును గల్గియుండుట రెండవపద్ధతి. ఆరుమాసములకు సరిపడు గ్రాసమును గల్గియుండుట తరువాత పద్ధతి. మూడేండ్లకు సరిపడు గ్రాసమును గల్గియుండుట చివర పద్ధతి. ఈ యంశము మనుస్మృతిలో ఈక్రింది శ్లోకములో చెప్పబడినది.

శ్లో॥ కుసూలధ్యానకో వాస్యా త్కుంభీధాన్యక ఏవవా ।
త్ర్యహైహికో వాపి భవే దశ్వస్తనిక ఏవ వా ॥

(మను-47)

ఇందులకు తగినట్లుగానే బ్రాహ్మణ గృహస్థునకు ధనార్జన విధుల ప్రాశస్త్యముకూడ నిర్ణయింపఁబడినది. ఇతరులు తమ కక్కరలేని దానినిగ భావించిన ధాన్యము, అనగా కళ్ళములలో మిగిలిన ధాన్యము మున్నగువానిని ఏరుకొని జీవించుట బ్రాహ్మణునకు ఉత్తమమయిన జీవికావిధానము. యాచింపకుండ ఎవరైన ఇచ్చినదానిని తీసికొనుట తరువాతి పక్షము; యాచించి తీసికొనుట యింకను నికృష్టము; వ్యవసాయముచే జీవించుట యింకను అధమము; వర్తకముచే జీవించుట దానికంటెను తక్కువది: సేవావృత్తిచే మాత్రము ఎన్నడును జీవింపరాదు. ఈ భావమే నిగూఢమైన పదములతో నీక్రింది మనుస్మృతి శ్లోకములలో నిమడ్చబడినది.

శ్లో॥ ఋతామృతాభ్యాం జీవేత్తు మృతేన ప్రమృతేన వా ।
సత్యానృతాభ్యామపి వా న శ్వవృత్త్యా కదాచన ॥

(మ-4-4)

ఋత ముంఛ శిలం జ్ఞేయ మమృతం స్యాదయాచితమ్ ।
మృతం తు యాచితం భైక్షం ప్రమృతం కర్షణం స్మృతమ్ ॥
సత్యానృతం తు వాణిజ్యం తేన చైవాపి జీవ్యతే ।
సేవా శ్వవృత్తి రాఖ్యాతా తస్మాత్తాం పరివర్జయేత్ ॥

కుసూలధాన్యకో వాస్యాత్. అను శ్లోకములో చెప్పిన అశ్వస్తనిక ఏవవా। అను నాల్గవవృత్తి (విధి) కలియుగము నందు నిషేధింపబడినది

భూతయజ్ఞము :-

జంతువులు, 2 విధములు. రెండు కాళ్ళ జంతువులు, నాలుగు కాళ్ళ జంతువులని. జన్మ మరణములు గలవి జంతువులు. 'జాయంతే మ్రియంతే చ జగతి జంతవః'। గృహస్థుడు జంతువుల పట్లకూడ కొంత దాతృత్వము చూపవలయును. కాకులు, కీటకములు మున్నగునవి భుజించుటకై ప్రతి దినమును భూతయజ్ఞ సమయమున కొంత ఆహారమును బయటవేయ వలయును.

"సంవిభాగశ్చ భూతేభ్యః కర్తవ్యోఽనుపరోధతః ।"

(మను-4-32)

ఈ భూతయజ్ఞములో జంతువులకన్న మిడుటయేగాక వృక్షాదులకు గూడ నీళ్ళు పోయవలయు నని కొన్ని స్మృతులు బోధించుచున్నవి.

ఈపంచ మహాయజ్ఞములును ఐదుసంస్కారములని గౌతమ మహర్షి తాను రచించిన గౌతమ ధర్మసూత్రములో చెప్పెను.

గౌతమ ధర్మసూత్రములలో ప్రథమ ప్రశ్నములో ఎనిమిదవ అధ్యాయములో 14 నుండి 22వ సూత్రము వఱకు నలుబది సంస్కారములు,

23. 24 ఆత్మగుణములు, 25.26 సూత్రములు ఆసంస్కారములయు ఆత్మ గుణములయు ప్రమోజనములును చెప్పబడినవి.

**యథాక్రమముగా వాని వివరములు;-**

## గర్భాధానము:-

స్త్రీకి పురుషునియందు మహత్త్వభావన, పవిత్రభావన లేకుండిన సంతానము కలుగఁజాలదు. ఈ విషయము వైద్యసమ్మతము. స్వస్థమగు యౌవనము, ఆరోగ్యము పరస్పరానురక్తిగల స్త్రీ పురుషులు సంతానము కనఁగోరి గర్భశుద్ధికొఱకై, వంశాభివర్ధకుడైన సత్పుత్రుడు గర్భమందు ప్రవేశించుట కొఱకై దేవతలను ప్రార్థించురూపమున చేసికొను సంస్కార గర్భాధాన మని పేరు, కావున నిది పుట్టబోవు వాని నిమిత్తమై తండ్రిచే చేయఁబడు సంస్కారము.

## పుంసవనము.-

గర్భోత్పత్తియైన పిమ్మట గర్భస్థ శిశువు పురుషుడగుటకై చేయబడు సంస్కారమునకు గర్భాదానమని పేరు. అధర్వణవేదమున ఈ సంస్కార మును గుఱించి యొక మంత్ర మిట్లు వర్ణించుచున్నది.

మం॥ ''పుమాంసం పుత్రం జనయతం పుమానను జాయతామ్।
భవసి పుత్రాణాం మాతా జాతానాం జనయాశ్చ యాన్''॥

(3-23-3)

తా॥ హే వధు! నీవు పురుష డగు పుత్రుని కనుము; పుత్రుని తరు వాత పుత్రుడే యుత్పన్నమగును అను నియమానుసారము నీవు పుత్రుల మాతవగుము.

ఈ క్రింది శౌనక వచనము గూడ పుంసవన ప్రయోజనము నీ క్రింది విధముగ వివరించుచున్నది.

"పుమాన్ ప్రసూయతే యేన కర్మణా తత్ పుంసవన మీరితమ్"

తా॥ ఏ వైదిక కర్మానుష్ఠానము వలన పురుష సంతానము కలుగునో దానినే పుంసవనమని యందురు.

సీమంతోన్నయనము :-

గర్భముయొక్క నాల్గవ మాసమందు మాతకు పాపటదిద్ది. కేశమున పుష్పములిడి చేయబడు హోమపూర్వక సంస్కారమునకు సీమంతోన్నయన మని పేరు. దీనివలన శిశువునకు దృఢత్వమేర్పడును. ఇది మొదలు తల్లి సుఖియైన కుమారుడు జనించుటకై నిత్యసుఖజీవనమును గడుపుచుండును. ఈ సంస్కారము ప్రథమగర్భమునకు మాత్రమే.

ఈసృష్టి యంతయును రెండువిధములైన శక్తులతో నిండియున్నది. అసురీశక్తులు లేక తామసశక్తులు - దైవీశక్తులు. వీనిలో దైవీశక్తులు ప్రాణియొక్క స్వస్థమైన యున్నతికి తోడ్పడును. అసురీశక్తులు ప్రాణి విఘాతమునకై పొంచియుండును. ఇట్టి ప్రాణి విఘాతుకము అగునాసుర శక్తులనుండి గర్భస్థమగు జీవిని రక్షింపకుండిన ఆగర్భము చ్యుతమగుటయో లేక నష్టమగుటయో జరుగును. అందువలన అట్టి తామసశక్తుల బారినుండి మాతృగర్భమును రక్షించుటకే 'సీమంతోన్నయనమను' సంస్కారము విహితమైనది. కావుననే ఆశ్వలాయనులు ఈక్రింది విధముగ వ్రాసిచ్చి యున్నారు.

శ్లో॥ పత్న్యాః ప్రథమజం గర్భమత్తుకామాః సుదుర్భగాః।
ఆయాంతి కాశ్చిద్రాక్షస్యో రుధిరాశన తత్పరాః ॥
తాసాం నిరసనార్థాయ శ్రియమావాహయేత్పతిః।
సీమంతకరణీ లక్ష్మీస్తామావాహయతి మంత్రతః ॥"

తా॥ భార్యయొక్క గర్భమును భక్షించుటకై రక్తపాన తత్పరతగల

కొన్ని యాసురీశక్తులు వచ్చును. భర్త వానిని నిరాకరించుటకై సీమంత కరణి యను లక్ష్మిని మంత్రపూర్వకముగా నాహ్వానించును.

అనగా సాత్త్వికశక్తుల నాహ్వానించి వానినుద్బుద్ధమొనరించుట ద్వారా గర్భవిఘాత శక్తుల నిరాకరణమే ఈ కర్మకు ముఖ్య ప్రయోజనమని స్పష్టము. స్త్రీయొక్క శోణిత మధికమైనచో స్త్రీ జనించును. అందుచే పుంసవనమును చేసినను స్త్రీయే జనించినను పుంసవన కర్మవ్యర్థముకాక ఆస్త్రీకి పురుషునకుండు జ్ఞానాదులు కలుగుటయు ఉత్తర సంతానములలో పురుషుడు జనించవచ్చును.

జాతకర్మ :-

శిశువు జనించిన తర్వాత దీనిని చేయవలయును. జనించినది మొదలు 10 రోజులలోపున రాక్షసాదులు శిశువును హింసింతురు. ఆ హింస లేకుండు టకు దీనిన్ని చేయవలయును. దీని మంత్రములలో అగ్నిహోత్రుని రాక్షసా దులను నశింపజేయుమని ప్రార్థన యున్నది. దీనిని చేయనిచో (సకాల మందు)

"జాతకర్మ నకుర్వీత పూర్వజో యది నాస్తికాత్ ।
వ్రతకావే చతత్కర్మ కుర్యాలేద్విధి పురస్సరమ్ ॥
ప్రాజాపత్యద్వయం కుర్యాచ్చౌలే వా నామకర్మణి ।"

అని గౌతమ వచనము. దశరాత్ర మధ్యలో జాతకర్మ చేయ బడనిచో నామకరణ కాలమందుగాని, చౌలకాలమందుగాని, ఉపనయన కాలమందుగాని చేయవలయును. ముందు రెండు ప్రాజాపత్య వ్రతములు ప్రాయశ్చిత్తముగా జేయవలయును-అని అర్థము.

పుత్రుడు పుట్టగానే తండ్రి ఈ సంస్కారమును చేసినచో దీనివలన పుత్రుడు దీర్ఘాయుష్మంతు డగును. పదిరోజులలోపునే రాక్షసులు హింసింతు

రని యున్నదిగదా? తర్వాత నామకరణాది కాలమందు జరిగించుట వ్యర్థము కదా? యని శంకించరాదు. పదిరోజులు అనునది యుపలక్షణము. రాక్షసులు ఎల్లప్పుడు హింసించుచునే యుందురు. తన్నివృత్తికొరకై చేయవలయును. అది పై జన్మలకు కూడ నుపయోగించును.

నామకరణము :-

"దశమ్యాముత్థితాయాగ్ం స్నాతాయాం పుత్రస్య నామ దధాతిపితా మాతేతి॥"

(ఆప-గృ-15-8)

అని ఆపస్తంబులు చెప్పిరి. తల్లి పదిరోజులు అయి స్నానముచే శుద్ధురాలైన తర్వాత తల్లిదండ్రులుభయులు పదునొకండవ దినమున నామ కరణమును చేయవలెను. దీనివలన ఈనామముతో పిలిచినచో వానికి ఆయు ష్యము కలుగును. పురుషులకు సరిసంఖ్యగల యక్షరములతోగూడిన పేర్లను స్త్రీలకు బేసిసంఖ్యగల యక్షరముల పేర్లను పెట్టవలయును. నాల్గు వర్ణ ముల వారికిని ఆయాగుణకర్మలకు తగిన పేర్లుండవలయును. ఆపేర్లకు చివర వర్ణద్యోతకములయిన పదము లుండవలయును. అనగా పేరునకు పిమ్మట బ్రాహ్మణునకు శర్మయనియు, క్షత్రియునకు వర్మయనియు వైశ్యునకు గుప్తయనియు శూద్రునకు దాస యనియు నుండవలయును.

దీనిని సకాలమున చేయని యెడల హేమాద్రి ప్రాయశ్చిత్త కాండలో ప్రాజాపత్యద్వయమును చేసి యుత్తర కర్మతో కలిపి చేయవలెనని (170వ పేజీలో) చెప్పెను.

## అన్నప్రాశనము:-

"జన్మనోఽధిషష్ఠే మాసి బ్రాహ్మణాన్భోజయిత్వా" (ఆప-గృ 16-3) అని ఆపస్తంబులు చెప్పిరి -ఇది ముఖ్యకాలము.

"ముఖ్య కాల పరిత్యాగా చ్ఛిశు ర్గుణవిహీనవాన్।
అతష్షణ్మాసతః కుర్యా దన్నప్రాశన మాదరాత్॥"

6 వ మాసములో అన్నప్రాశన చేయనిచో శిశువు సరియగు గుణములు లేక బలహీనత మొదలగు దోషములు కలవాడగును, అందుచే ఆరవ మాస మందే అన్నప్రాశన చేయవలయునని యర్థము,

మతాంతరము ననుసరించి ఆఱవ నెలలోగాని సంవత్సరము లోపున ఎప్పుడైననుగాని అనగా సరిసెలలో మగవానికి, బేసినెలలో ఆడుదానికి ఈ సంస్కారము చేయబడుటయు గలదు.

## చౌలము:-

చౌల మనగా చూడాకర్మ. ఇదియే కేశఖండనము. అనగా హోమ పూర్వకముగా ఐదుగాని మూడుగాని వారి కులాచారముగా శిఖలనుంచుట, ఇది సమంత్రకము. హోమములతో కూడినది. "జన్మనోఽధి తృతీయే వర్షే చౌలం పునర్వస్వోః" (16-3) అని ఆపస్తంబులు చెప్పిరి. అనగా పుట్టినది మొదలు మూడవ సంవత్సరములో పునర్వసు నక్షత్రమందు చౌల మును చేయవలయును. పారస్కర సూత్రములో సాంవత్సరికస్య చూడా కరణం తృతీయే వాఽప్రతిహతే" (2-1) అని చెప్పబడినది. సంవత్సరము నిండిన తరువాతగాని మూడవ సంవత్సరము దాటకుండగా గాని చౌలమును చేయవలయునని యర్థము. కొందరి మతములో ఈ సంస్కారము ఐదవ సంవత్సరములోను చేయవలయునని చెప్పబడినది పరాశరుని మతములో ఈ చౌలమును చేసినచో శిశువు దీర్ఘాయుష్మంతుడగును. చేయనిచో ఆయువు క్షీణించునని చెప్పబడినది. ఆ దోషపరిహారమునకై పరాశర గౌతమాదులు ప్రాజాపత్యద్వయాది ప్రాయశ్చిత్తములు జెప్పినారు.

ఉపనయనము:-

వేద విద్యాభ్యాసార్థము వేదమూలమున సద్గురు సన్నిధిని జరుపు సంస్కారమునకే ఉపనయనమని పేరు. బ్రాహ్మణునకు 8వ సం॥ మునను క్షత్రియునకు 11వ సం॥ మునను వైశ్యునకు 12వ సం॥ మునను ఉపనయనము గావింపవలెను. గర్భప్రవేశము మొదలుకొనియే సంవత్సరములు పరిగణింపవలెను,

సూ॥ గర్భాష్టమేషు బ్రాహ్మణం గర్భైకాదశేషు రాజన్యం గర్భద్వాదశేషు వైశ్యమ్। (ఆపస్తంబ ధర్మసూత్రం 7-1-19

సూ॥ గర్భాధాన పుంసవన సీమంతోన్నయన జాతకర్మ నామకరణాన్నప్రాశన చౌలోపనయనమ్॥

సూ॥ చత్వారి వేదవ్రతాని;- నాల్గు వేదవ్రతములు, నాల్గు సంస్కారములు. ఇవి ద్విజబ్రహ్మచారికి వేదము చక్కగా అభ్యసించుటకు జేయఁబడు సంస్కారములు

## స్నానము అనగా సమావర్తనము లేక స్నాతకము :-

సూ॥ స్నానం సహధర్మచారిణీ సంయోగః ।

స్నానము అనగా సమావర్తనము లేక స్నాతకము. గురుకులవాసము ముగించుకొని బ్రహ్మచారి ఇంటికి వచ్చి అభ్యంగనస్నాన పూర్వకముగ బ్రహ్మచర్యాశ్రమమును ముగించుటకు గావింపబడు సంస్కారమునకు స్నాతకమని పేరు.

## వివాహము (సహధర్మచారిణీ సంయోగము)

సహధర్మచారిణీ సంయోగము అనగా వివాహము. బ్రహ్మచర్యవ్రతమును ముగించిన యువకుడు తనవర్ణమునకు చెందినట్టియు, తన సవర్ణయు అసగోత్రముగల్గి ఏడుతరముల పితృబంధువులలోగాని ఐదు తరముల

మాతృబంధువులలోగాని చేరనట్టియు, మంచిలక్షణములు గల్గినట్టియు, అదివరలో వివాహిత కానట్టియు, వాగ్దత్తకానట్టియు, రజస్వల కానట్టియునగు కన్యకను వివాహమాడవలయును.

సూ॥ పంచానాం యజ్ఞానామనుష్ఠానం దేవపితృ మనుష్యభూత బ్రహ్మణామ్॥

పంచమహాయజ్ఞములు దేవయజ్ఞము, పితృయజ్ఞము, భూతయజ్ఞము మనుష్య యజ్ఞము, బ్రహ్మయజ్ఞము. అను పేర్లతో ఈ ఐదుయజ్ఞములును (ఐదుసంస్కారములును) సంస్కారముల ప్రారంభములో చెప్పబడినవి.

## సప్తపాకయజ్ఞములు :-

సూ॥ ఏతేషాం చ॥ అష్టకా పార్వణః శ్రాద్ధం శ్రావణ్యా గ్రహాయణీ చైత్ర్యాశ్వయుజీతి సప్తపాకయజ్ఞ సంస్థాః॥

ఇవి ఏడు పాకయజ్ఞములు. ఇందు స్థాలిలో పచనము గావింపబడిన కొన్ని పదార్థములు హోమము చేయబడును. అష్టకము, పార్వణము అనగా ప్రతిపత్స్థాలీపాకము, శ్రాద్ధము అనగా మాసిశ్రాద్ధము, శ్రావణి అనగా సర్పబలి, ఆగ్రహాయణి, చైత్రి అనగా శూలగవము-దీనిని ఆపస్తమ్బులు చెప్పలేదు. ఆశ్వయుజి అనగా ఇంద్రధ్వజ హోమము. దీనిని కూడ ఆపస్తమ్బులు చెప్పలేదు వారిమతములో నీ యేడును సంస్కారముల యొక్క నామములు.

సప్తహవిర్యజ్ఞములు :-

(27) (28) (29) (30) (31) (32) (33) ఇవి సప్తహవిర్యజ్ఞములు.

సూ॥ అగ్న్యాధేయ మగ్నిహోత్రం దర్శపూర్ణ మాసావాగ్రయణం చాతుర్మాస్యాని నిరూఢ పశు బంధః సౌత్రామణీతి సప్తహవిర్యజ్ఞ సంస్థాః॥

ఇవి శ్రౌతకర్మలు. అగ్న్యాధేయము. అగ్నిహోత్రము, దర్శపూర్ణ మాసేష్టులు, ఆగ్రయణము, చాతుర్మాస్యలు, నిరూఢపశుబంధము. సౌత్రా మణి యనునవి హవిర్యజ్ఞ రూప సప్తసంస్కారముల పేర్లు,

సప్త సోమసంస్థలు:-

సూ॥అగ్నిష్టోమోఽత్యగ్నిష్టోమ ఉక్థ్యషోడశీ వాజపేయోఽతిరాత్రోఽ ప్తో ర్యామ ఇతి సప్తసోమసంస్థాః॥

(34) (35) (36) (37) (38) (39) (40) సప్త సోమసంస్థలు

ఇవి మహా మంత్రములతోను, విపులక్రియా కలాపముతోను గూడి చాలదినములు నిర్వర్తింపవలసిన శ్రౌతకర్మలు. అగ్నిష్టోమము, అత్యగ్నిష్టో మము. ఉక్థ్యము, షోడశి, వాజపేయము, అతిరాత్రము, అప్తోర్యామము, అని యీ సంస్కారముల పేర్లు. ఈ శ్రౌతకర్మలు కొన్ని స్వర్గాదులను కోరి చేయ బడునవి కావున కామ్యము లని కొందఱందురు. కాని యివి కూడ నిష్కామ ముగ నాచరింపవచ్చునని కొందఱి మతము. ఎట్లయినను గౌతముడు వీనిని సంస్కారములలో లెక్కపెట్టినాడు, కనుకనే ఇవి నిత్యములు.

పైన తెల్పిన సంస్కారములలో కొన్ని నైమిత్తికకర్మలుగనే పరిగణింపదగును. నైమిత్తిక కర్మలలో తప్పక యాచరింపవలసినది శ్రాద్ధము. ఇది చేయనివాడు పతితు డగును అని శాస్త్రములు చెప్పు చున్నవి, అమావాస్యా తిలతర్పణము మున్నగునవి ఇవియును తప్పక యాచరింపవగినవి. శ్రాద్ధము నాచరింపనివాడు వర్ణభ్రష్టుడు ధర్మభ్రష్టుడు నగుటలో సందియము లేదు. ఈ సంస్కారములు సకాలములో తప్పక ఆచరింపవలయును.

ఇత్యేతే చత్వారింశత్సంస్కారాః ॥

ఈ విధముగా నలుబది సంస్కారములు వివరింపబడినవి.

## ఆత్మ గుణములు:-

హిందూమతమున కర్మకాండ కెంత యావశ్యకత యున్నను ఆత్మ గుణముల కంటెను ఎక్కువ ప్రాధాన్య మున్నది. సంస్కారము లన్నియు నున్నను ఆత్మగుణములు లేనియెడల మానవుడు తరించుట కవకాశ ముండదు.

ఎనిమిది గుణములు మానవుని కవశ్యముగ నుండవలయునని గౌతమ మహర్షి చెప్పియున్నాడు.

సూ॥ దయా సర్వభూతేషు క్షాంతి రనసూయా శౌచ మనాయాసో మంగళమకార్పణ్య మస్పృహేతి''॥ (గౌ. ధ. 8-22)

(1) సర్వభూతములయందు దయ (2) క్షాంతి (3) అనసూయ (4) శౌచము (5) అనాయాసము (6) మంగళము (7) అకార్పణ్యము (8) అస్పృహ.

ఈ యెనిమిది గుణముల కాత్మగుణము లని పేరు.

### దయ:-

చీమ మొదలుకొని సర్వ ప్రాణులపట్లను దయ గల్గియుండుట ఈ యాత్మగుణములలో మొదటిది. ఇది లేనియెడల మానవునకెన్ని యుత్తమ గుణములున్నను అతడు పశుప్రాయుడే యని చెప్పవచ్చును. భగవద్గీతకూడ ఈ దయాగుణమును నొక్కి చెప్పుచున్నది.

"అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ।'' (12-13)

ఏ ప్రాణిని ద్వేషింపరాదు. అన్నిటిపట్లను మైత్రియు దయయు కల్గియుండ వలెను.

అనేక స్థలములలో ఈ దయ బోధింపబడినది.

మన కష్టముల వంటివే ఇతరుల కష్టములు గూడ నను భావ ముండ వలెను. దీనినే గీత

"ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥

అని చెప్పినది.

ఉపనిషత్తులు కూడ "ఆత్మవత్సర్వభూతాని" అని యాదేశించినవి

పరుల కపకారము చేయకుండుట దయయొక్క ప్రాథమికావస్థ:పరుల; కుపకారము చేయుట రెండవ యవస్థ. దయాగుణముయొక్క ప్రాశస్త్య మును తెలుపుటకు వ్యాసమహర్షి యిట్లు చెప్పినాడు.

పాదద్వయేన వక్ష్యామి యదుక్తం గ్రంథకోటిషు।
పరోపకారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్॥

కోట్ల కొలది గ్రంథములచే చెప్పబడిన విషయమును రెండు పాదము లలో చెప్పుచున్నాను, పరుల కుపకారము చేయుట పుణ్యము, అపకారము చేయుట పాపము.

ఏ భూతమును హింసింపరాదని ఉపనిషత్తులు చెప్పుచున్నవి,
అన్యత్రతీర్థేభ్యః। ఛాం - ఉ

తీర్థేభ్యః = యజ్ఞములకంటె, అన్యత్ర = మరి యొకస్థల మందు అని యర్థము. అనగా యజ్ఞములలో పశ్వాలంభము హింస కాదు. యజ్ఞములయందుకాక ఇతరత్ర హింస హింసయే. యజ్ఞములలో పశ్వాలంభము హింస యన్నచో అగ్నిష్టోమాదులు సంస్కారములు కానే కావు. కనుకనే మనువు

యజ్ఞార్థం పశవః సృష్టాః స్వయమేవ స్వయంభువా।
యజ్ఞోహి భూత్యై జగతస్తస్మాద్యజ్ఞే వధోఽవధః॥

అని చెప్పినారు. అనగా బ్రహ్మ యజ్ఞముల కొరకే పశువులను సృజించినారు. యజ్ఞములు ప్రపఞ్చము (జగత్తు) యొక్క శ్రేయస్సుకొర

నిర్మించ బడినవి. కనుక యజ్ఞములలోని పశ్వాలంభ్యము వధకాదు. అని యర్థము. ఈ వచనముచే పిష్ట పశ్వనుష్ఠాతలు దూరాపాస్తులు.

"మా హింస్యాత్సర్వా భూతాని" అని మన గ్రంథములలో నెచట చెప్పబడినను దయ సర్వభూతములయందును అనియే చెప్పబడినది గాని ఒక్క మానవులయందే యని చెప్పఁబడలేదు. కనుక పశుపక్ష్యాదులను చంపుటయు. వాని మాంసమును భక్షించుటయు మహాపాపముగ చెప్పబడినది. మనుధర్మ శాస్త్రములో నిట్లు కలదు.

శ్లో॥ నా కృత్వా ప్రాణినాం హింసాం
మాం సముత్పద్యతే క్వచిత్,
న చ ప్రాణివధ స్స్వర్గ్యః
తస్మా న్మాంసం వివర్జయేత్॥

(మను- 5-48)

ప్రాణులను హింసించకుండ మాంస మెచ్చటను లభింపదు, ప్రాణులను చంపుట స్వర్గ హేతువు కాక నరక హేతు వగుచున్నది. కావున మాంసమును విడచి పెట్టవలయును.

"ఈ లోకములో నేనే జంతువు యొక్క మాంసమును తినుచున్నానో ఆ జంతువు పరలోకములో నన్ను తినును కావున మాంసమున కా పేరు వచ్చినదని (అనగా మాం = నన్ను, సః = అది తినును అని గుర్తెఱుగ వలెనని మనువు చెప్పుచున్నాడు,

"మాం స భక్షయితాముత్ర
యస్య మాంస మిహాద్మ్యహమ్,
ఏతన్మాంసస్య మాంసత్వం
ప్రవదంతి మనీషిణః॥ (మను- 5-35.

ఇదియంతయు శరీర పోషణకొరకుచేయు హింసా విషయము)

భూతదయలో ప్రధానాంగమైన యహింస అముఖ్య ధర్మము కాదు. "అహింసా పరమోధర్మః" (మ. భా. ఆ. 11-13) అని వ్యాసమహర్షి దీనిని కీర్తించినాడు.

భగవద్గీతలో ఎచ్చట పట్టిన నచ్చట,

"అహింసా సత్యమక్రోధః"

"అహింసా సమతా తుష్టిః"

మున్నగు వాక్యములచే నహింసాధర్మము విధింపబడి ప్రశంసింపఁబడినది. పూర్ణమైన యహింసనుపాటించు వానియెదుట మానవులే కాక క్రూర జంతువులు కూడ తమ హింసాస్వభావమును విడచివేయును. అహింసయొక్క ఈ ప్రత్యక్ష ఫలము పురాణ గాథలవలన తెలియుటయే గాక పతంజలి మహర్షిచే రచింపబడిన యోగసూత్రములోలకూడ చెప్పఁబడినది.

"తత్సన్నిధౌ వైర త్యాగః" (యో. సూ. 2-36)

**క్షాన్తి!**— రెండవ యాత్మగుణము క్షాంతి. ఎట్టిబాధల నైనను సహించుటయే క్షాంతి యనబడును. క్షమ అనునది నామాంతరము. ఆ బాధలు శీత వాతాతపాదులనుండి గాని మానవుల వల్లనుండి గాని తటస్థించవచ్చును. వానిని భరించునపుడు విచారమును పొందరాదు. వానిని గల్గించిన మానవుని పట్ల ద్వేష ముండరాదు. ఈ క్షాంతికే తితిక్ష యని పేరు.

ఈ తితిక్ష కుత్తమోదాహరణము ఒకచెయ్యి చందనములోను మరొకచెయ్యి అగ్నిలోను ఉంచినను తన మనస్సునకొకే విధముగ నుండు నని యుధిష్ఠిరుడు మహాభారతములో చెప్పిన వాక్యములు. ఈ విధముగ కష్టములను సహించుట మనమేలు కొఱకే గాని యితరుల యుపకారము కొఱకుగాదు. కష్టములను సహించుట యలవడినచో మనము కష్టమును జయించినవార మగుచున్నాము అన్నమాట. దయ యితరుల కుపకరించును,

కాని క్షాంతి మనకే యుపకరించును. క్రమాభ్యాసము వలన, శీతోష్ణాది బాధలు, పరు లవమానము చేయుటచే వచ్చుబాధలు- అన్నియు సులువుగా భరించు శక్తిగల్గును. దీనివలన దుఃఖము దూరమగును. ఏతదభ్యాస వశముచేత మరణానంతరమున సూక్ష్మశరీరము ప్రయాణముచేయు వివిధ లోకములలో గల్గు బాధలు కూడ అనాయాసముగ భరించుటకు వీలు గల్గును. దివ్యజ్ఞాన సమాజము వారును ఈ విధముగనే నుడువుచున్నారు. జీవిత కాల ములో సర్వవిధముల మనకు కష్టసహిష్ణుత కలుగనిచో అకస్మాత్తుగ మరణానంతరమున అది రాదు. ఆ కారణముచే ఈ జన్మలోను, అనంతరము నను గూడ మనశ్శాంతి కలుగవలెనన్నచో ఈ తితిక్షాగుణము నలవఱచు కొనపలెను. ఈ సందర్భమున ఈ క్రింది గీతా శ్లోకమును జ్ఞప్తియందుంచు కొనవలెను.

"శక్నోతీ హైవ యస్సోఢుం ప్రాక్ఛరీర విమోక్షణాత్!
కామ క్రోధోద్భవం వేగం సయుక్త స్స సుఖీనరః॥ (5-23)

ఎవడీ లోకములోనే, శరీరమును విడచుటకు పూర్వమే కామక్రోధ ముల వేగమును సహించుటకు సమర్థుడగునో వాడే యోగి. వాడే సుఖవంతుడు.

తితిక్ష యలవఱచుకొనుటకు ముఖ్యసాధనము "బాధ యింద్రియధర్మ ముగాని యాత్మధర్మము కాదని" మననము చేయుటయే.

"మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణ సుఖదుఃఖదాః॥
ఆగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారత॥ (గీత 2-14)

"పంచతన్మాత్రలతోడి స్పర్శలు శీతోష్ణ సుఖదుఃఖముల నిచ్చును. అవి వచ్చుచు పోవుచుండును. ఓ యర్జునా! వానిని సహింపుము" అను మాటలను జ్ఞప్తియందుంచుకొని మనన సాధన మనము అలవఱచుకొన్నచో

అనుభవింపబడుచున్న దుఃఖము సగము తగ్గునని యనుభవజ్ఞులు చెప్పుదురు.

**అనసూయ:-** అసూయ లేకపోవుట అనసూయ. మూడవ ఆత్మగుణము అనసూయ. ఇతరున కే విధమయిన అభివృద్ధి కల్గినను అందులకై బాధపడకుండుటయు, వానిని ద్వేషింపకుండుటయు అనసూయ అని చెప్పబడును. అసూయ హృదయమును చిచ్చువలె కాల్చుటయే కాక ఒకప్పు డితరునకు హానిని గూడఁ గల్గించునట్లు పరిణమింప వచ్చును. కావున అనసూయ రెండు విధములుగా అనర్థమునకు హేతువు. దానిని తప్పక విడువవలయును.

శౌచము :-

నాల్గవ యాత్మగుణము శౌచము. శరీరమును, మనకు సంబంధించిన వస్తువులను, వాక్కును, మనస్సును గూడ పరిశుద్ధముగ నుంచుకొనుటయే శౌచము. శరీరమునకును మనస్సునకును గల సంబంధమును మన ప్రాచీనులును, ఆధునికులును గూడ నంగీకరించినారు. శారీరశౌచము లేనివారికి మనశ్శుద్ధి యుండదు, వాచిక శౌచము వలన రెండు ప్రయోజనములు కలవు, (1) సత్యభాషణము, ప్రియహిత భాషణము మున్నగునవి వాచిక శౌచము లోనివి. ఇవి పుణ్యప్రదకర్మలు. వీని వలన జన్మాంతరమందును లోకాంతర మందును. ఉత్తమగతి కల్గును. అసత్యము, వాక్పారుష్యము మున్నగునవి వాచికాశౌచములోనివి, వీని వలన వ్యతిరేకఫలము కల్గును. (2) వాక్శుద్ధి వలన మనశ్శుద్ధి గూడ కల్గును. కావున వాక్ఛుద్ధి యభ్యుదయమునకు హేతువగును. ఇక మనశ్శుద్ధివలన గల్గు ఫలములు :- (1) మనశ్శుద్ధి సత్త్వగుణ లక్షణము; సత్త్వము జ్ఞానద్వారము. కావున మానవునకు మనశ్శుద్ధి తరించుటకు సాధనమగును. (2) మనశ్శుద్ధి వలన ధర్మాసక్తి నిష్కామ కర్మాసక్తి కల్గును; వీనివలన జ్ఞానము లభించును.

ఈవిధముగా నాల్గు విధములయిన శౌచమును గల్గియుండుట దైవ సంపత్తులోనిది; ఈ శౌచగు లేకుండుట యాసుర సంపత్తులోనిది. భగవానుడు గీతలలో అసుర ప్రకృతిగల వారిని వర్ణించుచు వారికి శౌచము లేదనినాడు.

"న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే।"

(16-7)

నిత్యము స్నానము ఆచరించి ధౌతవస్త్రములను ధరించుట శారీరతపస్సులో నొకటి. ముఖ్యమయిన శరీరశౌచమును గాపాడుకొనుటకు భగవద్గీతలో చెప్పబడిన ఈ క్రింది శారీరక తపస్సు నాచరించుచుండవలయును.

"దేవ ద్విజ గురుప్రాజ్ఞ పూజనం శౌచమార్జవమ్ ।
బ్రహ్మచర్య మహింసాచ శారీరం తప ఉచ్యతే॥"

(గీత - 17 - 14)

దేవతలను, బ్రాహ్మణులను, గురువులను, జ్ఞానులను పూజించుట, పరిశుద్ధముగానుండుట, ఋజుప్రదర్శనగలిగి స్వభార్యేతర స్థలముల బ్రహ్మచర్య మవలంబించుట ఎవ్వరికిని హింసచేయకుండుట - అనునవి శారీరక తపస్సు అని చెప్పబడును, ఇందు బ్రహ్మచర్యమువలన విశేష ప్రత్యక్ష ఫలము కూడ గలుగును. బ్రహ్మచర్యమువలన శారీరిక మానసికాధ్యాత్మిక శక్తు లపారముగ వర్ధిల్లును. ఈ శక్తులు బ్రహ్మచర్యమువలన వృద్ధి పొందినటు ఆహారాదుల వలన వృద్ధిపొందవు.

"బ్రహ్మచర్య ప్రతిష్ఠాయాం వీర్యలాభః" అని పతంజలిమహర్షి చెప్పినాడు.

(యో. సూ. 2-38)

వాచికశౌచ మలవడుటకై యీ క్రింది వాచిక తపస్సును చేయవలయును.

అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్ ।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే॥
(గీత - 17-15)

ఎవ్వరికిని భయము కలిగింపని మాటలు పల్కుట సత్యమునే పల్కుట, ఇంపుగనుండునట్టియు ఎదుటవానికి మేలుచేయునట్టియునగు వాక్యమునుపల్కుట, వేదాభ్యాసము చేయుట - అనునవి వాచిక తపస్సు అని చెప్పబడును.

మానసిక శౌచమలవడుటకై యీ క్రింది మానసిక తపము సల్పవలయును.

మనః ప్రసాద సౌమ్యత్వం మౌనమాత్మ వినిగ్రహః ।
భావ సంశుద్ధి రిత్యేతత్తపో మానస ముచ్యతే॥
(గీత - 17-16)

మనస్సు ప్రశాంతముగానుండుట, దుష్టభావములు లేక సద్భావములు గల్గియుండుట మానము వహించుట, ఇంద్రియములను నిగ్రహించుట, భావశుద్ధి గల్గియుండుట యనునవి మానసికతపస్సు అని చెప్పబడును.

## అనాయాసము

అయిదవ యాత్మగుణమును అనాయాసము. శక్తికి మించిన ధర్మములను చేయబూని కాని, పరహింస మున్నగు ధర్మములలోగాని శారీరక మానసికాయాసములను పొందువాడు తమోలక్షణోపేతుడు, ఆసుర ప్రకృతిలోని వాడు అని గీత చెప్పుచున్నది. ఇందు మొదటిదాని కిదివరలో ప్రమాణము చూపఁబడినది. రెండవదానికి గీతలోని యీ క్రింది వాక్యమును తీసికొనవచ్చును.

ఏకాహమ్ :-

కర్శయంతః శరీరస్థం
భూతగ్రామ మచేతసః ।
మాం చైవాంత శ్శరీరస్థం
తాన్విద్ధ్యాసుర నిశ్చయాన్॥

(గీత - 17-6)

(11) బుద్ధిహీనులు అహంకారయుక్తులై. ఘోర తపస్సుచేయుచు తమ శరీరములోనున్న పంచభూతములను, అందేయున్న నన్ను గూడ కృశింపఁ జేయుచున్నారు. అట్టి వారాసుర నిశ్చయము కలవారు.

కావున భగవంతునకు నివాసమైన మన పవిత్రశరీరమును వ్యర్థముగా గాని, యహంకారయుక్త కార్యముల కొఱకు గాని బాధ పెట్టుట యన, నందలి పరమేశ్వరుని హింసపెట్టుటయే యని గ్రహింపవలెను.

ఎల్లప్పుడును సంతోషముతో నుండుట యుత్తమ పురుష లక్షణముగ శాస్త్రములో చెప్పబడినది.

"సంతుష్ట స్సతతం యోగీ ।"
"అహింసా సమతా తుష్టిః"

మున్నగు గీతావచనములు సంతుష్టిని ఉత్తమ లక్షణముగ చెప్పినవి. ఎట్టి ప్రబల బాహ్య హేతువులున్నను, ఆంతరంగికముగ మనస్సును కలతనొందనీయకుండుటకు "మనః ప్రసాదమని పేరు. ఇట్టి మనః సౌఖ్యమును నిరంతర మనుభవించుట యనాయాసమునకు పరమావధి యగును.

## మంగళము

ఆరవ ఆత్మగుణము మంగళమనునది. నిరంతరము మనము శుభమునే తలచుచుండవలయును, శుభమునే వినుచుండవలయును; చూచు

చుండవలయును. ఇట్లు మనస్సహితములైన ఇంద్రియములను మాంగళ్యము వైపునకే త్రిప్పుదుమేని, మన కమంగళము ప్రతిహతమై నిత్యమగు శుభము చేకూరును. ఇది మనస్సు యొక్క శక్తి. యోగు లిట్లు చెప్పుదురు- ఒక అమంగళభావము మన పరిసరములనున్న వాని కొకనికున్న యెడల, అది మనకు కనబడకుండా మనలో కూడ ప్రవేశించి మన మనస్సును గూడ కొంచెము మలిన పఱచును అని. కావుననే అమంగళపదము నోటితో నుచ్చరింపరాదని మన మహర్షులు చెప్పిరి. అమంగళమును తప్పనిసరిగా తెలుపవలసినప్పుడు సంకేతముగా మంగళపదమునే వాడవలయునని ధర్మ శాస్త్రకర్తలు చెప్పిరి.

"అభద్రం భద్రమితి బ్రూయాత్"

గౌ. ధ. సూ. 9-21

వట్టిపోయిన ఆవును తెల్పుటకు శ్రేష్ఠధేను వాచకమైన "ధేను భవ్యా" అను శబ్దమును వాడవలయును. ఇట్లే తెలుగులో కూడ ఇంటిలో బియ్యమయిపోయినపుడు 'బియ్యము నిండుకొన్నవి' అనవలయును.

ఈవిధముగా సర్వప్రయత్నములచేతను మానవుడు జీవితమును శుభోపేతము గావించుకొనవలయును.

## అకార్పణ్యము

ఏడవ యాత్మగుణము అకార్పణ్యమనునది. అనగా ఎన్నడును దీన భావమును పొందకుండుట.

ఒక కష్టము కల్గినపుడు దానిని తప్పించుకొనుటకు గాని, యొక లాభమును పొందుటకుగాని ఆత్మ గౌరవమును విడచి, యెదుటవానినుండి సహాయముకోరి, వానికొరకై వానికి దాసుడుగ వ్యవహరించుట దైన్యము

కావున నిట్టి దైన్యపరుడు భగవంతునియందు విశ్వాసము లేనివాడగు చున్నాడు. దుఃఖములయందు భయము, సుఖములయందు కోరిక లేకుండ వలెనని గీతోపదేశము గదా.

"దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగత స్పృహః"

(2-56)

ఇది యలవరుచుకొని తనకు భగవంతుడు కల్పించిన దానితోనే తృప్తిపడుచుండవలయునని (యదృచ్ఛా లాభ సంతుష్టః) కూడ గీత చెప్పు చున్నది. భగవంతుడు సర్వజ్ఞుడు. కావున, మనకేది కావలయునో యతనికే తెలియునను విశ్వాసముతోనుండు వాని యోగక్షేమములను భగవంతుడే వహించును.

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥"

(ఇతరుల నాశ్రయింపనివారై నన్నే తలంచుచున్నవారై యే ఱు నన్ను సేవింతురో, నిత్యయుక్తులైన యట్టి వారి యోగక్షేమములను ఱ వహించుచున్నాను.)

అని భగవానుడు చెప్పియున్నాడుగదా! కావున దైన్యమును పొందుటయన భగవంతునియందు నమ్మకములేకుండుటను ప్రకటించుటయే. ాతియేకాక, దైన్యావస్థలో మానవు డెదుటవానిని సంతోషపఱచుట కెట్టి ఁకార్యముల నయినను చేయవలసి వచ్చును, మనము చేయు కార్యములు వత్ప్రీత్యర్థముగా నుండవలయును గాని, కేవలము మానవ ప్రీత్యర్థ ముగ నుండరాదు. కావున సర్వులును దైన్యమును విడచి యుండవలయును,

# అస్పృహ

'అస్పృహ' అనునది యెనిమిదవ ఆత్మగుణము. అనగా కోరికలు లేకుండుట. మానవుని గొప్పతనమును నిర్ణయించుటలో కామ విషయము కొలతబద్ద. మానవునకు కోరిక లెంత హెచ్చుగానున్న వాడంత నికృష్టుడు అనగా తక్కువవాడు. కోరిక లెంత తక్కువగానున్న నంత యుత్తముడు. ఏమియు కోర్కెలులేనివాడు సర్వోత్తముడు. అట్టి స్థితికి వచ్చి యాత్మ పదార్థముతోనే క్రీడించువా డుత్తీర్ణుడైనట్లు గ్రహింపవలయును అని గీత చెప్పుచున్నది.

"ప్రజహాతి యదా కామాన్ సర్వాన్పార్థ మనోగతాన్ ।
ఆత్మన్యేవాత్మనా తుష్ట స్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥
(2-25)

కావుననే మనుస్మృతియు జీవిత విధానము కామగ్రస్తము కాకూడదని చెప్పుచున్నది.

"కామాత్మతా నప్రశస్తా" (2-2)

ఇతరులు తమంత తామేదియైన దాన మొసగినను గ్రహింపకుండుట అస్పృహయొక్క పరమావధి. ఇట్టి గుణమునకు అపరిగ్రహమని పేరు. పరిగ్రహమువలన దాతయొక్క పాపము పరిగ్రహీతకు సంక్రమించునని వేదము (తై. ఆ. 2-15) చెప్పుచున్నది. పూర్తిగా అపరిగ్రహము పాటించు వాని మనస్సు కాలుష్యరహితమై పూర్వజన్మ వృత్తాంతమును గూడ తెలిసి కొనుటకు సమర్థమయి యుండును. దీని వలన జన్మకు కారణమేమో స్పష్టమగును; జన్మరాహిత్య సంపాదనకు మార్గము గోచరించును. దీనినే-

"అపరిగ్రహస్థైర్యే జన్మ కథంతా సంబోధః" అని పాతంజలియోగ సూత్రము (2-39) చెప్పుచున్నది.

కావున నిట్టి దైన్యపరుడు భగవంతునియందు విశ్వాసము లేనివాడగు చున్నాడు. దుఃఖములయందు భయము, సుఖములయందు కోరిక లేకుండ వలెనని గీతోపదేశము గదా.

"దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగత స్పృహః"

(2-56)

ఇది యలవరుచుకొని తనకు భగవంతుడు కల్పించిన దానితోనే తృప్తిపడుచుండవలయునని (యదృచ్ఛా లాభ సంతుష్టః) కూడ గీత చెప్పు చున్నది. భగవంతుడు సర్వజ్ఞుడు. కావున, మనకేది కావలయునో యతనికే తెలియునను విశ్వాసముతోనుండు వాని యోగక్షేమములను భగవంతుడే వహించును.

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥"

(ఇతరుల నాశ్రయింపనివారై నన్నే తలంచుచున్నవారై యే జనులు నన్ను సేవింతురో, నిత్యయుక్తులైన యట్టి వారి యోగక్షేమములను నేను వహించుచున్నాను.)

అని భగవానుడు చెప్పియున్నాడుగదా! కావున దైన్యమును పొందుటయన భగవంతునియందు నమ్మకములేకుండుటను ప్రకటించుటయే. అంతియేకాక, దైన్యావస్థలో మానవు డెదుటవానిని సంతోషపఱచుట కెట్టి పాపకార్యముల నయినను చేయవలసి వచ్చును. మనము చేయు కార్యములు భగవత్ప్రీత్యర్థముగా నుండవలయును గాని, కేవలము మానవ ప్రీత్యర్థ ముగ నుండరాదు. కావున సర్వులును దైన్యమును విడచి యుండవలయును,

# అస్పృహ

'అస్పృహ' అనునది యెనిమిదవ ఆత్మగుణము. అనగా కోరికలు లేకుండుట. మానవుని గొప్పతనమును నిర్ణయించుటలో కామ విషయము కొలతబద్ద. మానవునకు కోరిక లెంత హెచ్చుగానున్న వాడంత నికృష్టుడు అనగా తక్కువవాడు. కోరిక లెంత తక్కువగానున్న నంత యుత్తముడు. ఏమియు కోర్కెలులేనివాడు సర్వోత్తముడు. అట్టి స్థితికి వచ్చి యాత్మ పదార్థముతోనే క్రీడించువా డుత్తీర్ణుడైనట్లు గ్రహింపవలయును అని గీత చెప్పుచున్నది.

"ప్రజహాతి యదా కామాన్ సర్వాన్పార్థ మనోగతాన్ ।
ఆత్మన్యేవాత్మనా తుష్ట స్థితప్రజ్ఞ స్తదోచ్యతే॥
(2-25)

కావుననే మనుస్మృతియు జీవిత విధానము కామగ్రస్తము కాకూడదని చెప్పుచున్నది.

"కామాత్మతా నప్రశస్తా" (2-2)

ఇతరులు తమంత తామేదియైన దాన మొసగినను గ్రహింపకుండుట అస్పృహయొక్క పరమావధి. ఇట్టి గుణమునకు అపరిగ్రహమని పేరు. పరిగ్రహమువలన దాతయొక్క పాపము పరిగ్రహీతకు సంక్రమించునని వేదము (తై. ఆ. 2-15) చెప్పుచున్నది. పూర్తిగా అపరిగ్రహము పాటించు వాని మనస్సు కాలుష్యరహితమై పూర్వజన్మ వృత్తాంతమును గూడ తెలిసికొనుటకు సమర్థమయి యుండును. దీని వలన జన్మకు కారణమేమో స్పష్టమగును; జన్మరాహిత్య సంపాదనకు మార్గము గోచరించును. దీనినే-

"అపరిగ్రహస్థైర్యే జన్మ కథంతా సంబోధః" అని పాతంజలియోగ సూత్రము (2-39) చెప్పుచున్నది.

(తా॥ పూర్వజన్మలో నేనెవడను? ఎటువంటివాడనై ఉంటిని? ఎటువంటి కర్మ చేసితిని అను జిజ్ఞాస కల్గినపుడు ఆ విషయమంతయు ఈయోగి బాగుగా తెలిసికొనగలడని భావము.) అపరిగ్రహస్థైర్యమున్నపుడు యోగి కాగలడు. యోగియైనపుడు ఆ విషయములు తెలిసికొనగలడని తాత్పర్యము.)

స్పృహయొక్క అథమ పరిణామము స్తేయము. అనగా చౌర్యము. మనసులో కూడ పరుల సొత్తున కాశింపని వానికి ప్రకృతి దేవతయే సమస్త సంపదలు క్రమముగా చేకూర్చునని యోగశాస్త్రము చెప్పుచున్నది.

"అస్తేయ ప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానమ్"

(2-37)

ధర్మమునందును, భక్తియందును, మోక్షమునందును కోరికలేనివాడయినచో మానవుడు తరింపలేడు. కావున ఈ కోరికలు వర్జనీయములుకావు.

# సత్యము

పైన తెలుపబడిన ఆత్మగుణములలో శౌచ మందంతర్భూతమైనది సత్యము. "సత్యాన్నాస్తి పరోధర్మః" అని మహర్షులు బోధించిరి.

అహింసగూడ నిట్టిదిగనుకనే సత్యాహింసలు జోడింపబడి గీతాది గ్రంథములలోఁ జెప్పఁబడినవి.

సత్యము చెప్పవలయును. ప్రియమును చెప్పవలయును. కాని యితరులకు కష్టమును కలిగించు సత్యమును పలుకరాదు. ఒక దరిద్రునిజూచి "నీవు పేదవాడవు" అనుట వ్యర్థముగా బలుకఁబడిన సత్యమగును. ఇట్టి సత్యములను పలుకగూడదు. ఒకనికి ప్రియము గల్గునుగదాయని అసత్యమెన్నడును పలుకరాదు. ఇది సనాతన ధర్మమని మనుస్మృతి చెప్పుచున్నది.

శ్లో. సత్యం బ్రూయాత్ప్రియం బ్రూయాన్న బ్రూయాత్సత్య మప్రియమ్
ప్రియంచ నానృతం బ్రూయాదేష ధర్మస్సనాతనః ॥

(మను - 4-138)

సర్వస్వమును పరిత్యజించియైనను సత్యమును రక్షించుకొనవల యును. తనను బ్రహ్మర్షియని యనవందులకు విశ్వామిత్రుడు వసిష్ఠుని కుమారులను నూర్వురను చంపెను. తాను నమ్మని విషయమునుచెప్పి యసత్య దోషము కట్టుకొనుటకు వసిష్ఠమహర్షి యంగీకరింపలేదు. తుదకు విశ్వామిత్రుని రజోగుణము పూర్తిగా నణగిన పిమ్మట నాతనిని బ్రహ్మర్షి యనెను. "ముందుగనే యని యుండినచో నీ కుమారులు బ్రతికి యుండెడి వారుకదా!" యని విశ్వామిత్రుడు పలికెను. అందులకు వసిష్ఠుడు "అప్పటికి నీకింకను బ్రహ్మత్వము రాలేదు. కుమారులను బ్రతికించుకొనుటకు అసత్య మాడఁదగునా? నూర్గురు కుమారుల కంటెను ఒక్క సత్యవాక్యము గొప్పది" యని జవాబిచ్చెను.

"సత్యం పుత్రశతాద్వరమ్"

వేదములలో గూడ సత్యము ప్రథమ ధర్మముగనే చెప్పఁబడినది. విద్యను ముగించుకొని గురుకులమును వీడిపోవుచున్న శిష్యునకు గురువు చేయు నుపదేశములో మొట్టమొదట "సత్యంవద" అనియె కలదు. (తై. ఉ. 1-1) కావున హిందూమతములో సత్యముయొక్క స్థానము అద్వితీయమయి యున్నది. ఎన్నడు నసత్యము పలుకనివాని నోటినుండి యే వాక్కు వచ్చినను అది యథార్థమగును. అట్టివానికి కార్యసిద్ధి కితరములగు సాధనములక్కరలేదు. అతనివాక్కే గొప్పక్రియాసాధనము ఈఅంశము నీ క్రింది పాతంజలి సూత్రము తెల్పుచున్నది.

"సత్య ప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వమ్"

(యో. సూ. 2-36)

పైన తెల్పబడిన ఆత్మగుణములకు పిమ్మట పేర్కొనఁదగిన యుత్తమ లక్షణములనేకములు గలవు. వేదములందు, ధర్మశాస్త్రములందు, ఇతిహాసములందు, పురాణములందును అవి బహువిధములుగా ప్రతిపాదింపబడి యున్నవి. పితృభక్తి, మాతృభక్తి, గురుభక్తి, అతిథిపూజ, సజ్జన సహవాసము, వినయము మొదలగున వెన్నియో గలవు.

తల్లిదండ్రుల ఋణము నూరుజన్మలలోనైనను తీరదని మనుస్మృతిలో చెప్పఁబడి యున్నది.

"యం మాతాపితరౌ క్లేశం సహేతే సంభవే నృణామ్।
నతస్య నిష్కృతిశ్శక్యా కర్తుం వర్షశతైరపి ॥

(మను - 2-27)

కావున తల్లిదండ్రులను దైవముగా భావింపవలెను. తైత్తిరీయోపనిషత్తులో ఇట్లు చెప్పఁబడియున్నది.

మాతృదేవోభవ ।
పితృదేవోభవ ।
ఆచార్యదేవోభవ ।
అతిథిదేవోభవ ।" (11-2)

తల్లియే, తండ్రియే, ఆచార్యుడే, అతిథియే దైవముగాగలవాడవగుము.

## దానము

దానముగూడ నిట్టి యుత్తమ గుణములలో నొకటి. శ్రద్ధతో దానము సేయవలయును. (సత్పాత్రమునందు దానము చేయుటయే ముఖ్యము. ఒకవేళ అపాత్రులగువారలకు దానమునీయవలసివచ్చుట తటస్థించినను తానుమాత్రము శ్రద్ధకల్గియే అట్టి వారలకును దానమునీయవల

యును) అశ్రద్ధతో దానము నాచరింపఁగూడదు. తనవిభవము ననుసరించి దానము చేయవలయును. లజ్జకల్గి దానము చేయవలయును. తాను ఎక్కువగా ఈయలేకపోతినే యని సిగ్గుతో దానము చేయవలయును. పరలోక భయముకల్గి యీయవలయును. మిత్రులు మొదలగువారికి వివాహాది కార్యములందుచేయు సత్కారము సంవిత్తు అట్టి. సంవిత్ దానము చేయవలయును — అని తైత్తిరీయోపనిషత్తు చెప్పుచున్నది. (11-3)

శ్రద్ధయా దేయమ్ । అశ్రద్ధయా ఽ దేయమ్ ।
శ్రియా దేయమ్ । హ్రియా దేయమ్ ।
భియా దేయమ్ । సంవిదా దేయమ్ ।
దీని అర్థము పైన చెప్పఁబడినది.

# సత్సహవాసము

ఉత్కృష్టతగల ఉత్తమ బ్రాహ్మణులను చేరబిలిచియు, వారిసమీపమునకు వెళ్ళియు, వారిని గౌరవించుచు వారి సహవాసమున మాలిన్యము పోగొట్టుకొనవలెననియు గూడ చెప్పబడినది. పైనచెప్పబడిన సద్గుణముల కన్నిటికినీ సహకారము చేయునదియే యీ సత్సహవాసము.

# సత్ప్రవర్తనము

అత్యంతము ప్రధానమయినది సత్ప్రవర్తనము. నడవడిక సరిగాలేనివాడు ఎంతవిద్యాసంపన్నుడైనను లాభములేదు. మరణానంతరమున వానికి విద్యలుపకరింపవు. ఈ క్రింది వసిష్ఠ శ్లోకము గమనింపదగినది,

శ్లో॥ ఆచారహీనం న పునంతి వేదా
యద్యప్యధీతా స్సహషడ్భిరంగైః ।
ఛందాస్యేవం మృత్యుకాలేత్యజంతి ।
నీడం శకుంతా ఇవ జాతపక్షాః॥

వేదములు షడంగములతోడను అథ్యయనము చేయబడినను,సత్ప్రవర్తనలేనివారిని పవిత్రునిగా జేయవు. రెక్కలు వచ్చిన పక్షులు గూటిని వదలిపెట్టి పోవునట్లు వేదములు గూడ మరణకాలమున నాతని విడిచి పోవును.

## సంస్కారములయు ఆత్మ గుణములయు

# ప్రయోజనము

హిందూ మతములో సంస్కారరూపమైన కర్మకు చాలగొప్పస్థానమే కలదు. కాని యింతకంటె గొప్పస్థానము పైన తెలుపబడిన యాత్మగుణములకు కలదు. కేవలము కర్మగాని, యాత్మగుణములు కాని రక్షణ సల్పలేవు కాని యేమయిన కొంచెము లోటున్నచో నది సంస్కారములలో నుండవచ్చును గాని ఆత్మగుణములలో నుండుటకు వీలులేదు. సంస్కారములకును ఆత్మ గుణములకును గల తారతమ్యము యొక్క మీమాంస గౌతమ ధర్మ సూత్రములలో చేయబడినది. బ్రహ్మ సాయుజ్య సాలోక్యములను పొందవలెనన్నచో, నలుబది సంస్కారములను ఎనిమిది యాత్మగుణములనుగూడ గల్గియుండవలెనని గౌతమ మహర్షి యభిప్రాయము. సంస్కారములు పూర్తిగనున్నను ఆత్మగుణములు లేనియెడల వానికి బ్రహ్మ సాయుజ్య సాలోక్యములు కల్గవని గౌతమ ధర్మసూత్రములలో స్పష్టముగాఁ జెప్పఁబడినది.

"యస్యైతే చత్వారింశ త్సంస్కారా నచాష్టావాత్మ
గుణాః న స బ్రహ్మణ స్సాయుజ్యం సాలోక్యం చ గచ్ఛతి ।
(గౌ. ధ. 8-23)

సంస్కారములలో కొన్ని యున్నను ఆత్మగుణము లన్నియు నున్నచో సాయుజ్య సాలోక్యములు గల్గునని యీ క్రింది సూత్రము చెప్పుచున్నది.

"యస్యైతే సంస్కారాణామేకదేశో ఽ ప్యష్టా వాత్మ గుణా
అథ స బ్రహ్మణః సాయుజ్యం సాలోక్యం చ గచ్ఛతి గచ్ఛతి"

ఇచ్చట వ్యాఖ్యాతలు సంస్కారములును ఆత్మగుణములును పూర్తిగా నున్నచో సాయుజ్యము గల్గుననియు, సంస్కారములు కొన్నియు, నాత్మగుణము లన్నియు నున్నచో సాలోక్యము గల్గుననియు వివరించి వ్రాసినారు.

## సర్వవర్ణముల వారికి సామాన్యములయిన నియమములు

వేదోక్తమగు కర్మకాండ ముఖ్యము, అందలి నియమములును ముఖ్యములు. అంతకంటెను ఆత్మగుణములు ముఖ్యములు.

ఈ యాత్మగుణములు - శీలము సర్వవర్ణములకును విధింపఁబడుట గుర్తింపదగిన యంశము. సత్యము, శౌచము మొదలగు వానితో గూడిన సత్ప్రవర్తనము సర్వవర్ణములవారికి సామాన్య ధర్మమని చెప్పఁబడిన దాని నిది గూడ బలపఱచును. మను ధర్మశాస్త్రమున నిటుల చెప్పబడి యున్నది.

"అహింసా సత్యమస్తేయం శౌచ మింద్రియనిగ్రహః ।
ఏతం సామాజకం ధర్మం చాతుర్వర్ణ్యే ఽ బ్రవీన్మనుః ॥

(10-63)

అహింస, సత్యము, పరుల ధనము హరింపకుండుట, శౌచము, ఇంద్రియనిగ్రహము — అను వానిని సర్వజన సాధారణముగా మనువు విధించెను.

ప్రకరణమునుబట్టి యీ ధర్మములు నాల్గువర్ణములకేకాక సంకర వర్ణములకు కూడ విహితములేయని కుల్లూకభట్టు వ్యాఖ్యానములో వ్రాసినాడు.

కాబట్టి పైన వివరింపబడిన సత్ప్రవర్తన, ఆత్మగుణములు సర్వ హిందువులును అనుసరింపవలయునని గ్రహింపవలయును.

# సంస్కారముల ప్రయోజనములు

హిందూ సంస్కారముల ప్రయోజనము మహత్వమున్ను పూర్తిగా తెలిసికొనుట చాల క్లిష్టము, అన్నిటికంటె ముందుగా అవి యుద్భవించుటకు గల పరిస్థితులనుగూర్చి తెలిసికొనవలయును. ఈ యవి భిన్న భిన్న యుగములనుండి వచ్చుచున్నవి. వానికి నాల్గువైపులను లోకవ్యాప్తిగా అంధవిశ్వాసములు వలగా పఱచబడి యున్నవి. కావున వానికి సుదూరమయిన వర్తమానమువైపు దృష్టి ప్రసరింపచేయుటకై తథ్యముల గంభీర జ్ఞానము గల్గిన సునియోజితమైన కల్పన అవసరము. రెండవది జాతీయ భావన. అతీతదేదీప్యమాన భాగమువైపే ధ్యానమిడును. ఇట్లు సమీక్షాత్మక దృష్టి అనగా ఏదయిన ఒక అనుసంధాన కార్యమునకు అవశ్యకమయిన దృక్పథము తిరోహితమై పోవుచున్నది. కాని యింతకంటె గొప్పచిక్కు ఆధునికుల మస్తిష్కములోని పూర్వాచార విశ్వాసముల కారణముగా కల్గుచున్నది. ప్రాచీనకాలమందలి ప్రతి ఒకవిషయము అంధవిశ్వాసములతో నిండియున్నది అని ప్రతివారును భావించుట తటస్థించుచున్నది. ప్రాచీన ధర్మముయొక్క విశిష్టత యేదికలదో అందలి కఠోరమగు అనుశాసనమును తెలిసికొనుటకు ధైర్యశక్తి యెవరికిని లేదు. ప్రాచీన సంస్కృతికి చెందిన విద్యార్థి ఒకవైపు కేవల శ్రద్ధతోను మఱియొకవైపు అతిసందేహముగల్గు మనోవృత్తితోను తనను కాపాడుకొనుట ఆవశ్యకమయినది. అతడు అతీతముపట్ల సముచితాదరము, వికాసముయొక్క వివిధస్థాయిలలో జరుగుచున్న మానవస్వభావమును గూర్చి పూర్ణసహానుభూతియును గల్గి సంస్కారముల తత్త్వము నెఱుంగవలసి యున్నాడు.

స్థూలదృష్టితో సంస్కారముల ప్రయోజనములను 2 వర్గములుగా విభజించినారు. మొదటి వర్గము వారు సరళవిశ్వాసము, అకృత్రిమ మనస్సుయొక్క సహజ నిరాడంబరతయు అనునవి సంస్కార ప్రయోజనములని యనినారు. రెండవ వర్గము వారు కర్మకాండకు సంబంధించుట

సంస్కృతికి సంబంధించుట యనునవి సంస్కార ప్రయోజనములన్నారు. వీటిపుట్టుక సామాజికవికాసోన్నతుల నియామకమైన చేతనశక్తుల కారణముగా కల్గునన్నారు. మానవుడు వికాసమునకు యత్నము చేయుట ప్రకృతి ఆధారముపైననే జరుగునుగదా ! పురోహితుడు జనసామాన్యమునకు అందుబాటులో నుండుటకు దూరము కాకపోయినను దానికంటె ఉచ్చతర స్థాయిలో తప్పక ఉండెడివాడు. కావున ఆయన విభిన్న విధములుగా సామాజిక ప్రథలను ఇంకను పరిష్కరించెను. రెండువిధములయిన సంస్కారములు చాల ప్రాచీనకాలమునుండియు సమానాంతరరూపముగా వ్యవహరింపబడుచున్నవి. అవి పరస్పరము ఒకదాని నొకటిని ప్రభావయుతము చేసికొనుచు హిందూధర్మములో వ్యాప్తిగల్గి యున్నవి.

## లోకప్రియ ప్రయోజనము

లోకప్రియమైన ప్రయోజనమును విచారించునపుడు "ప్రపంచములోని అన్యదేశములకువలె హిందువులకుగూడ విశ్వాసముండినది. వారు నాల్గు వైపులను చెడుగును మంచిని చేయుశక్తి గల్గిన అతిమానుష ప్రభావములతో ఆవరింపబడి యున్నారు" అను విషయములో మనము దృష్టినిడవలెను. (ఉక్తప్రభావములు జీవనములోని ఏమహత్త్వపూర్ణసమయమందయినను వ్యక్తియొక్క జీవితములో హస్తక్షేపము చేయగలవు అనుదానిపట్ల వారికి ప్రగాఢ విశ్వాసము గలదు.) అమంగళజనక ప్రభావముల నిరాకరణమునకు, హితకర ప్రభావముల ప్రాప్తికొఱకును వారు ప్రయత్నము చేయుచుండెడివారు. ఆప్రయత్నముల వలన మనుష్యులు ఏవిధమయిన బాహ్యవిఘ్నములును లేకుండా తమ వికాసాభివృద్ధులు చేసి

## అశుభ ప్రభావములకు ప్రతిక్రియ

అరిష్టములు నశించుటకు చేయు ప్రాయశ్చిత్తములు సంస్కారములే.

## అభీష్ట ప్రభావములకు ప్రతిక్రియ

అభీష్టముల సిద్ధింపజేయు దేవతలను స్తుతించుట.

## సంస్కారము - భౌతిక ఉద్దేశ్యములు

ధన, ధాన్య పశు, సంతాన, దీర్ఘజీవన, సంపత్తి, సమృద్ధి, శక్తి, బుద్ధి, లాభములు.

## సంస్కారములు ఆత్మాభివ్యక్తి విషయమున మాధ్యమములు

సుఖదుఃఖముల సమయమున ఆనంద విచారములు కల్గును.

## సాంస్కృతిక ప్రయోజనములు

గర్భాధానాది సమయములందు చేయబడిన హోమాదులకు అరిష్ట నివృత్తియు అభ్యుదయమును ప్రయోజనములు.

## నైతిక ప్రయోజనములు

ఈ నలుబది సంస్కారములేకాక గౌతమమహర్షి దయ, క్షమ, అనసూయ, శౌచము, శమము, ఉచితవ్యవహారము, నిరీహత, నిర్లోభత అను ఈ యెనిమిది ఆత్మగుణములను ఉల్లేఖించినాడు. ఏ వ్యక్తి నలుబది సంస్కారము లాచరించినను వానిలో ఆత్మగుణములు లేనిచో ఆతడు బ్రహ్మసాన్నిధ్యమును పొందలేడు, కాని ఏవ్యక్తి కేవలము కొన్ని సంస్కారములనే ఆచరించి అష్టఆత్మగుణములతో సుశోభితుడగునో ఆతనికి ఉత్తమలోక ప్రాప్తి కలుగును.

## వ్యక్తిత్వము యొక్క నిర్మాణ వికాసములు

హిందువులకు ప్రాచీన ధార్మిక కృత్యముల వలనను, సంస్కారముల వలనను ఏ సాంస్కృతిక ప్రయోజనము కలదో, అదియే వ్యక్తిత్వముయొక్క నిర్మాణము వికాసమునయి యున్నది. ఏవిధముగా చిత్ర కర్మ సఫలమగుటకు పెక్కురంగులు అపేక్షితములో, అటులనే మానవుని పవిత్రత విభిన్న సంస్కారముల ద్వారా సిద్ధించును. సంస్కారములు జీవితములోని ప్రతి ఒక భాగమును వ్యాపించి యున్నవి.

## ఆధ్యాత్మిక మహత్త్వము

హిందువుల ప్రధాన విశేషము ఆధ్యాత్మికత. సంస్కారములన్నియు ఆధ్యాత్మిక సాధనములు. సంస్కారములు హిందువులకు జీవనాడులు. బాహ్యఉపచారమాత్రములే కావు. సంస్కారములు మానవుని ఆధ్యాత్మికాధి భౌతిక జీవితములను సమన్వయ పఱచుటకుపయోగించును.

ఆత్మవాది మతమున ఆత్మ అర్చనము, శరీరము యొక్క అవహేళనము జరుగును. శరీరమును వారు (జైన బౌద్ధ నవ్యవేదాంతులు) పంచతత్త్వమయ సంస్కారములోని సారహీన వస్తువు అని గ్రహింతురు. ఆత్మవస్తువు నంగీకరింపని చార్వాకులు నామమార్గులును శరీరము పోయిన చో మరేమియు లేదందురు. వారు మనుష్య జీవనములోని ఆధ్యాత్మిక భాగమును ఒప్పుకొనరు. తత్కారణముగా వారికి ఆత్మశాంతియు ఆనందము నుండవు. ఒకవైపు శరీరమును అనుపేక్షణీయము మూల్యవంతముగు వస్తువుగా జేయుట, రెండవవైపు పరమాత్మోన్ముఖ్యమును గల్గ చేయుట సంస్కారములపని. దానివలన అది ఆత్మకు సుందరము పవిత్రమునగు మందిరము కాగలదు. కావున సంస్కారములు ఆధ్యాత్మిక వికాసమునకు ఉత్తమ సాధనములు.

ఈవిధమయినది హిందువుల విశ్వాసము, సవిధి సంస్కారములు అనుష్ఠానము వలన వారు బంధములనుండి ముక్తులయి మృత్యుసాగరము

దాటుదురు. యజుర్వేదము ననుసరించి "ఏ వ్యక్తి విద్య - అవిద్య యను రెండిటిని ఎఱుగునో, అతడు అవిద్యవలన మృత్యువును దాటి విద్యవలన అమరత్వము నొందునని తెలియును.

"విద్యాం చావిద్యాం చ
యస్తద్వేదోభయం సహ ।
అవిద్యయా మృత్యుం తీర్త్వా
విద్యయా ఽ మృతమశ్నుతే॥"

(శుక్లయజు - 40-11)

## సంస్కారములు విభిన్నావస్థలు

ఇన్ని ప్రయోజనాలవల్ల ఈ హిందూ సంస్కారములు హిందువుల జీవితమునకు అనివార్యాంశము లైనవి. ఈ సంస్కారములు దేశకాలముల ననుసరించి వ్యవస్థ చేయబడినవి. కావున వానిని గుఱించి వివిధ గృహ్య సూత్రములలో విభేదమున్నది. ఇప్పుడు హిందువుల విశ్వాసములో శక్తి తగ్గినది. మంత్రములయు విధివిధానములయు భాష సుబోధము కాదు. ఆధునిక యుగములో నవజాగరణ సమయములలో సంస్కారముల పునరుత్థానము పరిష్కారము సుధారక సంస్థలద్వారా ప్రయత్నము చేయబడినది. సనాతన ధర్మసభలు మొదలగునవి ప్రయాసపడి సంస్కారములలో ఏకరూపత, సరళత మొదలగునవి కలుగజేసి వాని యర్థమును ఉద్దేశ్యమును స్పష్టము చేసినవి.

# ఉపనయన శబ్దార్థము

ప్రకృత విషయము ఉపనయన సంస్కారమునది. ఉపనయన శబ్దమునకుగల అర్థములను పరిశీలింతము.

(1) యౌగికార్థము కూడ "ఉప సమీపే ఆచార్యాదీనాం వటోః నయనం ప్రాపణమ్ ఉపనయనమ్" అని భావార్థముగాను,

(ఆచార్యుడు మొదలగు వారి సమీపమునకు బ్రహ్మచారిని తీసికొని వెళ్ళుటను ఉపనయనము అందురు)

(2) "యేన కర్మణా ఉపసమీపే ఆచార్యాదీనాం నీయతేవటుస్త దుపనయనమ్" అని కరణార్థముగాను చెప్పబడినది.

(ఆచార్యాదుల దగ్గరకు దేనిచే వటువు తీసికొని వెళ్లబడునో అది ఉపనయనము అనియు చెప్పుదురు.

(3) "గాయత్ర్యోపదేశ ఏవ ఉపనయన పదార్థ ఇతి తత్రోపనయనం నామ ఆచార్యేణ వటోః గాయత్ర్యా సంస్కరణమ్."

'గాయత్రిని ఉపదేశించుటయే ఉపనయనపదమున కర్థము, ఉపనయన మనగా ఆచార్యుడు వటువును గాయత్రీ మంత్రముతో సంస్కరించుట. అనగా గాయత్ర్యోపదేశ ప్రధానమైన ఆచార్య సమీపమును పొందించు సంస్కార విశేషమే ఉపనయనము.

(4) ఆపస్తంబః — ఉపనయనం విద్యార్థస్య శ్రుతితః సగ్గంస్కార ఇతి॥ విద్యయనెడు ప్రయోజనమును వేదముద్వారా సంస్కరించుట ఉపనయనము అని ఆపస్తంబమున చెప్పి యుండెను.

(5) అధర్వవేదమున ఉపనయన శబ్దమును 'బ్రహ్మచారిని గ్రహించుట' అను అర్థమందు ప్రయోగించినారు.

"ఉపనయమానో బ్రహ్మచారిణమ్'' అధర్వవేదము (11-5-3) అనగా ఆచార్యునిద్వారా బ్రహ్మచారికి వేదవిద్యలో దీక్షకల్గించుట ఉపనయనమని యభిప్రాయము,

(6) బ్రాహ్మణ భాగములందుగూడ ఉపనయన శబ్దమును ఈ పై యర్థముననే ప్రయోగించినారు. ఈ విషయము శతపథ బ్రాహ్మణమున ఒక బ్రహ్మచారి ఉపనయన వర్ణనము వలన స్పష్టమైనది. (11-5-4)

(7) సూత్ర కాలములో కూడ విద్యార్థి బ్రహ్మచర్యము కొఱకు ప్రార్థించుట, ఆచార్యుడా ప్రార్థనను స్వీకరించుట అనునవియే సంస్కారమునకు కేంద్రబిందువులు అని చెప్పబడినవి.

(8) మనువు మనుస్మృతిలో చెప్పినాడు :-

ఆ మూడు జన్మలలో బ్రహ్మను గ్రహించుట ప్రయోజనము గాగలది, మేఖలాబంధనముతో ఉపలక్షితమైనది, ఉపనయన సంస్కార రూపమయినది ఏది కలదో, అందు ఈ వటుకుమారునకు సావిత్రీ తల్లి. ఆచార్యుడు తండ్రి అని చెప్పబడినారు. జన్మయనునది మాతాపితరులచే సంపాద్యము గదా !

శ్లో॥తత్ర యన్ బ్రహ్మజన్మాస్య మౌంజీబంధన చిహ్నితమ్ ।
తత్రాస్య మాతా సావిత్రీ పితాత్వాచార్య ఉచ్యతే ॥
(మనుస్మృతి 2-170)

కొన్నిచోట్ల ఈ సంస్కారమును సావిత్రీ వచనము లేక సావిత్రీ శిక్ష అను పేరుతో వ్యవహరించి యున్నారు.

(9) యాజ్ఞవల్క్యుడు నిర్వచించిన ఉపనయన శబ్దముపై అపరార్కుడను వ్యాఖ్యాత వ్రాసియుండెను —

ఉపనయనమనగా శిష్యునకు గాయత్రికి గల మధ్యసంబంధము. దాని నాచార్యుడు స్థాపించును.

యాజ్ఞవల్క్యస్మృతి 1-14 అపరార్కుని వ్యాఖ్య తరువాత కొంత కాలమునకు కొంతమంది పండితులు ఈ ఉపనయన శబ్దమును శిష్యుని ఆచార్యునివద్దకు తీసికొని వెళ్ళుట అను అర్థమునందు ప్రయోగింప సాగిరి.

(10) వేదవిద్యాభ్యాసార్థము వేదమూలమున సద్గురు సన్నిధిని జరుపబడు సంస్కారమునకే ఉపనయనమని పేరు అని పండితుల అభిప్రాయము.

(11) వీరమిత్రోదయమను ధర్మశాస్త్ర గ్రంథములో ఉదహరింపఁబడిన ఒక ఆచార్యుని అనుసరించి ఉపనయనము అను శబ్దముయొక్క అభిప్రాయము చాల వ్యాపకమై యున్నది. అది కేవలము విద్య అను అర్థములోనే పరిమితము కాలేదు. దేనిద్వారా వ్యక్తి గురువు, వేదములు, యమములయు నియమములయు వ్రతము, దేవతలు అనువాని సామీప్యము నకు దీక్షకలవాడుగా చేయఁబడునో ఆకృత్యము ఉపనయనము అని వివరింపఁబడి యున్నది.

శ్లో॥ గురోర్వ్రతానాం వేదస్య యమస్య నియమస్యచ।
దేవతానాం సమీపం వా యేనాసౌ నీయతే॥

# ఉపనయనమునకు ఏకాలము మంచిది? ఏకాలము మంచిది కాదు?

ఉత్తరాయణమందు ఉత్తమకాలము, మధ్యమకాలము, అని రెండు కాలములున్నవి. బ్రాహ్మణునకు ఉపనయనమునకు వసంతఋతువు అనగా చైత్రవైశాఖమాసము లుత్తమములు, మాఘ ఫాల్గున జ్యేష్ఠ మాసములు మధ్యమములు అనియు చెప్పబడినది. ఉత్తరాయణమయినను పుష్యాషాఢ మాసములు సకల శుభకర్మలకు నింద్యములు. శుక్లపక్షము సకల శుభకర్మలకు ఉత్తమము.

ఇందులో పక్షాంతరము లున్నవి. శుక్లాష్టమి మొదలు కృష్ణాష్టమి వఱకు ముఖ్యకాలము. అష్టమి తరువాత మూడురోజులు మధ్యకాలము. దశమి తరువాతి కాలము నింద్యము. శుక్లపక్షమందు మొదటి 5 దినములు, కృష్ణపక్షమందు చివరి అయిదు దినములును నింద్యములు. శుక్లపక్షమందు మధ్యను పంచకమున్ను కృష్ణపక్షమందు మధ్యపంచకమున్ను మధ్యమములు. శుక్లాదిపంచకము, కృష్ణాంతిమ పంచకమున్ను నిందితములు అనగా

బహుళైకాదశి మొదలు శుక్లపంచమి వరకుగల కాలము సమస్త శుభకర్మలకు మంచిదికాదు. నింద్యము. శుక్లైకాదశి మొదలు కృష్ణపంచమి వఱకుగల కాలము ఉత్తమము. మిగిలిన కాలము మధ్యమమని భావము. మాఘ మాసము మొదలు ఐదుమాసములు అనగా మాఘ, ఫాల్గున, చైత్ర వైశాఖ. జ్యేష్ఠమాసములు ఉపనయనమునకు యోగ్యములని కొందఱు చెప్పుచున్నారు. శుభకర్మలకు ప్రాతస్సంగవ మధ్యాహ్న కాలములు మంచివి. అపరాహ్ణ సాయంకాలములు మంచివి కావు. చౌల గోదానాది సకల శుభకర్మలకు ఉత్తరాయణము. శుక్లపక్షము, శుభతిథి వారములు పూర్వాహ్ణకాలము - ఇవి మంచివి.

ఆపస్తంబ గృహ్యసూత్రమందు "గర్భాష్టమేషు బ్రాహ్మణ ముపనయీత" (10-3) గర్భోత్పత్తి మొదలుకొని 8 వ. సంవత్సరము బ్రాహ్మణునకు ఉపనయనము చేయవలెను.

"గర్భైకాదశేషు రాజన్యమ్" గర్భోత్పత్తి మొదలుకొని 11 వ సం॥ రమునందు క్షత్రియులకు ఉపనయనము చేయవలయును.

"గర్భ ద్వాదశేషు వైశ్యమ్" గర్భోత్పత్తి మొదలుకొని 12 వ సం॥ రమున వైశ్యుల కుపనయనము చేయవలయును.

"గర్భాష్టమేషు బ్రాహ్మణముపనయీత, గర్భైకాదశేషు రాజన్యం గర్భద్వాదశేషు వైశ్యమ్" అనియే బోధాయనులు కూడ (బో - గృ సూ 2-5-1) చెప్పిరి. దీనికి గూడ ఆపస్తంబ సూత్రమునకువలెనే అర్థము.

కామనాభేదముచే సంవత్సరభేదమును ఆపస్తంబులు "సప్తమే బ్రహ్మవర్చస కామమ్" (ఆ. ధ. 1-1-21-26) అష్టమ ఆయుష్కామం, నవమే తేజస్కామం, దశమే అన్నాద్యకామమ్, ఏకాదశ ఇంద్రియకామం, ద్వాదశే పశుకామమ్" అని చెప్పిరి,

బ్రహ్మవర్చసమును కోరినపుడు 7 వ సం॥ రములోను, ఆయుష్యమును కోరినపుడు 8 వ సం॥ రములోను, తేజస్సును కోరినపుడు 9 వ సం॥ రములోను, అన్నాదులను కోరినపుడు 10 వ సం॥ రములోను, ఇంద్రియ శక్తులను కోరినపుడు 11 వ సం॥రములోను, పశుసమృద్ధి కోరినపుడు 12 సం॥ రములోను ఉపనయనము చేయవలెనని చెప్పిరి.

బోధాయనులు కూడ అటులనే చెప్పిరి. విశేషమేమనగా మేధా శక్తిని కోరినపుడు 13 వ సం॥ రములోను, పుష్టిని కోరునపుడు 14 వ సం॥ రములోను భ్రాతృవ్యవంతునిగా కోరినపుడు 15 వ సం॥ రములోను, సర్వకామునిగా కోరినపుడు 16 వ సం॥ రములోను ఉపనయనము చేయ వలయును అనునదియే విశేషము,

ఆశ్వలాయన మహర్షి చెప్పిన దానిలో విశేషము :- బ్రాహ్మణునకు గర్భోత్పత్తి మొదలెనిమిదవ సం॥ రములోగాని జననాది ఎనిమిదవ సం॥ రములో గాని. జన్మ ప్రభృతియే 11 వ సం॥ రములో క్షత్రియునకు, అటులనే (జననాదియే) 12 వ సం॥లో వైశ్యునకు ఉపనయన కాలమని చెప్పెను.

బ్రహ్మవర్చసమును కోరిన బ్రాహ్మణునకు 5 వ సం॥ రములోను, బలముగోరు క్షత్రియునకు 6 వ సం॥ రములోను, ధనమును కోరు వైశ్యునకు 8 సం॥ రములోను ఉపనయనము చేయవచ్చునని మనువుయొక్క మతము.

వటువు దృఢముగా నుండి బుద్ధిశాలియైయున్న యెడల బ్రహ్మవర్చస్సునుకోరి 5, 6, 7 సం॥ రములలో నెపుడైన ఉపనయనము చేయ వచ్చునని మఱియొక గృహ్య సూత్రములో నున్నది,

బ్రాహ్మణునకు 8 వ స॥ రము ముఖ్యకాలము.

15 చివరి వఱకు గౌణకాలము.

క్షత్రియునకు 11 వ సం॥రము ముఖ్యకాలము.
21 చివరివఱకు గౌణకాలము
వైశ్యునకు 12 వ సం॥ రము ముఖ్యకాలము
23 చివరి వఱకు గౌణకాలము.

మనువు బ్రహ్మ క్షత్రియ వైశ్యులకు క్రమముగా 16,22,24 సం॥ రములు గౌణకాలము అని చెప్పినాడు.

కశ్యపమహర్షి 10 సం॥ రములలోపల ఉత్తమము,
,, 13 సం॥ రముల లోపల మధ్యమము,
,, 16 సం॥ ములలోపల అధమము
అది దాటినచో పతితుడగునని చెప్పెను.

# ఉపనయన కాలాతిక్రమణ దోషమునకు ప్రాయశ్చిత్తమేమి?

ఉపనయనమునకు త్రైవర్ణికులకు చెప్పఁబడిన 16-12-24 స॥ రములు అనెడు గౌణకాలము కూడ దాటినచో

"అత ఊర్ధ్వం త్రయోఽప్యేతే
యథాకాల మసంస్కృతాః
సావిత్రీ పతితా వ్రాత్యా
భవంత్యార్యవిగర్హితాః"॥ (మను 2-39)

వారు వ్రాత్యులు. ఏకర్మకు అర్హులు కాని వారగుదురు. వీరికి యథావిధిగ ప్రాయశ్చిత్తమునుచేసి ఉపనయనము చేయవలయును. అట్లు చేయనిచో వీరికి వేదశాస్త్రములు చెప్పుట, వీరికి కన్యనిచ్చుట, వీరికన్యను వివాహము చేసికొనుట మొదలగు వానిని చేయగూడదని యర్థము.

అందుకు ప్రాయశ్చిత్తము ఆపస్తంబ ధర్మసూత్రములో 'అతిక్రాంతే సావిత్ర్యా ఋతుం త్రైవిద్యకం బ్రహ్మచర్యం చరేత్'' (ఆప - ధర్మ - 1 - 1 - 28) అని చెప్పఁబడినది. ఉపనయన గౌణకాల మతిక్రమించినచో వసంతము మొదలగు ఋతువుల మొదటిరోజున ఉప క్రమించి అగ్నికార్యము, సంధ్యావందనము, గురుశుశ్రూష (ఉపనయనము కాలేదు గనుక) వీటిని వదలి మిగిలిన బ్రహ్మచారి చేయవలసిన అధ్యయ నము, భిక్షాచర్యము, పగలు నిద్రపోకుండుట మొదలగు నియమములతో ఆ ఋతువు పూర్తియగువఱకు (రెండు మాసములు) వ్రతమును ఉపనయన మును చేసికొనవలసిన వానిచే చేయించి, తరువాత ఉపనయమునుచేసి, అది మొదలు ఒక సం॥ రము మూడుపూటలుగాని, శక్తిలేనిచో ఒకసారి గాని స్నానము చేయించుచు. సం॥ రము నిట్లు పూర్తిచేసిన తరువాత అత నికి వేదము చెప్పవచ్చునని యర్థము.

పరాశరమాధవీయము 12 వ అధ్యాయములో 20 శ్లోక వ్యాఖ్యాన ముతో "వ్రాత్యోనామ పతిత సావిత్రీకః । తస్య ప్రాయశ్చిత్తముచ్యతే'' అని మొదలుపెట్టి — ''యేషాం ద్విజానాం సావిత్రీ నానూచ్యేత యథావిధి । తాంశ్చారయిత్వా త్రీన్కృచ్ఛ్రాన్యథా విధ్యుపనాయయేత్'' (మ - 11 - 191) అని చెప్పినారు. ఏ బ్రాహ్మణ పుత్రునకు యథాకాలమందుపనయనము చేయఁబడలేదో వానిచేత మూడు ప్రాజాపత్య కృచ్ఛ్రములను చేయించి ఆపైని యథావిధిగా ఉపనయనమును చేయవలెనని యర్థము.

తరువాత అక్కడనే వశిష్ఠుడు కూడ — "పతిత సావిత్రీక ఉద్దాలకవ్రతం చరేత్ । ద్వౌమాసౌ యావకేన వర్తయేన్మాసం పయసాఽర్ధ మాసమామిక్షయాఽష్టరాత్రం ఘృతేన షడ్రాత్రమయాచితం హవిష్యం భుంజీత త్రిరాత్రమబ్భక్షోఽహోరాత్రముపవసేత్ । అశ్వమేధావబృథం వాగచ్ఛేత్ । వ్రాత్యస్తోమేన వాయజేత॥" (11-56)

పతిత సావిత్రీకుడు ఉద్దాలకవ్రతమును చేయవలెను. అది యెట్లనగా రెండుమాసములు యావకము (యవలచే వండిన అన్నము) ను మాత్రమే భుజించుచు నుండి. ఒకమాసము గోపయస్సును మాత్రమే పానము చేయుచు, 15 రోజులు ఆ మిక్షను (అనగా పాలవిరుగుడు, భక్షించుచు, 8 రోజులు ఘృతమును మాత్రమే పుచ్చుకొనుచు, 6 రోజులు అయాచితము (ఎవరిని అడుగక వారంతట వారుతెచ్చి యిచ్చినదానిని) హవిష్యమును (ఉప్పు క్షార ద్రవ్యములను విడచి) భక్షించుచు, మూడు రోజులు ఉదకమును మాత్రమే త్రాగుచు ఒకరోజు ఉపవాసము చేసినచో దీనిని ఉద్దాలక వ్రతమందురని యర్థము.

మరొక మతము :— బ్రాహ్మణునకు 17 వ సం॥ రమున ఉపనయనము చేయవలసి వచ్చిన యెడల శిఖతోవపనము చేయించి 21 రోజులు ప్రసృతి (చేరెడు - కొంచెము వంచిన చేయిపట్టినవి) మాత్రయావకాహారముపెట్టి, బ్రాహ్మణ భోజనముపెట్టి, శుద్ధుడైన యతనికి ఉపనయనమును చేయవలెను. 18 వ సం॥ రమయినచో ప్రాజాపత్యకృచ్ఛ్రములు మూడు చేయించి యుపనయనమును చేయవలయును. 19 వ సం॥ రమయినచో రెండు మాసములు అగ్నిపరిచర్య అధ్యయనము, శుశ్రూషయను మూడు ధర్మములను వదలి మిగిలిన బ్రహ్మచారి ధర్మముల ననుష్ఠింపఁజేసి ఉపనయనము తరువాత సం॥ రము ఉదకోపస్పర్శనము చేయించి యధ్యాపనము చేయవలెను. 20 వ సం॥ రమయినచో 3 మాసములుచేయు ఉపపాతక ప్రాయశ్చిత్తము చేయవలయును. 21 వ సం॥ రమయినచో 4 మాసములు చేయు ఉద్దాలక వ్రతము చేసిన అధికారము సిద్ధించును. 22 వ సం॥ రమయినచో అశ్వమేధావబృథ స్నానము, 23 వ సం॥రమయినచో వ్రాత్యస్తోమము (సోమయాగము) ప్రాయశ్చిత్తము చేయవలెను. ఈ కాలము కూడ అతిక్రమించిన దక్షిణాధిక్య పక్షము నాశ్రయించి వ్రాత్యస్తోమమునే చేయవలెను.

మొదటి గర్భము 4 వ మాసమున సీమంతోన్నయన సంస్కారము చేయవలెనని హేమాద్రి ప్రాయశ్చిత్త కాండలో చెప్పబడినది.

జాతకర్మ శిశువు జనించినది మొదలు 10 రోజుల లోపున చేయవలెను. అట్లు చేయనిచో గౌతముని వచనము ననుసరించి నామకరణ కాలమందుగాని, చౌలకాలమందు కాని, ఉపనయనకాలమందుగాని చేయవలయును. ముందు రెండు ప్రాజాపత్య వ్రతములు ప్రాయశ్చిత్తముగా చేయవలయును.— అని యర్థము.

జాతకర్మ మొదలుకొని అన్నప్రాశనము వఱకుగల సంస్కారములను యథాకాలమందు చేయనిచో ముందు ప్రాయశ్చిత్తమునుచేసి వానిని క్రమముగా చేసి తర్వాత చౌలమును చేయవలయునని యర్థము. మంత్రయుక్తముగా జరిగిన దానికే చౌలమని వ్యవహారము.

ఈ చౌలమును మొదటి సం॥ రమునగాని, మూడవ సం॥ రమువ గాని చేసినచో దీర్ఘాయుష్మంతుడగును. లేనిచో ఆయువు క్షీణించునని భావము. గౌతమ వచనము ప్రమాణముగా ఏకారణమునవైన చౌలము స్వకాలములో చేయబడనిచో రెండు ప్రాజాపత్యములు చేసి. అగ్నిప్రతిష్ఠనుచేసి, చతుష్పాత్ర ప్రయోగమును చేసి, అగ్నికి పరిస్తరణముచేసి,

"భూరగ్నయే చ పృథివ్యైచ" అను నాలుగు మహావ్యాహృతులచే హోమముచేసి తర్వాత చౌలమును చేయవలయును. కాని హోమము చేయుటలేదు.

ద్రవ్యాభావము మొదలగు నిమిత్తముల వలన సకాలములో నుపనయనము చేయలేనివాడు కృచ్ఛ్రత్రయ రూపమగు ప్రాయశ్చిత్తమును, బుద్ధిపూర్వకముగా కాలమును దాటబెట్టినవాడు ఉద్దాలక వ్రతమును చేయవలయును అని చెప్పిరి.

యమస్మృతిలో నిట్లు వ్రాసిరి :- జన్మప్రభృతి 15 సం॥ రములు ఉపనయనము చేయకుండ ఉన్న విప్రపుత్రుడు సంపూర్ణ క్షౌరమ్మును చేయించి 21 రోజులు చాపిన హస్తములో పోసినంత (చారెడు) యవలతో కాచిన గంజిని త్రాగుచు 12 గురు బ్రాహ్మణులకు హవిస్సుతో భోజనము పెట్టి వ్రతపూర్తి అయిన తర్వాత ఉపనయనము చేయవలయునని ఇంకను అనేక ధర్మశాస్త్రములందు అనేకములయిన ప్రాయశ్చిత్తములు కలవు.

పై ప్రాయశ్చిత్తములన్నియు ఉపనయనము చేసికొనదలచిన వ్రాత్యునకే అని తేలినది. జాతకర్మ మొదలుకొని చెప్పిన కర్మలను సకాలములో చేయనందులకు చెప్పిన ప్రాయశ్చిత్తములను చేయుట చాల కష్టము. వానినిచేయు శక్తికలవారు చేయవలయును. శక్తిలేనివారయినచో ప్రాజాపత్యాదులకు ప్రత్యామ్నాయములు ధర్మశాస్త్రములలో చెప్పబడినవి. ప్రాజాపత్యమనగా-

"త్ర్యహం ప్రాతః త్ర్యహం సాయం
త్ర్యహమద్యా దయాచితమ్ ।
త్ర్యహం పరం చ నాశ్నీయాత్
ప్రాజాపత్యం చరన్ద్విజః ॥ (మను - 11 - 211)

మూడు రోజులు పగలు ఒక్కొక్క పర్యాయము భుజించును, తరువాత మూడురోజులు రాత్రి మాత్రమే ఒక్కొక్క పర్యాయము భుజించుచు, తరువాత మూడురోజులు ఎవరిని అడుగకుండగా ఎవరైనను ఇచ్చినచో దానిని మాత్రమే భుజించుచు, తరువాత 3 రోజులు ఏమియు భుజించక, ఉపవాసమును చేయుచు ఇట్లు 12 రోజులు చేయు వ్రతమును ప్రాజాపత్య మందురు.

ప్రాజాపత్య వ్రతమునకు-

"కృచ్ఛ్రం దేవ్యయుతం చైవ ప్రాణాయామశతద్వయమ్ ।
పుణ్యతీర్థేఽనార్ద్రశిరస్స్నానం ద్వాదశ సంఖ్యయా॥" (12-62)

అనుపనీతునకు సూక్తపఠనాదుల యందధికారము లేనందున అమంత్రకముగానే

"ద్వియోజనే తీర్థయాత్రా కృచ్ఛ్రమేకం ప్రకల్పితమ్" (62-1-2)

అని పరాశరస్మృతిలో చెప్పబడినది. 1) పదివేలగాయత్రీ జపము 2) రెండువందలసార్లు ప్రాణాయామమును చేయుట 3) పుణ్య తీర్థములందు—

["సంకల్పం సూక్తపఠనం మార్జనం చాఘమర్షణమ్।
దేవాదితర్పణం చైవ స్నానం పంచాంగముచ్యతే॥"

అను విధిప్రకారము) స్నానము చేసి తలను శరీరమును తుడుచు కొని తిరిగి ఈ విధముగానే స్నానముచేసి తిరిగి తుడుచుకొని ఇట్లు 12 సార్లు స్నానముచేయుట 4) తీర్థయాత్రకు రెండు యోజనముల దూరము వెళ్ళుట అక్కడ స్నానము, తీర్థశ్రాద్ధము చేయుట— ఈ నాలుగు ప్రాజా పత్యవ్రతము చేయలేనివానికి ప్రత్యామ్నాయములు. వీనిలో నే యొక దానినైనను చేయవచ్చునని భావము.

"గోమూత్రం గోమయం క్షీరం దధి సర్పిః కుశోదకమ్।
ఏకరాత్రోపవాసశ్చ కృచ్ఛ్రం సాంతపనం స్మృతమ్॥"

నల్లని గోవుయొక్క మూత్రము ఒక పలప్రమాణము కలదియు, తెల్లని గోవుయొక్క పురీషము (పేడ) బొటనవ్రేలులో సగమున్ను, ఎఱ్ఱని గోవుయొక్క 7 పలముల క్షీరమున్ను, అతిరక్త వర్ణముగల గోవుయొక్క పెరుగు మూడు పలములున్ను, కపిలగోవుయొక్క ఘృతము (నేతిని) ఒక పలమున్ను. దర్భలనువైచిన ఉదకము ఒక పలము నీటిని కలిపి ఒక రోజున పుచ్చుకొని రెండవరోజున ఉపవాసముచేయుట. దీనిని సాంతపన మందురు.

దీనికి ప్రత్యామ్నాయము:-

"ప్రజాపత్యేగామేకాం దద్యాత్సాంతపనే ద్వయమ్" అని పరాశర

మాధవీయములో స్మృత్యంతర వచనము గలదు. ప్రాజాపత్యమందు ఒక గోవును, సాంతపనమందు రెండు గోవులను ప్రత్యామ్నాయముగా నీయ వలయునని యర్థము.

"కృచ్ఛ్రం దేవ్యయుతం చైవ" అను ప్రత్యామ్నాయములనుగూడ చేయలేనివానికి ఒక గోవు ప్రత్యామ్నాయము. గోవును గూడనిచ్చుటకు సామర్థ్యము లేనివానికి

"గవామలాభే నిష్కంవా నిష్కార్థం పాదమేవవా" అని పరాశర మాధవీయములో ప్రజాపతి వచనము.

ఇంకను ధర్మశాస్త్రములందు బహుప్రాయశ్చిత్త వ్రతములున్నవి.

ఉపనయనమైనవారు మాంసాదులను, ఉల్లిని భక్షించినవారు ప్రాయశ్చిత్తము చేసికొని తిరిగి ఉపనయనము చేసికొనవలెను.

పూర్వపూర్వ సంస్కారములనుచేసికొన్న తర్వాతనే ఉత్తరోత్తర సంస్కారము చేయవలయును.

బ్రాహ్మణుడు మద్యము సేవించినను, గోమాంసభక్షణచేసినను ధర్మశాస్త్రములో చెప్పబడిన తప్తకృచ్ఛ్రములచే క్షీణపాపుడై తిరిగి యుపనయనము చేసికొననచో శుద్ధుడగును. మనుస్మృతి:—

"భూసురో మద్యపానేచకృతే గోభక్షణేఽపివా।
తప్తకృచ్ఛ్ర పరిక్లిష్టో మౌంజీహోమేన శుద్ధ్యతి॥"

బ్రాహ్మణుడు మద్యము సేవించినను. గోమాంసభక్షణచేసినను తప్తకృచ్ఛ్రముచే క్షీణపాపుడై తిరిగి ఉపనయనము చేసికొనిన శుద్ధుడగును. తప్తకృచ్ఛ్రమును మూడు మూడు రోజులు చొ॥న కాచిన క్షీరము, నేయి ఉదకమును— వీటిని భక్షించుచు నాల్గవ త్ర్యహమందు ఎండలోని వేడి గాలిని సేవించుచు ఇట్లు మొత్తము 12 రోజులు చేసి తరువాత ఉపనయనము చేసికొనవలెనని యర్థము.

వ్రాత్యస్తోమములు అనగా (శౌతసోమ) యాగములు.

"వ్రాత్యస్సంస్కారహీనః" వ్రాత్యుడు వ్రాత్యతా దోషనివారణకు వ్రాత్యస్తోమయాగమును చేయవలయును. ఉపనయనమునకు పూర్వదిన మందు ఆచార్యుడు (తండ్రి) సపత్నీకముగా స్నానముచేసి అలంకరించు కొని వటువునకు స్నానాలంకారములఁజేయించి పుణ్యాహము చేయించి నాందీ ముఖమును జేసికొని తనకు ఉపనయనము చేయు యోగ్యతా సిద్ధికొఱకు సువర్ణ + ఆజ్య ధాన్య కృచ్ఛ్రములఁజేసి గాయత్ర్యుపదేశ యోగ్యతాసిద్ధి కొఱకు ఆ మూడు కృచ్ఛ్రములును వటువుచేత చేయించవలయును.

నూతన కౌపీనధారియగు వటువును నవతంతుధారణ చేయించవల యును. తరువాత వంశపరంపరాప్రాప్తమగు కులదేవతను స్థాపించి పూజించి మరునాడుపనయనమును చేయవలయును.

చౌలము తత్కాలమందు అనగా మూడవ సంవత్సరము మొదలగు కాలమందు చేసియుండనియెడల ముందుగా చౌలముఁజేసి తరువాత ఉపనయ నము చేయవలయును.

జాతకర్మ మొదలగునవి వాటివాటి కాలములందు చేసియుండని యెడల ఆయాకర్మలు చేయుటకు యోగ్యతా సిద్ధికొఱకు పాహిత్రయోదశ హోమమునుజేసి తరువాత జాతకర్మమొదలు చౌలమువఱకుచేసి తరువాత ఉపనయనము చేయవలయును.

మఱునాడు ఉపనయనదినమందు ఆచార్య వటువులు మంగళ స్నాన మునుచేసి అలంకరించుకొని ఆచార్యుడు తనకు కుడిప్రక్కను చాపమీదను కూర్చుండబెట్టి తాను ఉత్తరమున కూర్చుండి "ఇమం వటుం గోత్రం శర్మాణ ముపనేష్యే"అని సంకల్పమును జేసి రంగవల్ల్యాద్య లంకృతయగు వేదికయందు అగ్ని ప్రతిష్ఠాపన చేయవలెను.

తరువాత వటువుకు కంకణమును గట్టి కర్మాంగముగా బ్రాహ్మణు లకు భోజనము పెట్టి వారిచే ఆశీర్వాదము చేయించవలెను.

వేదశాస్త్ర విహితములగు కర్మలను ఆచరింపకపోయినను నిషిద్ధములగు కర్మలను ఆచరించినను మహాదోషము కల్గును. ఆ దోషనివారణము చేయుటకు, దోషనివారణముచేసి సత్కర్మాచరణాధికార యోగ్యతాసిద్ధి కల్గించుట కొఱకును ధర్మశాస్త్రములు మహాతపస్సంపన్నులగు మహర్షులచే రచింపఁబడినవి గాన అట్టి శాస్త్రములందు చెప్పఁబడిన ప్రాయశ్చిత్తములను (ఏ దోషనివారణకు ఏ ప్రాయశ్చిత్తమో) తెలిసికొని వానిని ఆచరించి కర్మకాండద్వారా చిత్తశుద్ధిని సంపాదించికొనవలయునని ధర్మశాస్త్రముల సిద్ధాంతము.

........

## ఉపనయన సంస్కారము యొక్క ప్రయోజనములు

1. ఉపనయన సంస్కారమువలన పూర్వము జన్మచే బ్రాహ్మణత్వాది జాతి విశిష్టులకు ద్విజత్వము సిద్ధించుట.

2. వేదాధ్యయనమున కధికారము కల్గుట.

3. దానివలన శ్రౌతస్మార్త కర్మలందధికారము గల్గి వాటిని ఆచరించుట అనగా బ్రహ్మచర్యాశ్రమమునకు యోగ్యమయిన సంధ్యావందనాది కర్మల నాచరించుటకు అధికారము ప్రాప్తించుట-వాని నాచరించుట,

4. వేదత్రయికి సార భూతమైనది, నష్టము కానిది, ఐశ్వర్య స్వరూపమైనది, తేజస్సు, ఓజస్సు, వర్చస్సు, భ్రాజస్సు మొదలగు సంపదను ఈయగలిగినదని శ్రుతిస్మృత్యాది ప్రమాణములచే బోధింపఁబడుచున్నదియునగు గాయత్రీ మహామంత్రము నాచార్య సమీపమునుండి స్వీకరించుట.

5. విరక్తులయినచో సన్న్యాసమును తీసికొని శ్రవణాదులను చేసి ముక్తిని పొందుట.

6. అధ్యాపన ప్రతిగ్రహాదులగు ఆర్థిక ఫలముల నొందుట. ఈ మొదలయినవి ఉపనయన సంస్కారముయొక్క ప్రయోజనములు.

## ఉపనయన సంస్కారములకు ఏ యే వర్ణముల వారర్హులు ?

బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు అను మూడు వర్ణముల వారును ఉపనయనమునకు అర్హతగలవారు. శ్రుతిస్మృతులలో పై మువ్వురకు అధ్యయనము చెప్పఁబడినది. దానికొఱకే ఉపనయనము గనుక "గర్భాష్టమేషు బ్రాహ్మణముపనయీత, గర్భైకాదశేషు రాజన్యం. గర్భద్వాదశేషు వైశ్యమ్." అని ఆపస్తంబధర్మ గృహ్యసూత్రములలోను, బోధాయన పారస్కరాది గృహ్యధర్మ సూత్రములలోను చెప్పఁబడినది. ఇదిగాక "అశూద్రాణా మదుష్టకర్మణాముపనయనం వేదాధ్యయన మగ్న్యాధేయం ఫలవంతి చ కర్మాణి" అని ఆపస్తంబ ధర్మసూత్రములలో చెప్పఁబడినందున శూద్ర వ్యతిరిక్తులకు, అదుష్ట కర్ములకు (పతితులుకానివారికి) ఉపనయనాదులను చెప్పుటచే ద్విజులకే అర్హత గలదు గాని తదన్యులకు లేదనుటకు స్పష్టము."

## ఉపనయన మెన్నిరోజులు చేయవలెను ? ఒకరోజుంచేయుట తగునా ?

నాలుగు రోజులు చేయవలయును. ఉపనయనమయిన తర్వాత అధమము మూడు రాత్రులయినను వ్రతానుష్ఠానము చేసిన యనంతరము

వటువునకు మేధాజననము చేయవలయును. ఈ విషయమును ఆశ్వలాయనులు "అత ఊర్ధ్వమక్షార లవణాశీ బ్రహ్మచార్యధశ్శాయీ త్రిరాత్రం ద్వాదశరాత్రం సంవత్సరం వా, చరిత వ్రతాయ మేధాజననం కరోతి" అని చెప్పియున్నారు. కాన మూడు రాత్రులు వ్రతముననుష్ఠించిన తర్వాత 4వ రోజున మేధాజననము చేయవలయును.

కాన నొకరోజు చేయు నుపనయనాదులు శాస్త్రీయములు కావు.

---

# ఉపనయన మంత్రార్థ తాత్పర్యములు

## ఉపనయన సంస్కారము

సూ. ఉపనయనం వ్యాఖ్యాస్యామః ।

ఉపనయనమునుగూర్చి వివరించి చెప్పెదము.

సూ. గర్భాష్టమేషు బ్రాహ్మణముపనయీత ।

గర్భోత్పత్తి మొదలు బ్రాహ్మణునకు 8వ సం॥రమున ఉపనయనము చేయవలెను.

సూ. గర్భైకాదశేషు రాజన్యం

గర్భోత్పత్తి మొదలు క్షత్రియునకు 11వ సం॥రమున ఉపనయనము చేయవలెను.

సూ. గర్భ ద్వాదశేషు వైశ్యమ్ ।

గర్భోత్పత్తి మొదలు వైశ్యునకు 12వ సం॥రమున ఉపనయనము చేయవలెను.

సూ. వసంతో గ్రీష్మశ్శరదితి ఋతవః వర్ణాను పూర్వ్యేణ ।

బ్రాహ్మణులకు వసంతఋతువున్ను, క్షత్రియునకు గ్రీష్మ ఋతువున్ను, వైశ్యునకు శరదృతువున్ను ఉపనయన కాలములు.

**సూ.** అథ ఏతావంతం కాల మనాశ్రమిణోఽస్య కుమార స్యాశ్రమాధికార సిద్ధ్యర్థం అధ్యయన సంపాదనార్థం ఆయుస్తేజో యశశ్శ్రీపుష్టి కామ్యాభి వృద్ధ్యర్థం సాంగో పాంగం సకల వేదాధ్యయనాధ్యాపన తత్ప్రతిపాదనార్ధం చతుర్విగ్ం శత్యక్షర మంత్రోచ్చారణ ద్విజాశ్రమాధికార యోగ్యతా సిద్ధ్యర్థం ఇమం కుమారం....గోత్రం....శర్మాణం కుమారముపనేష్యే । ఇతి సంకల్ప్య ఉపనయనం వసంతేఽగ్నిం ప్రతిష్ఠాప్య కౌపీనాచ్ఛన్నం కృత శౌచం కుమారం దక్షిణత ఉపవేశ్య.

పిమ్మట ఇంతకాలము ఏ ఆశ్రమమునకు చెందని ఈ కుమారునకు ఆశ్రమాధికారము సిద్ధించుటకు, అధ్యయనము సాగుటకు, ఆయువు, తేజస్సు, యశస్సు, సిరి, పుష్టి, కామ్యములు అభివృద్ధి యగుటకు అంగములతోను ఉపాంగములతోను వేదములన్నియు చదువుటకు, చదువు చెప్పుటకు, ఆయా విషయములు ప్రతిపాదన చేయుటకు ఇరువదినాల్గక్షరముల గాయత్రీ మంత్రము నుచ్చరించుటకు ద్విజాశ్రమాధికారమునకు యోగ్యత సిద్ధించుటకును ఈ కుమారుని ఫలానా గోత్రము కలవానిని శర్మను ఉపనయనము చేయించెదను అని సంకల్పము చేయవలెను. వసంత కాలమున ఉపనయనమునకు సంకల్పముచేసి అగ్నిప్రతిష్టచేసి కౌపీనము ధరింపచేసి శౌచకృత్యములు చేయించి కుమారుని కుడివైపున కూర్చుండ బెట్టవలయును.

**సూ.** స్వయముత్తరత ఆసీనః ప్రాణానాయమ్య.

తాను ఉత్తరమువైపున కూర్చుండి ప్రాణాయామము చేయవలెను.

**సూ.** ఓం భూః........శుభతిథౌ మమ కుమారస్య ఆయుష్యాభివృద్ధ్యర్థం ఉపనయనాంగత్వేన కర్మాదౌ రక్షార్థం రక్షాబంధనం కరిష్యే ।

ఓం భూః మొదలుకొని శుభతిథౌ వఱకు సంకల్పముచేసి నా కుమారునకు ఆయుష్యము వృద్ధియగుటకు ఉపనయనమునకు అంగముగా ఈకార్యమునకు మొదట రక్షణకొఱకై రక్షాబంధనము చేసెదను. అని సంకల్పించవలెను,

సూ. రక్షాబంధన దేవతాభ్యోనమః । ధ్యానావాహనాది షోడశోపచార పూజాం కృత్వా సమర్పయామి ।

రక్షాబంధన దేవతలకు నమస్కారము. ధ్యానము, ఆవాహనము మొదలగు 16 ఉపచారముల పూజనుచేసి సమర్పించుచున్నాను అని చెప్పవలెను,

మం॥ విశ్వే త్తాతే సవనేషు
మఘవన్నింద్ర సున్వతే। ప్రవాచ్యా యాచకర్థ
పారావతం యత్పురు సంభృతం వస్వపావృణోః
శరభాయ ఋషి బంధవే॥

(ఋ-సం 6-7-4-6)

అ॥ హేమఘవన్ ఇంద్ర = ఓ యింద్రుడా ! త్వం = నీవు, సవనేషు = యజ్ఞములందు, సున్వతే = సోమాభిషవమును చేయునట్టి, యజమానాయ = యజమానుని కొఱకు, యా = ఏ కర్మలను, చకర్థ = చేసితివో, తే = నీకు, తా = ఆ కర్మలు. ప్రవాచ్యా = చెప్పవలసినవి. విశ్వేత = అనంతములుగనే యున్నవి. కిం చ = మఱియు, త్వం = నీవు, పారావతం = పరావన్నామకుడగు ఒక శత్రువునకు సంబంధించిన, యత్

వసు = ఏధనము గలదో, తత్ = దానిని, ఋషిబంధవే = ఋషులు బంధువులుగాగల లేక ఋషులకు బంధువైన, శరభాయ = శరభుడను పేరుగల ఋషికి. అపావృణోః దాచియున్నావు, పురుసంభృతం యథా = అధనము అధికముగా సంపాదింపబడినది ఎట్లగునో అటులనని యర్థము.

తా॥ తనవద్దకువచ్చిన ఇంద్రుని చూచి సంతుష్టుడై ఋషిఇంద్రుని వివిధకర్మలను దానముచున్న "విశ్వే త్తాతే" అను 2 ఋక్కులతో స్తోత్రము చేయుచున్నాడు. ఓ ఇంద్రుడా ! నీవు యజ్ఞమునందు సోమాభిషవము చేయునట్టి యజమానునకు ఏయే కార్యములు చేసినావో నీయొక్క ఆయా కార్యములు చెప్పవలసినవి అనంతములుగనే యున్నవి. మఱియు పరావన్నామకుడైన శత్రువునకు సంబంధించిన ధనమేది యున్నదో దానిని ఋషి బంధువగు శరభఋషికి అధికముగ సంపాదించునట్లు చేసినావు.

ఈ 'విశ్వే త్తాతే'అను మంత్రమునకు బదులు ఎక్కువమంది ఈ క్రింది మంత్రమును రక్షాబంధనమునకు చదువుచున్నారు.

మం॥ బృహత్సామ క్షత్రభృద్వృద్ధ వృష్ణియం
త్రిష్టుభౌజశ్శుభిత ముగ్రవీరమ్। ఇంద్ర
స్తోమేన పంచదశేన మధ్యమిదం వా
తేన సగరేణ రక్ష॥

అ॥ బృహత్ = బృహత్ అను పేరుగల, సామ = ఏసామ యున్నదో, తత్ = అది, త్రిష్టుభా = ఆ పేరుగల ఛందస్సుతోగూడ,

(పిపర్తు అనునది అనువృత్తిగా వచ్చును.) పిపర్తు = మమ్ములను పాలించుగాక అని యర్థము. ఆ సామ యెటువంటిది? క్షత్రభృత్ = బలమును ధరించునది, వృద్ధవృష్ణియమ్ = ఉత్థితపుంస్కమయినది, ఓజః = బలమును గల్గించునది, శోభితమ్ = శోభించునది, ఉగ్రవీరమ్ = తీవ్రమైన పుత్రు నొసగునది. హే ఇంద్ర = ఓ యింద్రుడా! పంచదశేన = పంచదశమను పేరుగల, స్తోమేన = స్తోమముతోను, సగరేణ = సగర అను పేరుగల, వాతేన = వాతముతోను కూడినవాడవై. ఇదం మధ్యం రక్ష = అతీతానాగతముల మధ్యనున్న ఈ మాశరీరమును, రక్ష = పాలింపుము.

తా॥ బృహత్ అను పేరుగల ఒక సామము గలదు. అది బలమును ధరించునది, ఉత్థితపుంస్కమయినది, బలమును గల్గించునది, శోభించునది, తీవ్రమైన పుత్రునొసగునది. అట్టిసామము త్రిష్టుప్ అను చందస్సుతోఁ గూడ మమ్ములను పాలించుగాకయని యర్థము. ఓ యింద్రుడా! పంచదశ అనుపేరు కల్గిన స్తోమముతోను, సగర అను పేరుగల వాతముతోను కూడిన వాడవై అతీతానాగతముల మధ్యనున్న ఈ మా శరీరమును రక్షింపుము. త్రిలోకరక్షకుడైన యింద్రుని, శరీరరక్షణ నిమిత్తమై ప్రార్థన చేయబడినది బృహత్సామ అను మంత్రముచేత చేయబడినది.

రక్షాబంధన ముహూర్తః సుముహూర్తోఽస్తు
రక్షాబంధనముహూర్తము శుభఫలప్రదమైన ముహూర్తమగుగాక.

ప్రాణానాయమ్య మమోపాత్త దురితక్షయద్వారా శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభనే ముహూర్తే శ్రీమహావిష్ణురాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్థే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూద్వీపే భరతవర్షే భరతఖండే.... మేరోర్దక్షిణ దిగ్భాగే ... శ్రీశైలస్య ఈశాన్య ప్రదేశే గంగాగోదావర్యోర్మధ్యదేశే..శోభన గృహే సమస్తదేవతా బ్రాహ్మణ సన్నిధౌ.. అస్మిన్వర్త

మాన వ్యావహారిక చాంద్రమానేన.... సంవత్సరే.... అయనే... ఋతౌ.... మాసే.... పక్షే.... తిథౌ.... వాసరే .... శుభనక్షత్రే.... శుభయోగే ... శుభకరణ ఏవం గుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ మమ కుమారస్య ఆయుష్యాభివృద్ధ్యర్థం శ్రౌతస్మార్త నిత్య కర్మానుష్ఠాన యోగ్యతాసిద్ధ్యర్థం పరమపవిత్ర యజ్ఞోపవీతధారణం కరిష్యే। ....

ప్రాణాయామమునుచేసి నా యొక్క పూర్వజన్మములనుండి సంప్రాప్తమైన పాపములు నశించుట (నశింపజేయుట) మూలమున శ్రీపరమేశ్వరుని ప్రీతికొఱకు శుభఫలప్రదమైన మంచి ముహూర్తమందు శ్రీమహావిష్ణువుయొక్క ఆజ్ఞచే ప్రవర్తించుచున్న యిప్పటి బ్రహ్మయొక్క రెండవ పరార్థమందు శ్వేతవరాహకల్పమందు వైవస్వత మన్వంతరమునందు కలియుగము మొదటిపాదమున జంబూ ద్వీపమున భరతవర్షమున భరతఖండమున మేరు పర్వతముయొక్క దక్షిణ దిగ్భాగమున శ్రీశైలమునకు.... దిక్కున....నదులమధ్య ప్రదేశమున శుభమైన యింటిలో సర్వదేవతలయొక్కయు బ్రాహ్మణులయొక్కయు దగ్గర ఈ దేశములో వ్యవహారమందున్న చాంద్రమానముచే వచ్చిన....సంవత్సరమున....అయనమందు.... ఋతువులో .... మాసములో .... నక్షత్రమున .... తిథినాడు .... రోజున....శుభనక్షత్రమందు....శుభయోగమందు....శుభకరణమునందు ఇట్టి విశేష గుణములతోగూడిన శుభతిథియందు నా యొక్క కుమారునకు ఆయుష్యాభివృద్ధికొఱకు, వేదములందు ధర్మశాస్త్రములందును చెప్పఁబడిన నిత్యకర్మల నాచరించుటకు యోగ్యత సిద్ధించుటకై మిక్కిలి పవిత్రమైన యజ్ఞోపవీతమును ధరించెదను.

యజ్ఞోపవీతదేవతాభ్యోనమః। ధ్యానావాహనాది షోడశోపచారైరభ్యర్చ్య ..సుజనాః యజ్ఞోపవీతం స్పృశేయుః।

యజ్ఞోపవీతదేవతలకు నమస్కారము అనివచించి ధ్యానము, ఆవాహనము మొదలగు 16 ఉపచారములతో పూజించి, సజ్జనులు యజ్ఞోపవీమును ముట్టుకొనవలయును.

ఆచమ్య ఆచమనము చేసి

కేశవాయ నమః .... .... .... ....

.... .... .... .... కేశవునకు నమస్కారము

శ్రీకృష్ణాయ నమః .... ... .... ...

.... .... .... .... శ్రీకృష్ణునకు నమస్కారము.

మం॥ యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతే

ర్యత్సహజం పురస్తాత్। ఆయుష్యమగ్ర్యం ప్రతి

ముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు

తేజః॥

అ॥ యజ్ఞోపవీతం = వేదోక్త కర్మలనాచరించు అధికారముకొఱకు నిర్మింపఁబడినది, పరమం (పర + మం) = పరమాత్మను దెలుపునది, పవిత్రం = పవిత్రమయినది, ప్రజాపతేః = చతుర్ముఖబ్రహ్మకు, సహజం = స్వభావ సిద్ధమయినది, పురస్తాత్ = మొదట పుట్టినదియునగు, యత్ = ఏయజ్ఞోపవీతమును. అహం = నేను, ప్రతిముంచ = ధరించుచున్నానో, తత్ = ఆ, యజ్ఞోపవీతం = యజ్ఞసూత్రము లేక బ్రహ్మసూత్రము, నః = మాకు, ఆయుష్యం = ఆయుర్వృద్ధి నిచ్చునది, అగ్ర్యం = ముఖ్యమయినది, శుభ్రం = నిర్మలత్వము నిచ్చునది, బలం = బలము నిచ్చునది - తేజః = తేజస్సును ఇచ్చునది, అస్తు--అగుగాక.

మం॥ ధ్రువం తే రాజా వరుణో ధ్రువం
దేవో బృహస్పతిః ।
ధ్రువం త ఇంద్రశ్చాగ్నిశ్చ రాష్ట్రం
ధారయతాం ధ్రువమ్ ॥
ధ్రువం ధ్రువేణ హవిషా తస్మై దేవా
అధిబ్రువన్ ।
అయం చ బ్రహ్మణ స్పతిః॥

అ॥ హే రాజన్ = ఓ రాజా ! తే = నీయొక్క. రాష్ట్రం = రాష్ట్రమును, రాజా = ప్రకాశించుచున్న, వరుణః = వరుణుడు, ధ్రువం = స్థిరముగా, ధారయతు = పోషించుగాక. దేవః = దానాది గుణయుక్తుడైన, బృహస్పతిః = బృహస్పతి, ధ్రువం = స్థిరముగా, ధారయతు = ధరించుగాక, ఇంద్రశ్చ అగ్నిశ్చ = ఇంద్రుడు అగ్ని యిర్వురున్ను, తే = నీ యొక్క, రాష్ట్రం = రాష్ట్రమును. ధ్రువం = స్థిరముగా, ధారయతామ్ = పోషింతురుగాక.

ధ్రువేణ = స్థిరమైన, హవిషా = శాస్త్రప్రకారము ఆచరింపబడిన హోమముచేత, దేవాః = దేవతలు = సంతుష్టులై, తస్మై = ఆయజమానునకు, ధ్రువం = స్థిరముగా, అధిబ్రువన్ = ఇతడధికుడని చెప్పుదురు గాక. అయం = ఈ, బ్రహ్మణస్పతిః చ = ఈ బ్రహ్మణస్పతికూడ ఇతడధికుడని చెప్పునుగాక.

తా॥ వేదోక్తకర్మల నాచరించుచు అధికారము కొఱకు నిర్మింపఁబడినది, పరమాత్మను తెలుపునది, పవిత్రమయినది, చతుర్ముఖ బ్రహ్మకు స్వభావ సిదమయినది, మొదట పుట్టినదియునగు ఏయజ్ఞోపవీతమును నేను ధరించుచున్నానో, ఆ యజ్ఞోపవితము (యజ్ఞసూత్రము లేక బ్రహ్మసూత్రము) మాకు ఆయుర్వృద్ధి కలిగించునది, ముఖ్యమయినది. నిర్మలత్వము నొసంగునది, స్వధర్మాచరణమునందు సామర్థ్యమునిచ్చునది. ప్రభావము నిచ్చునదియునగు గాక.

పునరాచమ్య

(తిరిగి ఆచమనము చేయించవలెను) తిరిగి ఆచమనము చేయించి.

కేశవాయ నమః .... .... .... శ్రీకృష్ణాయ నమః

కేశవాయ నమః మొదలుకొని శ్రీకృష్ణాయనమః వఱకు చెప్పవలెను.

యజ్ఞోపవీత ధారణ ముహూర్తస్సుముహూర్తోఽస్తు ।

యజ్ఞోపవీతమును ధరించిన ముహూర్తము శుభముహూర్తమగుగాక ! అని పెద్దలాశీర్వదించ వలయును.

అథ నాందీసమారాధనం కుర్యాత్ ।

తరువాత నాందీ సమారాధనము చేయవలెను.

ఆచమ్య.... .... .... .... .... ప్రీత్యర్థం

తిరిగి ఆచమనము చేయవలెను. చేసి సంకల్పము చేసి 'ప్రీత్యర్థం' వఱకు చెప్పి.

మమ కుమారస్యాయుష్యాభివృద్ధ్యర్థం ఉపనయనాం గభూతం నాందీ శోభన దేవతా ప్రీత్యర్థం నాందీ దేవతా బ్రాహ్మణ సమారాధనం కరిష్యే ।

నా కుమారునకు ఆయుష్యము వర్ధిల్లుటకును, నాందీ శోభనదేవతల ప్రీతి కొఱకును, ఉపనయనమునకు అంగభూతమైన నాందీ దేవతా స్వరూప బ్రాహ్మణ సమారాధనమును చేసెదను అని చెప్పవలెను.

మం॥ స్వస్త్యయనం తార్క్ష్య మరిష్టనేమిం మహద్భూతం

వాయసం దేవతానామ్ । అసురఘ్న మింద్రసఖం

సమత్సు బృహద్యశో నావమి వారుహేమ ॥

అం హో ముచ మాంగిరసం గయం చ

స్వస్త్యాత్రేయం మనసా చ తార్క్ష్యమ్ । ప్రయత

పాణిశ్శరణం ప్రపద్యే స్వస్తి సంబాధే ష్వభయంనో అస్తు॥

శుభగ్ం శుభమ్ ।

అ॥ స్వస్త్యయనం = శుభములకు స్థానమైనవాడును, మహద్భూతం = గొప్పవాడును, దేవతానాం = దేవతలలో, వాయసం = పక్షి రూపుడైనవాడును, అసురఘ్నం = యుద్ధములందు రాక్షసుల జంపునట్టి వాడును, ఇంద్రసం = ఇంద్రునకు మిత్రుడైనవాడును, అరిష్టనేమిం = అరిష్టములనుపోగొట్టునటి వాడును, అగు. తార్క్ష్యం = తార్క్ష్యని (తృక్షునికుమారుడైన గరుత్మంతుని), సమత్సు = యుద్ధములందు బృహత్ = గొప్పదయిన, యశః = కీర్తిని, నావమి = వనావసువలె, ఆరుహేమ = అధిష్ఠించుచున్నాము.

అంహోముచం=పాపములను విడిపించునట్టి. ఆంగిరసం=అంగిరుని కొడుకైనవానిని, గయంచ=గయుని, ఆత్రేయం=ఆత్రేయుని, తార్క్ష్యంచ = తార్క్ష్యుని, ప్రయతపాణిః = చేతులు జోడించినవాడనై, మనసా=మనసుచే, శరణం ప్రపద్యే=శరణు పొందుచున్నాను, నః = మాకు, సంబాధేషు=యుద్ధములందు, అభయం=నిర్భయత్వమున్ను, స్వస్తి=శుభము. అస్తు=అగుగాక.

శుభగ్ం శుభమ్=శుభము అగుగాక.

తా॥ శుభములకు స్థానమైనవాడు, గొప్పవాడు, దేవతలలో పక్షిరూపుడు, యుద్ధములందు రాక్షసులను సంహరించువాడు, ఇంద్రమిత్రుడు. అరిష్టములను పోగొట్టువాడు నగు తార్క్ష్యుని సేవించుచు నావనధిష్ఠి.చినట్లు గొప్పకీర్తిని పొందెదము.

పాపవిమోచకుడు, ఆంగీరసుడు. గయుడు, ఆత్రేయుడు, తార్క్ష్యుడు-అను వారికి అంజలిఘటించి మనసార శరణు పొందుచున్నాను. మాకు యుద్ధములందు (కష్టములందు) నిర్భయత్వము, శుభమున్ను కలుగుగాక,

శుభము సిద్ధించుగాక.

శ్రీమహావిష్ణు స్వరూపస్య బ్రాహ్మణస్య ఇదమాసనమ్।
శ్రీమహావిష్ణు స్వరూపుడగు బ్రాహ్మణునకు ఇది ఆసనము.
సుఖాసనమ్।

(బ్రాహ్మణుడు సుఖాసనము అనవలెను.)

ఇదం పాద్యమ్।

ఇదిగో పాద్యము.

సుపాద్యమ్।

(బ్రాహ్మణుడు 'సుపాద్యమ్' అనవలెను.)

శ్లో॥ నమోఽస్త్వనంతాయ సహస్రమూర్తయే సహస్ర
పాదాక్షిశిరోరు బాహవే।
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే సహస్రకోటియుగ
ధారిణే నమః॥

అనంతములగు స్వరూపములు గలవాడును, లెక్కలేనన్ని పాదములు, శిరములు, ఊరువులు, బాహువులు కలవాడును అగు అంతరహితుడైన విరాట్పురుషునకు నమస్కారము. శాశ్వతుడైనవాడును, అనంత కోటి యుగములు వయః ప్రమాణముగలవాడును అనగా సనాతనుడును, అనంతనామములుగలవాడును, విరాట్పురుషుడు నగు బ్రహ్మమునకు నమస్కారములు.

శ్రీమహావిష్ణుస్వరూపస్య బ్రాహ్మణస్య భాగశః అమీవో గంధాః

'శ్రీమహావిష్ణు స్వరూపు(డై న)లైన బ్రాహ్మణులగు మీకు ఇదిగో గంధము' అనవలెను.

సుగంధాః

'సుగంధము' అని బ్రాహ్మణులు అనవలెను.

'గంధానాముపరి అలంకారార్థా ఇమే అక్షతాః'

గంధము తరువాత బ్రాహ్మణులమీద అక్షతలుచల్లి ఇవిగో అక్షతలు అని యీయవలెను.

'సన్త్వక్షతాః'

బ్రాహ్మణులు అక్షతలు (క్షతములు కానివి) అగుగాక అని యనవలెను.

'సకలారాధనైః స్వర్చితమస్తు'

ఈ పూజలన్నిటిచే మీకు శుభమగుగాక ! యని యాశీర్వదింపవలెను.

సదక్షిణతాంబూల వస్త్రాదికం దద్యాత్!

పిమ్మట దక్షిణ తాంబూలము, వస్త్రము మొదలగువిన బ్రాహ్మణులకు ఈయవలెను.

[ఈ సమారాధనము బ్రహ్మచారులకు చేయుటయు పసుపు బట్టల నిచ్చుటయు నాచారము.]

'ఏవం బ్రాహ్మణాన్ సంపూజ్య'

ఈ విధముగా బ్రాహ్మణులను పూజింపవలయును. పూజించి

'నాందీశోభనదేవతా స్వరూపా బ్రాహ్మణాః'

నాందీ శోభనదేవతాస్వరూపులైన ఓ బ్రాహ్మణులారా!

'అమృతమస్తు'

(మాకు) అమృతమగుగాక.

'అమృతోపస్తరణ మసి'

అమృతముతో సమానమైన పదార్థములకు ఆధారమయినవి.

'అనేన నాందీశోభనదేవతా బ్రాహ్మణసమారాధనేన భగవంతః సర్వాత్మ కారి నాందీ శోభనదేవతాస్సుప్రీతాస్సు ప్రసన్నా వరదా భవంతు'

ఈ నాందీదేవతా స్వరూపులగు బ్రాహ్మణుల సమరాధనముచే షడ్గుణైశ్వర్యయుక్తులు సర్వాత్మకులునైన నాందీశోభనదేవతలు మంచి ప్రీతి, ప్రసన్నత, వరదానము గల్గియుందురుగాక.

శ్లో॥ కుమారభుక్తి కాలేతు గాయత్రీం సముదాయయన్।
ఆచార్యస్స్వయ మేవాన్నం ప్రోక్షయేదితి శౌనకః॥

కుమారుని భోజన కాలమందు గాయత్రిని జపించుచు ఆచార్యుడు స్వయముగానే అన్నమును ప్రోక్షింపవలెనని శౌనకమహర్షి చెప్పెను.

క్షారలవణ వర్జభోజనమ్ (ఉప్పు కారము లేకుండా భోజనము)

శ్లో॥ వటురక్షారలవణం సప్రాణాహుతిముత్తమమ్।
ఏక ఏవహి భుంజీతవ్రతే వ్రతమపీడయన్॥

బ్రహ్మచారి కారము ఉప్పువిడచి ప్రాణాహుతులతో ఉత్తమమైన ఆహారమును, ఒక్కడే యుండి ఈ వ్రతమందు వ్రతభంగము లేకుండ భుజించవలయును.

అర్వాఙ్మంత్రక్రియాయాశ్చమాత్రాచ సహభోజనమ్।
సహాశబ్దస్తు శాస్త్రార్థమేకపంక్తౌతు భోజనమ్॥

ఉపనయన హోమాదులకు పూర్వమందే తల్లితోకూడ ఏకపంక్తిలో కూర్చుండి భుజింపవలయును అని శాస్త్రమున్నది.

మాత్రా సహ కుమారం భోజయేత్।

తల్లితోకూడ కుమారుడు ఏకపంక్తియందు భోజనముచేయు నాచారము మాధ్వులలో కలదు. స్మార్తులలో లేదు.

ఆచమ్య -

ఆచమనము చేయించవలెను.

పరిషేచన ఆపోశన ప్రాణాహుతి సహితం క్షారలవణ వర్జం
కుమారం భోజయిత్వా

పరిషేచనముచేసి, ఆపోశనము, ప్రాణాహుతులతో కుమారుని చే కారము ఉప్పులేకుండ భోజనము చేయించవలెను. చేయించి,

**(లఘుభోజనమ్)**

**(భోజనము లఘువుగా చేయ్యవలెను.)**

స్నాత్వా ఆచమ్య

స్నానముచేసి ఆచమనము చేయవలెను. చేసి

కుమారస్య శరీరశుద్ధ్యర్థం కర్మణః పుణ్యాహం కుర్యాత్।

కుమారునకు శరీరశుద్ధికై "ఓం కర్మణః పుణ్యాహం భవతో బ్రువంతు మొదలుకొని పత్నీమార్జనమువఱకు చేయవలయును.

ఓం కర్మణః పుణ్యాహం భవంతో బ్రువంత్విత్యాది పత్నీ మార్జనాంతం కుర్యాత్.

(పై వటుభోజన సంబంధమైన మంత్రములన్నియు నాచార్యుడే చెప్పి క్రియలు వటునిచే చేయించవలెను. 'అమృతోపస్తరణమసి' అను చోట ఉదకమునకు మాఱుగా నేతిసీయవలెను, వటుని కారము ఉప్పు లేని పదార్థములనే భుజింపచేసి పిమ్మట స్నానము చేయించవలెను.)

కేశవపనమ్: ఆయువు వృద్ధికొఱకు కేశవపనము.

ఆయుర్వృద్ధ్యై కేశవపనమ్।

ఉష్ణేన వాయవితి యజుషా ఉష్ణాశ్శీతాస్స్వప ఆనీయ॥

'ఉష్ణేనవాయో' అనెడు యజస్సుతో ఆ మంత్రము నుచ్చరించుచు వెచ్చనినీటిని చల్లని నీటిలో పోసి

మం॥ ఉష్ణేన వాయవుదకేనేహ్యాదితిః కేశాన్ వపతు॥

అ॥ హేవాయో = ఓ వాయువా! ఉష్ణేన = వేడియైన, ఉదకేన = నీటితో, ఏహి = రమ్ము! అదితిః = అదితిదేవత కేశాన్ = వెండ్రుకలను, వపతు = ఖండించుఁగాక.

తా॥ ఓ వాయువా! అదితి కేశములను ఖండించునుగాన నీవు వేడియైన జలమును తీసికొని రావలయును.

శీతాసు ఉష్ణోదకం నినీయ! చల్లటి నీటియందు వేడినీటిని పోసి
అపఉందంత్వితి కుమారస్య శిర ఉనత్తి।

'అప ఉందంతు' అను మంత్రము చదువుచు కుమారుని శిరస్సును తడుపవలెను.

మం॥ ఆప ఉందంతు జీవసే దీర్ఘాయుత్వాయ వర్చసే।
జ్యోక్చ సూర్యం దృశే।

అ॥ జీవసే=వటువు దీర్ఘకాలము జీవించుట కొఱకును. దీర్ఘాయుత్వాయ=దీర్ఘాయుర్దాయము కలుగుటకొఱకును, వర్చసే=కాంతికొఱకును, జ్యోక=చాలకాలము, సూర్యం=సూర్యుని, దృశేచ=చూచుటకొఱకును, అస్య శిరః=ఈ పిల్లవానియొక్క శిరస్సును, ఆపః = ఉదకములు, ఉందంతు=తడుపునుగాక.

తా॥ దీర్ఘాయుష్యము కలిగి చిరకాలము సూర్యుని దర్శించుచు కాంతి గల్గియుండుటకు ఉదకములు ఈ పిల్లవాని శిరమును తడుపునుగాక. ఈ ఉందనము వల్ల వటునకు ఈ ఫలము లన్నియు గలుగును.

సూ॥ యేనావపదితి చతసృభిః ప్రతిమంత్రం
ప్రదక్షిణం ప్రతిదిశం ప్రవపతి।

'యేనావపత్' మొదలగు నాలుగింటితోను ప్రతిమంత్రము నుచ్చరించుచు ప్రదక్షిణముగా ప్రతిదిక్కునను కేశవపనము చేయవలెను.

మం॥ యేనావపత్సవితా క్షురేణ సోమస్య రాజ్ఞోవరుణస్య
విద్వాన్। తేన బ్రహ్మాణో వపతేదమ స్యాయుష్మాన్జర
దష్టిర్యథా సదయమ సౌ॥

అ॥ విద్వాన్ = నేర్పరియగు, సవితా = సూర్యుడు, యేన = ఎటు వంటి, క్షురేణ = కత్తిచేత, రాజ్ఞః = రాజగు (ప్రకాశించునట్టి) (ఈ రాజ్ఞః అనుపదము కాకాక్షివలె సోమస్య, వరుణస్య అను రెండు పదములతో అన్వయించును,) సోమస్య = చంద్రుని యొక్కయు, రాజ్ఞః = రాజగు, వరుణస్య = వరుణుని యొక్కయు, శిరః = శిరస్సును, అవపత్ = వపనము చేసెనో, హేబ్రహ్మాణః — ఓ బ్రాహ్మణులారా! తేన = అటువంటి కత్తిచేత, అస్య = ఈ పిల్లవాని యొక్క, ఇదం = ఈ శిరస్సును, వపత = నాచే వపనముచేయింపుడు, అయం = బ్రహ్మచారియగు, అసౌ = ఈపిల్లవాడు, ఆయుష్మాన్ = ఆయుష్మంతుడై, జరదష్టిః = ముదిమిచేవ్యాప్తి కలవాడై, యథా = ఏప్రకారము, అసత్ = అవునో ఆప్రకారముగా చేయుడని ముందున కన్వయము.

తా॥ నేర్పరియగు సూర్యుడు సోముని యొక్కయు వరుణుని యొక్కయు శిరస్సులనెటువంటి కత్తితో వపనము చేసెనో ఓ బ్రాహ్మణులారా! అటువంటి కత్తితో బ్రహ్మచారియగు ఈ పిల్లవాడు ముదిమిగల్గి చిరజీవియై యుండుటకు ఈ పిల్లవాని శిరస్సును నాచే వపనము చేయింతురు గాక.

ఇతి పూర్వతోవపతి

అని తూర్పు దిక్కువైపు వపన వపనము చేయవలయును.

(తాన్ కేశాన్) అనడుహేశకృత్పిండే యవాన్ నిధాయ తస్మిన్ కేశాను పయమ్య.

అప ఉపస్పృశ్య

యత్ క్షురేణేతి వసంత మా చార్యం మాతాఽఽను మంత్రయతే ।

ఆ కేశములను వృషభసంబంధమైన పురీషపిండముపై యవలనుంచి అందు కేశము లుంచవలెను.

నీరు ఉంచి ముట్టుకొని.

యత్ క్షురేణ అను మంత్రముతో వపనముచేయు ఆచార్యుని తల్లి ప్రార్థించును.

మం॥ యత్క్షురేణ మర్చయతా సుపేశసా వప్త్రా వపసి

కేశాన శుంధి శిరో మాఽస్యాయుః ప్రమోషీః

అ॥ మర్చయతా = వాడి కలిగి, సుపేశసా = మంచిరూపముచే ప్రకాశించునట్టి, వప్త్రా = కత్తిచేత, అస్య = ఈ పిల్లవానియొక్క కేశాన్ = వెంట్రుకలను, యత్ = ఎప్పుడు, వపసి = వపనము చేసితివో, తదా = అప్పుడు, అస్య = ఈ పిల్లవానియొక్క, శిరః = శిరస్సును, శుంధి = శుభ్రముగాచేయుము. అస్య = ఈ పిల్లవానియొక్క, ఆయుః = ఆయుర్ధాయమును, మా ప్రమోషీః = లోపింప చేయకుము.

తా॥ వాడిగలదియు మంచిరూపముతో ప్రకాశించునట్టిదియు నగు కత్తిచే ఈ పిల్లవానిని ఆయుర్ధాయభంగము లేకుండులాగున వపనముచేసి తల శుభ్రముగాఁ జేయుము.

మం॥ యేన పూషా బృహస్పతే రగ్నేరింద్రస్య చాఽయుషే

వపత్ । తేనాఽస్యాయుషే వప సౌశ్లోక్యాయ స్వస్తయే ॥

అ॥ పూషా = సూర్యుడు, యేన = ఎటువంటి కత్తిచేత, బృహస్పతేః = బృహస్పతియొక్కయు, అగ్నేః = అగ్నిహోత్రునియొక్కయు, ఇంద్రస్యచ = ఇంద్రునియొక్కయు, శిరః = శిరస్సును, ఆయుషే = దీర్ఘాయుష్యము కలుగుట కొఱకు, అవపత్ = వపనము చేసెనో, తేన = అటువంటి కత్తిచేత, అస్య = ఈ పిల్లవానియొక్క, శిరః = శిరస్సును, ఆయుషే = ఆయుష్యము కొఱకు, సౌశ్లోక్యాయ = మంచి కీర్తి కలుగుట కొఱకును, స్వస్తయే = సుఖముగా నుండుటకొఱకును. వప = వపనము చేయింపుమా.

తా॥ సూర్యుడే కత్తితో బృహస్పతియొక్కయు, అగ్నిహోత్రుని యొక్కయు, ఇంద్రుని యొక్కయు శిరస్సులను ఆయుష్యము కొఱకు వపనము చేసెనో ఓ హృదయాంతర్యామీ ! (ఓ హృదయమా) అటువంటి కత్తిచేత ఈ పిల్లవానియొక్క శిరస్సు ఆయుష్యము కొఱకును సత్కీర్తి కొఱకును సుఖముండుట కొఱకును నాచే వపనము చేయింపుమా.

ఇతి దక్షిణతో వపతి తాన్కేశాన్ శకృత్పిండే నిధాయ
అపఉపస్పృశ్య పునస్త్రీగ్ంస్త్రీన్ దర్భానంతర్ధాయ.

అని దక్షిణపు భాగమున కేశములను వపనముచేయవలెను. ఆ కేశములను పురీషపిండము పైన ఉంచవలెను. ఉంచి, నీరు స్పృశించి తిరిగి మూడు దర్భలను కేశముల పైనుంచి.

మం॥ యేన భూయశ్చరాత్యయం జ్యోక్చ పశ్యాతి సూర్యం ।

తేనాఽస్యాయుషే వప సౌశ్లోక్యాయ స్వస్తయే ॥

తండ్రివలె వీనిని మృదిమిగలవానినిగా అనగా దీర్ఘాయుష్యముగలవానినిగా జేయుము.

సూ॥ ఆధేహి । అగ్నయ ఇదం నమమ । కుమార స్యైవ హోమకర్తృత్వంనతు మంత్రోచ్చారణ మాధేహీతి బ్రూయాత్ । న స్వాహాకారః॥

ఆచార్యుడే మంత్రముచెప్పి వటువుని 'ఆధేహి'సమిధను(ఉంచుము) అని వటునిచే హోమము చేయించవలయును.

అథ ఉత్తరేణాగ్నిం దక్షిణేన పదాఽఽతిష్ఠేత్యశ్మానమాస్థాప్య.
(ఆస్థాపయత్యా తిష్ఠేతి॥)

"ఆతిష్ఠేమ" అను మంత్రము నాచార్యుడుచెప్పి అగ్నికుత్తరమున ఆ సాదనచేసిన రాతిని వటుని కుడికాలిచే త్రొక్కించవలెను.

అశ్మారోహణము రాతినెక్కుట

మం॥ ఆతిష్ఠేమ మశ్మాన మశ్మేవ త్వగ్ స్థిరో భవ ।

అభితిష్ఠ పృతన్యత స్సహస్వ పృతనా యతః ॥

అ॥ ఇమం = ఈ, అశ్మానం = రాతిని, ఆతిష్ఠ = ఎక్కుమా. త్వం = నీవు, అశ్మేవ = రాయివలెనే, స్థిరః = చిరకాలజీవిగా, భవ = ఉండుము. యతః = ఏ హేతువు వలన, పృతనాః = స్నేహితులు; పృతన్యతః = యుద్ధముచేయకోరికగల వారిలో ఆ హేతువువలన సేనలను, అభితిష్ఠ = ఎదుర్కొనుమా. సహస్వ = జయింపుమా.

తా॥ నీవు ఈ రాతినధిష్ఠించి ఈరాయివలెనే చిరకాలము జీవింపుము యుద్ధముచేయ కోరిక గలిగి వచ్చిన సేనల నెదుర్కొని ఆ సేనలను జయింపుమా.

సూ. రేవతీ స్త్వేతి ద్వాభ్యాం వాసస్సద్యః కృత్తోత
ముత్తరాభ్యా మభిమంత్ర్య ।

అప్పటికప్పుడుత్తరించిన వస్త్రమును ఆచార్యుడు క్రింది రెండు మంత్రములచే నభిమంత్రణ చేయవలెను.

ఓం భూః....శుభతిథౌ అస్య కుమారస్యాయుష్యాభివృద్ధ్యర్థం
శీతవాతోష్ణోపశమన ద్వారా దేహాలంకరణార్థం నూతనవస్త్రం
మౌంజ్యజిన దండధారణం కరిష్యే॥ ఇతి సంకల్ప్య ॥

'ఓం భూః' మొదలుకొని 'శుభతిథౌ' వరకు చెప్పి ఈ కుమారునకు ఆయుష్యము వర్ధిల్లుటకు చలి, గాలి, వేడి అను వాటిని పోగొట్టుట ద్వారా శరీరాలంకారము కొఱకును, నూతనవస్త్ర, మౌంజి, అజిన. దండముల ధారణమును చేసెదను అని సంకల్పము చేయవలెను. (చేసి)

మం॥ రేవతీ స్త్వా వ్యక్ష్ణ న్కృత్తికా శ్చాకృన్త గ్ స్త్వా ।
ధియోఽవయన్నవగ్నా అ వృంజన్ త్సహస్ర
మంతాగ్ం అభితో అయచ్ఛన్ ॥

అ॥ త్వా=నిన్ను గూర్చి. వాసః = వస్త్రమును నేయుటకు, రేవతీః=రేవతులనెడు దేవతలు, వక్ష్ణన్=ప్రత్తిని విడదీసిరి. కృత్తికాశ్చ=కృత్తికలనెడు దేవతలును, త్వా=నిన్ను గూర్చి, అకృంతన్= దారములను జేసిరి. ధియః=బుద్ధులనెడు దేవతలు. అవయన్= వస్త్రములనేసిరి. గ్నా=గ్నాలు అనెడు దేవతలు, అవావృంజన్= వస్త్రముల మధ్యను ఖండించిరి. సహస్రం=ఇతరులగు అనేక దేవతలు,

అభితః = రెండుప్రక్కలను, అంతాన్ = అంచులను కమ్ములను, అయ చ్ఛన్ = ఇచ్చిరి అనగా ఉంచిరి.

తా॥ నీ నిమిత్తమయిన వస్త్రమును నేయదలచి దేవతలు పత్తిని విడదీసిరి. కృత్తికలు దారములుగా వడికిరి. బుద్ధులు వస్త్రములుగా నేసిరి, గ్నాలు నడిమికి ఉత్తరించిరి. ఇతరులగు అనేక దేవతా స్త్రీలు రెండు ప్రక్కలను అంచులును కమ్ములును గలుగునట్లు నిర్మించిరి.

మం॥ దేవీర్దేవాయ పరిధీ సవిత్రే మహత్త
దాసా మభవన్మ హిత్వనమ్॥

అ॥ దేవీః = ఈ పదము పూర్వమంత్రముతో నన్వయము.

దేవాయ = దేవుడగు, సవిత్రే = సూర్యునియొక్క, (షష్ఠ్యర్థమందు చతుర్థి), పరిధీ = ధరించినకాలమందు, సప్తమ్యర్థమందు ప్రథమ) ఆసాం = ఈ దేవతలయొక్క, తత్ = ఆ, మహిత్వనం = మహిమ, మహత్ = విశేష మయినది, అభవత్ = ఆయెను.

తా॥ ఈ దేవతల వస్త్ర నిర్మాణశక్తి పూర్వమందు సూర్యునికి వస్త్రమును నిర్మాణముచేసినప్పుడు కలిగిన విశేషమహిమ కలదయ్యెను. అట్టి మహత్త్వము నీకును ఉండుగాకయని భావము.

శ్లో॥ అశ్మని స్థాపితం యేన వాసోఽపి పరిధాయచ।
మేఖలామజినం చైవ యావదశ్మాన మాచరేత్॥

రాతిమీద ఉంచిన బట్టకట్టుకొనవలెను. అటులనే మేఖలను చర్మ మును రాతి మీద నుంచి ధరించవలెను.

శ్లో॥ మౌంజ్యాజి నావస్థాపన ప్రోక్షణోత్థాపనానితు।
సమంత్రమేతా న్యాచార్యః పూర్వం కృత్వాథవాచయేత్॥

మౌంజి, అజినములనుంచుట, నీరు చల్లుట, పైకిత్తియుట ఇవి మంత్ర పూర్వకముగా ఆచార్యుడు మొదట తాను చేసి పిదప వటునిచే చదివింపవలయును.

సూ॥ యా అకృంతన్నితి తిసృభిః వాసః పరిధాప్య।

ఆచార్యుడు 'యా అకృంతన్' మొదలగు మూడు మంత్రములుచెప్పి వటుని మొలకు బట్ట కట్టవలెను.

మం॥ యా అకృంతన్నవయన్ యా అతన్వత

యాశ్చ దేవీ ర న్తానభితోఽదదంత।

తాస్త్వా దేవీర్జరసే సంవ్యయం త్వా

యుష్మా నిదం పరిధత్స్వ వాసః

అ॥ యాః=ఏ, దేవీః=దేవతలు, అకృంతన్=పత్తిని విడదీసిరో, యాః=ఏదేవతలు. అవయన్=వస్త్రమును నేసిరో, యాః=ఏదేవతలు, అతన్వత=వస్త్రమును విస్తరింపఁజేసిరో, యాశ్చ=ఏదేవతలు, అభితః=రెండు ప్రక్కలయందును, అంతాన్=అంచులను కమ్మెలను, ఆదదంత=ఇచ్చిరో, తాః=అటువంటి, దేవీః=దేవతలు, త్వా=నిన్ను, జరసే=ముదిమి కొఱకు, సంవ్యయంతు=వస్త్రమును ధరింపఁజేయుదురు గాక.

తా॥ నీ నిమిత్తమైన వస్త్రమును గూర్చి యేదేవతలు పత్తిని విడదీసిరో, ఏదేవతలు వస్త్రమునునేసిరో, ఏదేవతలు ఆవస్త్రమునకు అంచులు మొదలగు వానిని కల్పించిరో ఆ యాదేవతలు నీవు దీర్ఘాయుష్మంతుడవగు

రీతిని ఆవస్త్రమును నీచే ధరింపజేయగా నీవాయుష్మంతుడవై మాచేనియ్య బడు ఈ వస్త్రమును ధరింపుమా.

మం॥ పరిధత్త ధత్త వాససైనగ్ం శతాయుషం కృణుత

దీర్ఘమాయుః. బృహస్పతిః ప్రాయచ్ఛ ద్వాస ఏతత్సో

మాయ రాజ్ఞే పరిధాతవా ఉ॥

అ॥ హేదేవ్యః=ఓ రేవతీ మొదలగు దేవతలారా! ఏనం=ఈ పిల్లవానిని, వాససా=వస్త్రముచేతను, పరిధత్త=ధరింపఁజేయుడు, ధత్త=ధరింపఁజేయుడు, ఏనం=ఈ పిల్లవానిని, శతాయుషం=నూఱుసం॥ర ముల పర్యంతము జీవించువానినిగా, కృణుత=చేయుడు, దీర్ఘం=విశేష మైన, ఆయుః=ఆయుస్సును గుఱించి, ఏతత్=ఈ, వాసః=వస్త్రమును రాజ్ఞే=రాజైన, సోమాయ=సోమునికొఱకు, పరిధాతవై=ధరించుట కొఱకు, బృహస్పతిః=బృహస్పతి, ప్రాయచ్ఛత్=ఇచ్చెను. ఉ అను పదము నిరర్థకమయినది.

తా॥ ఓ రేవతీ మొదలగు దేవతలారా! ఈ పిల్లవానిచే వస్త్రమును ధరింపఁజేసి నూఱు సం॥రముల పర్యంతము జీవించు వానినిగాఁజేయుడు. ఈ వస్త్రమెటువంటిదనగా దీర్ఘాయుష్య నిమిత్తమై ధరించుటకుగాను సోమునికొఱకు బృహస్పతిచే నియ్యఁబడినటువంటిది.

మం॥ జరాం గచ్ఛాసి పరిధత్స్వ వాసో భవా కృష్టీనా

మభిశస్తిపావా। శతంచ జీవ శరదస్సువర్చా

రాయశ్చ పోషముప సంవ్యయస్వ॥

అ॥ ఇదం = ఈ, వాసః = వస్త్రమును, పరిధత్స్వ = ధరింపుమా, జరాం = క్రమముగా ముసలితనమును. గచ్ఛాసి = పొందుదువు, ఆకృష్టీనాం = బంధువులు మొదలగువారి యొక్క, అభిశస్తిపావా, అభిశస్తి = మేలును, పావా = అపేక్షించువాడవు, భవ = అవుము, సువర్చాః = మంచి కాంతిగలవాడవై, శతం = నూరైన, శరదః = సం॥రములు, జీవ = బ్రతుకుమా, రాయశ్చ పోషం = ధనవృద్ధినిగూర్చి, ఉపసంవ్యయస్వ = ఎప్పుడును ప్రయత్నము చేయుచుండుమా.

తా॥ ఓ పిల్లవాడా! ఈ వస్త్రమును ధరించుటచే నీవు ముదిమి వచ్చునంతవఱకు జీవించియుందువు కావున ధరింపుము. బంధువులు మొదలగువారి మేలును గోరుచుందువు. మంచి కాంతిగలవాడవై నూఱు సం॥రముల పర్యంతము జీవింపుమా, ధనవృద్ధినిగూర్చి ప్రయత్నము చేయుమా.

సూ॥ పరిధాప్యాచమ్య పరిహిత ముత్తరయాను మంత్రయతే॥

బట్టకట్టి ఆచమనము చేయించి క్రింది మంత్రముచెప్పి వటువు నభిమంత్రణ చేయవలెను.

మం॥ పరీదం వాసో అధిధా స్స్వస్తయేఽభూరాపీ
నామభి శస్తి పావా। శతం చ జీవ శరదః పు
రూచీర్వసూని చార్యో విభజాసి జీవన్॥

అ॥ ఇదం = ఈ, వాసః = వస్త్రమును, స్వస్తయే = సుఖముగానుండుటకొఱకు, పర్యధిధాః = ధరించినవాడవైతివి, ఆపీనాం = ఆప్తులు జ్ఞాతులు మొదలగు వారియొక్క, అభిశస్తిపావా, అభిశస్తి = మేలును, పావా = కోరువాడవు, అభూః = అవుమా, శతం = నూఱయిన, శర

దశ్చ=సం॥రములును. జీవ=బ్రతుకుమా, ఆర్యః=అధిపతివై, జీవన్=జీవించుచు, పురూచీః=అనేక విధములైన, వసూని=ధనములను, విభజాసి=అర్థులకు పంచిపెట్టుచుండుము.

తా॥ ఓ కుమారుడా! సుఖముగానుండుట కొఱకు ఈ వస్త్రమును ధరించితివి. ఆప్తులందరియొక్కయు మేలును అపేక్షించు వాడవగుము. నూఱు సం॥రములు జీవింపుము. అధిపతివై జీవించుచు విశేషమైన ధనములను అర్థులకు విభజించి యిచ్చుచుండుము.

మౌంజీ మేఖలాధారణమ్ : మౌంజీమేఖలను ధరించుట

సూ॥ మౌంజీం మేఖలాం త్రివృతం త్రిః ప్రదక్షిణ
ముత్తరాభ్యాం పరివీయ ॥

ముంజగడ్డితో పేని ముప్పిరివేసిన త్రాడును ముందురెండు మంత్రముల నాచార్యుడు చెప్పి వటుని మొలకు మూడుచుట్లు ప్రదక్షిణముగా చుట్టవలెను.

(అక్కడనుండి ప్రతిమంత్రము ముందుగనాచార్యుడుచెప్పి క్రియను జేసి పిమ్మట నామంత్రములను వటునిచే చెప్పించుచుండవలెను.)

మం॥ ఇయం దురుక్తాత్పరి బాధమానా శర్మ వరూథం
పునతీ న ఆగాత్ । ప్రాణాపానాభ్యాం బలమాభ
రంతీ ప్రియా దేవానాగ్ం సుభగా మేఖలేయమ్ ॥

అ॥ ఇయం=ఈ. మేఖలా=మొలనూలు, దురుక్తాత్=దుష్ట ప్రసంగములను, (ద్వితీయార్ధమందు పంచమీ) పరిబాధమానా=అంతటను

పోగొట్టుచు, వరూథం=కోరదగిన, శర్మ=గృహమును, పునతీ=పవిత్రముచేయుచు, నః=మమ్ములను, ఆగాత్=పొందెను. ఇయం=ఈ మేఖలా=మొలనూలు, ప్రాణాపానాభ్యాం=ప్రాణ+అపానవాయువుల కొఱకు, బలం=దార్ఢ్యమును, ఆభరంతీ=కలుగుచున్నట్లు చేయుచున్నదియు. దేవానాం=దేవతలకు, ప్రియా=ఇష్టమైనదియు కనుకనే, సుభగా=మనోహరమైనది.

తా॥ దేవతలకు ప్రియమైన ఈమొలనూలు నాచే ధరింపఁబడినదై. ప్రాణవాయువునకు అపానవాయువునకు బలమును గలుగఁజేయుచు. దుష్ట ప్రసంగములను పోగొట్టుచు, నేను సంచరించుచున్న ఈ గృహమును పవిత్రము చేయుగాక.

మం॥ ఋతస్య గోప్త్రీ తపసః పరస్పీ ఘ్నతీ రక్షస్స
హమానా అరాతీః । సా నస్సమంత మను పరీహి
భద్రయా భర్తార స్తే మేఖలే మా రిషామ॥

అ॥ మేఖలా=మొలనూలు, ఋతస్య=సత్యముయొక్క, గోప్త్రీ=కాపాడునదియు. తపసః=తపస్సునకు, పరస్పీ=మిక్కిలి రక్షకమైనదియు, రక్షః=రాక్షసులను, ఘ్నతీ=కొట్టునదియు (చంపునదియు), అరాతీః=శత్రువులను, సహమానా=తిరస్కరించునదియునై యున్నది. హే మేఖలే!=ఓ మొలనూలా! సా=ఆ ప్రసిద్ధమైన, త్వం=నీవు, నః=మమ్ములను, సమంతం=అంతటను, అను=క్రమముగా. పరీహి=పొందితివి, భద్రయా=శుభకరమైన నీతో గూడినవారమై, వయం=మేము, మారిషామ=నశింపము. తే=నిన్ను ధరించినవారు, భర్తారః=అధిపతులు (కాగలరు).

తా॥ ఓ మొలనూలా నీవుసత్యమును కాపాడుదానవును, తపస్సును రక్షించుదానవును, రాక్షసులను నశింపఁజేయు దానవును. శత్రువులను జయించుదానవును అగుదువు. ఇట్టి మహిమగలనీవు క్రమముగా మమ్ము లనందఱను అధిష్ఠించితివి. నిన్ను ధరించుటచే మేము ఆపదలను పొందము నిన్ను ధరించినవారు అధిపతులు కాగలరు

సూ॥ అజినం మిత్రస్యేతి ప్రక్షిప్య వాచయేత్ ।

'మిత్రస్య' అనెడు క్రింది మంత్రముచెప్పి కృష్ణాజినము వటుని కంఠమున ఉపవస్త్రముగా వేయవలెను.

మం॥ మిత్రస్య చక్షుర్ధరుణం బలీయ స్తేజో యశస్వి

స్థవిరగ్ం సమిద్ధమ్ ః అనాహనస్యం వసనం జరి

ష్ణు పరీతం వాజ్యజినం దధేహమ్ ॥

అ॥ మిత్రస్య = సూర్యునకు, చక్షుః = నేత్రమయినదియు, బలీయః = విశేషమైన, తేజః = తేజస్సును, ధరుణం = ధరించునదియు, యశస్వి = ధరించువానికి కీర్తినొసగునదియు, స్థవిరం = వృద్ధినొందించునదియు. సమిద్ధం = ప్రకాశించునదియు, అనాహనస్యం = ధూర్తులకుపనికి రానిదియు, జరిష్ణు = ధరించువానికి ముదిమివచ్చు వరకుండుటచే స్తోత్ర పాత్రమగునదియు, వాజి = అన్నము నొసగునదియునగు, ఇదం = ఈ, అజినం = కృష్ణాజినమును, వసనం = వస్త్రముగా, అహం = నేను, పరిదధే = ధరించుచున్నాను.

తా॥ సూర్యునకు నేత్రమయినదియు. విశేషతేజస్సును ధరించునదియు, కీర్తినిచ్చునదియు, వృద్ధినిచ్చునదియు, కాంతిగలదియు, ధూర్తు

లకు పనికేతానిదియు, అన్నమును గలుగఁజేయునదియునగు శ్రోత్రపాత్రమయిన ఈ కృష్ణాజినమును, వస్త్రమునుగా నేను ధరించుచున్నాను.

సూ॥ ఉత్తరేణాగ్నిం దర్భాన్ సగ్గంస్తీర్య ః
తేష్వేనముత్తరయావస్థాప్య ॥

అగ్నికుత్తరమున దర్భలనుపఱచి దానిపైని వటుని ముందు మంత్రము చెప్పి తనకభిముఖముగ కూర్చుండఁబెట్టవలెను.

(కూర్చుండబెట్టి .

ఆచార్యేణ కుమారగ్రహణమ్

ఆచార్యుడు కుమారుని గ్రహించుట

మం॥ ఆగంత్రా సమగన్మహి ప్రసు మృత్యం
యుయోతన । అరిష్టా స్సంచరేమహి స్వస్తి
చరతాదిహ స్వస్త్యా గృహేభ్యః ॥

అ॥ ఆగంత్రా = వచ్చుచున్న ఆచార్యునితో; సమగన్మహి = కలసికొంటిమి. మృత్యుం = మరణమును. ప్రసుయుయోతన = మిక్కిలి బాగుగాపోగొట్టగలము. అరిష్టాః = ఆపత్తులులేనివారమై, సంచరేమహి = సంచరించెదము. ఆచార్యోఽపి = ఆచార్యుడును, స్వస్తి = శుభముగలవాడై, చరతాత్ = సంచరించుగాక. ఇహ = ఈ బ్రహ్మచర్యమందు, ఆ గృహేభ్యః = గృహస్థాశ్రమము పర్యంతము, మమాపి = నాకును, స్వస్తి = శుభము, భవతు = అగుగాక.

తా॥ వచ్చుచున్న ఆచార్యునితోగూడి మేము మరణమునుపోగొట్టుకొనెదము. ఆచార్యుడును నేనును ఆపత్తులులేనివారమై సంచరించెదము,

ఆచార్యునకును ఇప్పుడు మొదలుకొని గృహస్థాశ్రమము పర్యంతము నాకును శుభమగు గాక.

సూ॥ ఆచార్యః స్వాంజల్యుదకం కుమారస్యాంజకౌ నినీయతాభిః
సముద్రాదితి త్రిః ప్రోక్ష్య వాచయేత్ ॥

ఉదకముతోగూడిన తనదోసిలిని ఆచార్యుడు వటుని దోసిలియందు విడిచి ముందుమంత్రమును 'సముద్రాత్' అను దానిని ఒక్కసారిచెప్పి మూడు సార్లు ఆతనిమీద ప్రోక్షించి (చల్లి) చదివించవలెను.

మం॥ సముద్రా దూర్మిర్మధు మాగ్ం ఉదారదుపాగ్ం శునా
సమమృతత్వ మశ్యామ్ । ఇమే నుతే రశ్మయస్సూ
ర్యస్య యేభి స్సపిత్వం పితరో న అయన్ ॥

అ॥ ఊర్మిః=నన్ను ప్రోక్షించెడి తరంగజలము. సముద్రాత్=సముద్రమునుండి తీసికొనిరాబడినది, మధుమాన్=సముద్రుడు, ఉదారత్=నా సమీపమును పొందినవాడాయెను. అంశునా=దీప్తిగల ఈ తరంగజలముచే. అమృతత్వం=దేవత్వమును, సముపాస్యామ్=పొందెదను. నః=మా యొక్క, పితరః=పూర్వులైన అంగిరసుడు మొదలయినవారు, యేభిః=ఏ కిరణములచేతను, సపిత్వం దేవతలతోగూడిన సయాన సోమపానమును. అయన్=పొందిరో, సూర్యస్య=సూర్యుని యొక్క, తే=ఆ కిరణములు, ఇమే=సముద్రతరంగ జలమే.

తా॥ నన్ను ప్రోక్షణచేసినజలము సముద్రోదకముగాన సముద్రుడు నాకు ప్రత్యక్షమయ్యెను. ఈ జలప్రోక్షణచే దేవత్వమును పొందెదను. మా పూర్వులైన అంగిరసుదడు మొలగువారు సూర్యకిరణములకంటె వేరు

గా. ఈ సముద్రజలమునే దేవతలతోగూడ సమానమైన సోమపానమును జేసిన వారైరి.

మం॥ యాభి రాదిత్యస్తపతి రశ్మిభిస్తాభిః పర్జన్యో వర్షతి
పర్జన్యే నౌషధి వనస్పతయః ప్రజాయంత ఓషధివనస్పతిభి
రన్నం భవత్యన్నేన ప్రాణాః ప్రాణైర్బలం బలేన తప
స్తపసా శ్రద్ధా శ్రద్ధయా మేధా మేధయా మనీషా
మనీషయా మనో మనసా శాంతిశ్శాంత్యా చిత్తం చిత్తేన
స్మృతిగ్గ్ం స్మృత్యా స్మారగ్గ్ం స్మారేణ విజ్ఞానం విజ్ఞానే
నాత్మానం వేదయతి తస్మాదన్నం దదన్త్సర్వాణ్యేతాని
దదాత్యన్నాత్ప్రాణా భవంతి భూతానాం ప్రాణైర్మనో
మనసశ్చ విజ్ఞానం విజ్ఞానాదానందో బ్రహ్మ యోనిః॥

అగ్నౌ ప్రాస్తాహుతిః సమ్యగాదిత్యము పతిష్ఠతి
ఆదిత్యా జ్జాయతే వృష్టిరితి ।

అ॥ ఆదిత్యః=సూర్యుడు, యాభిః=ఏ, రశ్మిభిః=కిరణములచేత, తపతి సంతాపమునుఎక్కువగా కలుగఁజేయుచున్నాడో, తాభిః= ఆతీవ్రకిరణములచేతనే, పర్జన్యః=మేఘరూపుడై, వర్షతి=వర్షించు

చున్నాడు. పర్జన్యేన=ఆవర్షజలముచేత, ఓషధివనస్పతయః=వడ్లు మున్నగుఓషధులు, అశ్వత్థపనసాదికములగువనస్పత్తులు, ప్రజాయన్తే= ఉత్పన్నము లాయెను. ఓషధి వనస్పతిభిః=ఓషధి వనస్పతుల చేత, అన్నం=అన్నము, భవతి=కల్గుచున్నది. అన్నేన=అన్నముచేత, ప్రాణాః=ప్రాణములు (పోషితములగుచున్నవి). ప్రాణైః=ప్రాణ ములచేత, బలం=దేహమునందు బలము కల్గుచున్నది. బలేన=బలము చేత, తపః=(కృచ్ఛ్రచాంద్రాయణాదిరూపమగు) తపస్సు (కల్గుచున్నది) తపసా=తపస్సుచే, శ్రద్ధా=(ఆస్తిక్యబుద్ధి) తత్త్వజ్ఞాన సంబంధమగు శ్రద్ధ, జాయతే=ఉత్పన్నమగుచున్నది. శ్రద్ధయా=ఆ శ్రద్ధచేతను, మేధా=గురూపదిష్టగ్రంధార్థధారణా రూపమగు, మేధ కల్గుచున్నది). మేధయా=మేధచేత, మనీషా=బుద్ధి(కలుగుచున్నది). మనీషయా= ఆ బుద్ధిచేత, మనః=నిరంతరముగా తత్త్వజ్ఞానమననము(కలుగుచున్నది) మనసా=ఆ తత్త్వజ్ఞానముచేత, శాంతిః=క్రోధాది వృత్తిరహిత రూప మగు శాంతియను వృత్తి కలుగుచున్నది. శాంత్యా=(శమము మొదలగు వానిచేత) శాంతిచేత, చిత్తం=ప్రమాణ జనితజ్ఞానము (కల్గుచున్నది). చిత్తేనఆ=జ్ఞానముచేత, స్మృతిం=తత్త్వ విషయక స్మృతిని (పొందు చున్నాడు). స్మృత్యా=స్మృతిశక్తిచేత, స్మారం=నిరంతరస్మరణమును (పొందుచున్నాడు). స్మారేణ=నిరంతర స్మరణముచేత, విజ్ఞానం= విశిష్టమైన జ్ఞానమును (పొందుచున్నాడు). విజ్ఞానేన=విజ్ఞానముచేత, ఆత్మానం=ఆత్మను. వేదయతి=తెలిసికొనుచున్నాడు, తస్మాత్=అందు వలన, అన్నం=అన్నమును, దదన్=ఇచ్చుచున్నవాడు. ఏతాని సర్వాణి=ఈచెప్పినవన్నియును, దదతి=ఇచ్చుచున్నాడు. అన్నాత్= అన్నమువలన, భూతానాం-భూతములయొక్క, ప్రాణాః=ప్రాణములు, భవంతి=కలుగుచున్నవి. ప్రాణైః=ప్రాణములచేత, మనః=మనస్సు (కల్గుచున్నది). మనసశ్చ=మనస్సువల్లనుండి, విజ్ఞానం=విజ్ఞానమున్ను విజ్ఞానాత్ = విజ్ఞానమువలన, ఆనందః = పరమానంద స్వరూపుడై,

బ్రహ్మ=వేదాంత ప్రతిపాద్యమగు, యోనిః - జగత్కారణ రూపుడు అగుచున్నాడు.

తా॥ ఈ కనఁబడుచున్న ఆదిత్యుడు ఏతీక్ష్ణతమ్ములగు కిరణముల చేత సంతాపమును కలుగఁజేయుచున్నాడో, తీవ్రతమములగు ఆకిరణముల చేతనే భూమియందున్న జలమును గ్రహించి మేఘస్వరూపుడై వర్షించు చున్నాడు. ఆ వర్షజలముచేత వ్రీహియవ్వగు ఓషధులును, అశ్వత్థాది వనస్పతులున్ను పుట్టుచున్నవి. ఈఓషధివనస్పతులవల్లనుండి భోజ్యమగు అన్నము కలుగుచున్నది, అన్నముచేత ప్రాణులు పోషింపఁబడుచున్నవి. పోషింపఁబడిన ప్రాణములచేత శరీరమునందు బలము కలుగుచున్నది. బలముచేత కృచ్ఛ్ర చాంద్రాయణాది రూపమగు తపస్సు సిద్ధించుచున్నది. అట్టి తపస్సుచేత పరిశుద్ధమయిన చిత్తముకలవానికి తత్త్వజ్ఞానవిషయకమగు శ్రద్ధగలుగుచున్నది. ఆశ్రద్ధచేత ఏకాగ్రచిత్తము గలవానికి మేధ కలుగు చున్నది. మేధయనగా గురువుపదేశించిన వేదాంతశాస్త్ర విషయము, తద ర్థము వీనిని ధరించుటయు అనునది, ఆమేధచేత మనీష జనించుచున్నది. మనీషయనగా బుద్ధిచేత మననము అనగా ఎడతెగక తత్త్వ విషయమును మననమొనర్చుట కల్గుచున్నది. అట్టి మననముచేత క్రోధాది మానసిక ద్వేషములకు అవసరము లేకపోవుటచేత శాంతి జనించుచున్నది, ఆ శాంతి చేత విక్షేపరహితుడగువానికి తత్త్వ విషయ ప్రమాణ జనితమగు చిత్తము అనగా జ్ఞానము కలుగుచున్నది, అట్టి జ్ఞానముచేత నిద్రాదివ్యవధానము న్నను తత్త్వవిషయకమగు స్మృతిని పొందుచున్నాడు, నిద్రాద్యనంతర భావినియగు స్మృతిచేత స్మారమును అనగా నిరంతరస్మరణమును పొందు చున్నాడు, అట్టి నిరంతరస్మరణముచేత విజాతీయములగు వ్యవధానములు లేక సర్వదా అవిచ్ఛిన్నముగా నుండు విజ్ఞానమును పొందుచున్నాడు, అట్టి విజ్ఞానముచేత ఆత్మను ఎఱుగుచున్నాడు, అన్నము ఈ విధముగా ప్రాణ బలాది పరం పరాక్రమముగ ఆత్మనెఱుంగుటకు హేతువగుచున్నది. కానీ యిట్టి యన్నమును ఒకనికి పెట్టునట్టివాడు ప్రాణము మొదలుకొని ఆత్మను

భోవమువలను గల వస్తువులకు దాన మొనర్చినవాడే యగుచున్నాడు. అన్న దానముచేత సర్వదానములు చేసినటులే యగునను విషయమును స్పష్టము చేయదలచి వెనుకచెప్పిన విషయమునే మఱల సంగ్రహముగా చెప్పు చున్నాడు. అన్నము వలన భూతములకు ప్రాణములు కలుగుచున్నవి. ప్రాణముచేతల మనస్సుకల్గుచున్నది, మనస్సుచేత విజ్ఞానము, విజ్ఞాన ముచేత ఆనందరూపుడై వేదాంత ప్రతిపాద్యుడగు జగత్కారణ స్వరూపుడే తానగుచున్నాడు లేక విజ్ఞానముచేత వేదాంతకారణ స్వరూపుడగుచున్నాడు-- అని గాని తాత్పర్యము.

అగ్నిలో వేయబడిన హోమము బాగుగా సూర్యుని చేరును.

సూర్యుని వలన వర్షము కలుగును అని

ఈ ప్రమాణములచే సూర్యకిరణములకును జలమునకును అభేదాధ్యవ సాయముగా అనగా భేదములేదని యిచట చెప్పఁబడియెను.

సూ॥ అగ్నిష్ట ఇతి దశభిః కుమారస్య సకృద్దక్షిణ
హస్తం గృహీత్వా (ఉత్తరైర్దక్షిణేహస్తే గృహీత్వా)

"అగ్నిష్ట" మొదలగు క్రింద పదిమంత్రములు ఆచార్యుడు చెప్పి కొనను తన కుడిచేతితో వటుని కుడిచేతి నొక్క మారు పట్టుకొనవలెను. (పట్టుకొని)

మం॥ అగ్నిష్టే హస్త మగ్రభీత్,

మం॥ సోమస్తే హస్త మగ్రభీత్,

మం॥ సవితాతే హస్తమగ్రభీత్,

మం॥ సరస్వతీతే హస్తమగ్రభీత్,

మం॥ పూషాతే హస్తమగ్రభీత్।

మం॥ బృహస్పతిస్తే హస్తమగ్రభీత్।

మం॥ అర్యమాతే హస్తమగ్రభీత్।

మం॥ అగ్ంశుస్తే హస్తమగ్రభీత్।

మం॥ భగస్తే హస్తమగ్రభీత్।

మం॥ మిత్రస్తే హస్తమగ్రభీత్।

మం॥ మిత్రస్త్వమసి ధర్మణాగ్నిరాచార్యస్తవ॥

అ॥ అగ్నిః=అగ్నిహోత్రుడు, తే=నీ యొక్క, హస్తం=హస్తమును, అగ్రభీత్=గ్రహించెను.

అ॥ సోమః=చంద్రుడు, తే=నీ యొక్క, హస్తం=హస్తమును, అగ్రభీత్=గ్రహించెను.

అ॥ సవితా=సూర్యుడు, తే=నీ యొక్క, హస్తం=హస్తమును, అగ్రభీత్=గ్రహించెను.

అ॥ సరస్వతీ=సరస్వతీదేవి, తే=నీయొక్క, హస్తం=హస్తమును, అగ్రభీత్=గ్రహించెను.

అ॥ పూషా=ద్వాదశ సూర్యులలో నొకసూర్యుడు, తే=నీయొక్క, హస్తం=హస్తమును, అగ్రభీత్=గ్రహించెను.

అ॥ బృహస్పతిః=బృహస్పతి, తే=నీయొక్క, హస్తం=హస్తమును, అగ్రభీత్=గ్రహించెను.

అ॥ అర్యమా=ద్వాదశ సూర్యులలో అర్యముడను సూర్యుడు, తే=నీయొక్క, హస్తం=హస్తమును, అగ్రభీత్=గ్రహించెను.

అ॥ అంశః=సూర్యకిరణము, తే=నీయొక్క, హస్తం=హస్తమును, అగ్రభీత్=గ్రహించెను.

అ॥ భగః=ద్వాదశసూర్యులలో భగుడను సూర్యుడు, తే=నీయొక్క, హస్తం=హస్తమును, అగ్రభీత్=గ్రహించెను.

అ॥ మిత్రః=ద్వాదశసూర్యులలో మిత్రుడను సూర్యుడు, తే=నీ యొక్క, హస్తం=హస్తమును, అగ్రభీత్=గ్రహించెను.

అ॥ ధర్మణా=ధర్మముచేతను, త్వం=నీవు, మిత్రః=సూర్యుడవు, అసి=అగుచున్నావు, తవ=నీయొక్క, ఆచార్యః=గురువు, అగ్నిః=అగ్నిహోత్రునిలో సమానుడు.

తా॥ అగ్నిహోత్రుడు నిన్ను సంరక్షించుటకొఱకు నీ హస్తమును పట్టుకొనెను.

తా॥ చంద్రుడు నిన్ను సంరక్షించుటకొఱకు నీ హస్తమును పట్టుకొనెను.

తా॥ సూర్యుడు నిన్ను సంరక్షించుట కొఱకు నీ హస్తమును పట్టుకొనెను.

తా॥ సరస్వతీదేవి నిన్ను సంరక్షించుటకొఱకు నీహస్తమును పట్టుకొనెను.

తా॥ ద్వాదశసూర్యులలో పూషయను నొక సూర్యుడు నిన్ను సంరక్షించుటకొఱకు నీహస్తమును పట్టుకొనెను.

తా॥ బృహస్పతి నిన్ను సంరక్షించుటకొఱకు నీ హస్తమును పట్టుకొనెను.

తా॥ ద్వాదశ సూర్యులలో అర్యముడను సూర్యుడు నీహస్తమును గ్రహించెను.

తా॥ సూర్యకిరణము నిన్ను సంరక్షించుట కొఱకు నీ హస్తమును గ్రహించెను.

తా॥ ద్వాదశ సూర్యులలో భగుడను సూర్యుడు నిన్నుసంరక్షించుటకు నీ హస్తము పట్టుకొనెను.

తా॥ ద్వాదశ సూర్యులలో మిత్రుడను సూర్యుడు నిన్ను సంరక్షించుట కొఱకు నీ హస్తమును పట్టుకొనెను.

తా॥ ధర్మముచేత నీవు సూర్యునితో సమానమును, నీ గురువు అగ్నిహోత్రునితో సమానమును అయితిరి.

## కుమారుని అగ్న్యాదులకు అర్పించుట

సూ. అగ్నయేత్వేతి ప్రతిమంత్రం దేవతాభ్యో రక్షణాయ దత్త్వా॥

"అగ్నయేత్వా" మొదలుకొని ఈ క్రిందనున్న పదునొకండు మంత్రలింగములచే తెలియఁజేయఁబడిన దేవతల కొఱకు అనగా ఒక్కొక్క మంత్రముచే ఒక్కొక్క మారొప్పగించవలెను.

మం॥ అగ్నయే త్వా పరిదదామి ... ... ....శర్మన్ ॥

అ॥ ఓ బ్రహ్మచారీ, త్వా = నిన్ను అగ్నయే = అగ్నికొఱకు, పరిదదామి = ఇచ్చుచున్నాను.

మం॥ సోమాయ త్వా పరిదదామి .... ....శర్మన్ ॥

అ॥ త్వా—నిన్ను, సోమాయ....సోముని కొఱకు, పరిదదామి = ఇచ్చుచున్నాను.

మం॥ సవిత్రే త్వా పరిదదామి .......శర్మన్ ॥

అ॥ త్వా = నిన్ను, సవిత్రే = సూర్యునికొఱకు, పరిదదామి = ఇచ్చుచున్నాను.

మం॥ సరస్వత్యై త్వా పరిదదామి ........శర్మన్ ॥

అ॥ త్వా = నిన్ను, సరస్వత్యై = సరస్వతికి, పరిదదామి = ఇచ్చుచున్నాను.

మం॥ మృత్యవే త్వా పరిదదామి .......శర్మన్ ॥

అ॥ త్వా = నిన్ను, మృత్యవే = మృత్యవు కొఱకు, పరిదదామి = ఇచ్చుచున్నాను.

మం॥ యమాయ త్వా పరిదదామి. ....శర్మన్ ॥

అ॥ త్వా = నిన్ను, యమాయ = యముని కొఱకు, పరిదదామి = ఇచ్చుచున్నాను.

మం॥ గదాయ త్వా పరిదదామి ..శర్మన్ ॥

అ॥ త్వా = నిన్ను, గదాయ = గదయను ఆయుధము కొఱకు, పరిదదామి = ఇచ్చుచున్నాను.

మం॥ అతకాయ త్వా పరిదదామి .. ....శర్మన్ ॥

అ॥ త్వా=నిన్ను, అంతకాయ=అంతకుని కొఱకు, పరిద దామి=ఇచ్చుచున్నాను.

తా॥ ఓ బ్రహ్మచారీ! నిన్ను సంహారముచేయు దేవుని కొఱకిచ్చు చున్నాను.

మం॥ అద్భ్యస్త్వా పరిదదామి........శర్మన్ ॥

అ॥ త్వా= నిన్ను, అద్భ్యః=ఉదకముల కొఱకు, పరిద దామి=ఇచ్చుచున్నాను.

తా॥ ఓ బ్రహ్మచారీ! నిన్ను ఉదకములకొఱకు ఇచ్చుచున్నాను.

మం॥ ఓషధీభ్యస్త్వా పరిదదామి........శర్మన్ ॥

అ॥ త్వా = నిన్ను, ఓషధీభ్యః=ఓషధులకొఱకు, పరిద దామి=ఇచ్చుచున్నాను.

తా॥ ఓ బ్రహ్మచారీ! నిన్ను ఓషధులకొఱకిచ్చుచున్నాను.

మం॥ పృథివ్యై త్వా సవైశ్వానరాయై పరిదదామి........శర్మన్॥

అ॥ త్వా=నిన్ను, సవైశ్వానరాయై=అగ్నిహోత్రునితోఁ గూడిన, పృథివ్యై=భూమికొఱకు, పరిదదామి=ఇచ్చు చున్నాను.

తా॥ ఓ బ్రహ్మచారీ! నిన్ను అగ్నిహోత్రముతోగూడిన భూదేవి కిచ్చుచున్నాను.

ఈపై అన్ని మంత్రములలోను "అసౌ" అని కొన్నిచోట్ల ఉన్నది. ఓ బ్రహ్మచారీ అని యర్థము చెప్పుకొనవలెను.

(ఈపై 11 మంత్రములలో ఒక్కొక్క మంత్రము నుచ్చరించుచు మంత్రము చివర....శర్మన్ అనుచు ఓ బ్రహ్మచారీ! నిన్ను ఫలానా

దేవతకు రక్షణ కొఱకు ఇచ్చుచున్నాను అని వేర్వేరుగా చెప్పవలెను. కొంచెము కొంచెము చేయిసాచి యీయవలెను).

సూ॥ ఉత్తరేణ యజుషోపనీయ పక్షాంతరమ్
'దేవస్య త్వే'తి దక్షిణాంక ఉపవేశ్య

ఈక్రింది యజుర్మంత్రముచెప్పి వటుని దగ్గరకుతీసికొనవలయును. (దేవస్య త్వా'అను మంత్రముతో వటువును కుడితొడమీద కూర్చుండఁ బెట్టుకొనవలెను. (కూర్చుండ బెట్టుకొని)

మం॥ దేవస్య త్వా సవితుః ప్రసవ ఉపనయే=శర్మన్ ॥

అ॥ ఓ బ్రహ్మచారీ ! దేవస్య= దేవుడగు, సవితుః=సూర్యుని యొక్క, ప్రసవే= అనుజ్ఞకలుగుచుండగా, త్వా= నిన్ను. ఉపనయ=నా సమీపమును పొందించుచున్నాను,

తా॥ ఓ బ్రహ్మచారీ ! సూర్యుడనుజ్ఞనియ్యగా గాయత్రి నుప దేశించుటకొఱకు నా సమీపమునందు నిన్నుఁగూర్చుండఁ బెట్టుకొనుచున్నాను.

(పై మంత్రములయందుండు "అసౌ" అను పదమునకు బ్రహ్మచారి యొక్క నామమును సంబుద్ధిచే గ్రహింపవలయును. పిల్లవానిని పైని చెప్పబడిన దేవతలకొఱకిచ్చుట సంరక్షణకొఱకని తెలిసికొనవలయును).

## సుముహూర్తము-చూర్ణిక

(పిమ్మట జీలకఱ్ఱ మొదలగు మంగళద్రవ్యములను ఆచార్య దంప తులు చేతఁబట్టుకొని క్రింది విధముగా ప్రార్థింపవలెను).

స్వస్తి అష్టాశీతి సహస్రాణాం ద్విజగురు దైవత్యానాం ఇంద్ర వైశ్వానర దండధర రక్షోగణేశ్వర వరుణ వాయుభట్టారక యక్షేశ సోమ శేఖరాణాం యమ నియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ

సమాధ్యష్టాంగ యోగనిరతానాం వసిష్ఠ వాలఖిల్య విశ్వామిత్రదక్ష కాత్యాయన కౌండిన్య పరాశరవ్యాస వాల్మీక సనక సనందన సనత్కుమారాది ముఖ్య మునీనాం స్వస్తి.

స్వస్తియగుగాక : 88 వేల మంది బ్రాహ్మణులకును, గురువులకును, దేవతలకును, ఇంద్రునకును, అగ్నికిని. యమునకును. నైఋతికిని, వరుణునకును, వాయువునకును, కుబేరునకును. ఈశానునకును, యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి అనెడు అష్టాంగయోగ మందాసక్తిగల వారికిని, వసిష్ఠుడు, వాలఖిల్యులు. విశ్వామిత్రుడు. దక్షుడు, కాత్యాయనుడు, కౌండిన్యుడు, పరాశరుడు, వ్యాసుడు, వాల్మీకి, సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు మొదలగు ప్రధానమునుల యొక్కయు మేలగుగాక,

సమస్త మంగళాలంకృత సకలకళ్యాణ లక్షవిలక్ష లక్ష్మీసమేతస్య.

అన్ని మంగళద్రవ్యములచే సలంకరింపబడిన, అన్ని కళ్యాణగుణములు గల్గిన లక్ష్మీదేవితోకూడియున్న వాడును.

శంఖచక్ర శార్ఙ్గ వనమాలాది శోభితస్య

శంఖము, చక్రము, శార్ఙ్గమను ధనుస్సు, వనమాల మొదలగు వానితో శోభగలవాడును,

శ్రీవత్స కౌస్తుభ సుషమా విశేషణ ముద్రాముద్రి తోరః స్థలస్య.

శ్రీవత్సమను పుట్టుమచ్చయొక్కయు కౌస్తుభమణియొక్కయుశోభా విశేషము గల్గిన ముద్రలచే ముద్రింపఁ బడిన వక్షస్థలము గలవాడును.

వైనతేయ కార్ద్రవేయ విష్వక్సేన సేవితస్య.

గరుడుని చేతను, నాగముల చేతను, విష్వక్సేనుని చేతను సేవింపఁ బడినవాడును.

వసుమతీ జాంబవతీ రుక్మిణీ సత్యభామాధి పతేః

భూ జాంబవతీ రుక్మిణీ సత్యభామలకు అధిపతియైనవాడును.

అనేక కోటిగీర్వాణ పండితస్య.

అనేకకోట్ల దేవతలకు పండితుడైనవాడును.

శ్రీలక్ష్మీనారాయణస్య చ ప్రసాదేన.

శ్రీలక్ష్మీనారాయణుని యొక్కయు అనుగ్రహముచేత.

వటోః ఉపనయనకాలే.

వటువునకు ఉపనయనముచేయు సమయమున.

హరిద్ర, జీరక, ఇక్షు, క్షీర, ఘృత, గుడగోరోచనాది.

పసుపూ, జీలకఱ్ఱ, చెఱకు, పాలు, నేయి, బెల్లము, గోరోచన మొదలగు

మంగళద్రవ్యాణి మంగళకరాణి భవేయుః ।

మంగళ ద్రవ్యములు, మంగళ కరములు అవుగాక.

తిథివారనక్షత్రయోగ కరణ ముహూర్తలగ్న హోరాద్రేక్కాణ నవాంశ ద్వాదశాంశ త్రింశాంశ త్రింశదంశకానాం.

తిథులు, వారములు, నక్షత్రములు, యోగములు, కరణములు, ముహూర్తము, లగ్నము, హోరా, ద్రేక్కాణము, నవాంశ, ద్వాదశాంశ, త్రింశాంశ, త్రింశదంశముకలవి యన్నియు.

నిరంతరమ్ అనుకూలాః శోభనకరాః స్వస్తి.

ఎల్లప్పుడు అనుకూలములును శోభనకరములును అయియుండుగాక. మేలు అగుగాక.

సర్వేగ్రహాస్స నక్షత్రాః శుభైకాదశ స్థానఫలదా వరదాః సుముహూర్తా స్సుప్రసన్నా భవంతు ॥

నక్షత్రములతోగూడిన గ్రహములన్నియు శుభైకాదశ స్థాన ఫలమిచ్చునవి. వరములనిచ్చునవి. మంచి ముహూర్తము గలవి, మంచి ప్రసన్నత కలవియునై యుండుగాక.

## మంగళాష్టకాని

శ్లో॥ శ్రీకృష్ణదేవః శ్రితపారిజాతః
శ్రీవక్త్రపద్మాళి రనంతవీర్యః ।
శ్రీమాన్ జగద్రక్షణ కార్యవృత్తో
వటుం చతుర్వేద పటుం కరోతు ॥

## మంగళాష్టకములు

ఆశ్రయింపఁబడిన పారిజాత వృక్షముగలవాడు, లక్ష్మియొక్క ముఖమను పద్మమునకు తుమ్మెద వంటివాడు, అంతులేని పరాక్రమము గలవాడు, శ్రీమంతుడు, జగద్రక్షణ కార్యమందున్నవాడునగు శ్రీకృష్ణ దేవుడు ఈ వటువును చతుర్వేదములందు సమర్థునిగాఁ జేయుగాక.

శ్లో॥ బోద్ధాభిధానో భగవాన్ పరేశః
ప్రజ్ఞానవాన్మౌని నిశాంత వాసః ।
శ్రీమజ్జగన్నాథపురాధి నాథో
వటుం చతుర్వేదపటుం కరోతు ॥

బోద్ధయను పేరుగలవాడును, భగవానుడును (షడ్గుణైశ్వర్య సంపద గలవాడును) పరేశుడును. ప్రజ్ఞానముగలవాడును, మౌనులను గృహ మందుండు వాడును, అగు శ్రీమంతుడయిన జగన్నాథపుర ప్రభువు ఈ వటువును చతుర్వేద పాటవముగలవానిగాఁ జేయుఁగాక,

శ్లో॥ కలిః కరాబ్జాత ధృతాసిచర్మా
శ్రీవిష్ణుశర్మాభిధ విప్రపుత్రః ।
తుచ్ఛాత్మ మర్త్యౌఘ వినాశకారీ
వటుం చతుర్వేదపటుం కరోతు ॥

హస్తపద్మమఁదు అసి చర్మను ధరించినవాడును, శ్రీవిష్ణుశర్మ యను పేరుగల బ్రాహ్మణుని పుత్రుడైనవాడును, తుచ్ఛమనస్సు గల్గిన

మానవసమూహమును నశింపఁజేయువాడును అగు కలిపురుషుడు ఈ వటువును చతుర్వేదములందు సమర్థునిగాఁ జేయుఁగాక.

మం॥ సా నో దేవీ సుహవా శర్మ యచ్ఛతు ।

ఆత్వాఽహార్ష మన్తరభూః । ధ్రువస్తిష్ఠావి చాచలిః।

విశస్త్వా సర్వా వాంఛంతు । మా త్వద్రాష్ట్రమధిభ్రశత్ ।

ధ్రువా ద్యౌర్ధ్రువా పృథివీ । ధ్రువం విశ్వమిదం జగత్ ।

ధ్రువా హ పర్వతా ఇమే । ధ్రువో రాజా విశామయమ్ ।

ఇహైవైధి మా వ్యథిష్ఠాః ।

పర్వత ఇవాది వి చాచలిః । ఇంద్ర ఇవేహ ధ్రువస్తిష్ఠ ।

ఇహ రాష్ట్రము ధారయ । అభితిష్ఠ పృతన్యతః ।

అధరే సంతు శత్రవః । ఇంద్ర ఇవ వృత్రహా తిష్ఠ ।

అపరి క్షేత్రాణి సంజయన్ । ఇంద్ర ఏణ మదీధ క్ ।

ధ్రువం ధ్రువేణ హవిషా । తస్మై దేవా అధిబ్రువన్ ।

అయం చ బ్రహ్మణ స్పతిః ॥

ధ్రువం తే రాజా వరుణో ధ్రువం దేవో బృహస్పతిః ।

ధ్రువం త ఇంద్ర శ్చాగ్నిశ్చ రాష్ట్రం ధారయతాం ధ్రువమ్॥

అ॥ సా=అటువంటి, సుహవా=సుఖముగా పిలుచుటకు శక్యమైన, దేవీ=ఇంద్రాణీదేవి, నః=మా కొఱకు, శర్మ=సుఖమును, యచ్ఛతు=ఇచ్చుగాక. హేరాజన్=శత్రువులచే అడ్డగించబడిన లేక అడ్డగించఁబడుచున్న ఓ రాజా! త్వాం=నిన్ను, ఆహార్షమ్=నా రాజ్యములోనికితీసికొనియున్నాను, అంతరభూః = ఆ రాజ్యములోపలనుండుము. ధ్రువః=అక్కడ స్థిరమైనవాడవై, అవిచాచలిః=ఎన్నడును చలనములేనివాడవై, తిష్ఠ=ఉండుమూ. సర్వాః విశః=ప్రజలందరు, త్వాం=నిన్ను, వాంఛతు=ఇష్టపడుదురు గాక. రాష్ట్రం = ఈ రాష్ట్రము, త్వ త్=నీ వలన, మా అభిభ్రశత్=భ్రష్టము కాకుండు గాక,

యథా=ఏవిధముగా, ద్యౌః=స్వర్గము, ధ్రువా=స్థిరమైనదో, పృథివీ=భూమి, ధ్రువా=స్థిరమైనదో, ఇదం=ఈ, విశ్వం జగత్=సర్వప్రపంచము. ధ్రువం=స్థిరమయి యున్నదో, ఇటులనే, అయం=ఈ, విశాం రాజా=ప్రజలయొక్క రాజు, ధ్రువః=స్థిరముగా ఉండు గాక.

హేరాజన్—ఓ రాజా! ఇహైవ=ఈ రాష్ట్రములోనే, ఏధి=స్థిరముగా నుండుమూ, మా వ్యథిష్ఠాః-భయమును పొందకుమూ. పర్వత ఇవ=పర్వతమువలె, అవిచాచలిః = నిశ్చలుడవై యుండుమూ, ఇంద్ర ఇవ=ఇంద్రునివలె (ఇంద్రుడెట్లుద్యులోకములో స్థిరముగా ఉన్నాడో) ఇహ=అటులనే నీవు ఈ రాష్ట్రములోనే ధ్రువః=స్థిరుడవై తిష్ఠ=

ఉండుము, ఇహైవ = ఈ రాష్ట్రములోనే ఉండి, రాష్ట్రం = ఈ రాష్ట్రము నంతను, ధారయ = పోషింపుమా, పృతన్యతః = మాపట్ల విరోధముగల సేనను తమకు కోరుచున్న ఆశత్రువులను, అభితిష్ఠ = ఆక్రమణముచే నిగ్రహించి స్థిరముగానుండుము. శత్రవః = ఆశత్రువులు, అధరేసంతు = నీకంటె క్రిందుగా ఉందురుగాక. వృత్రహా ఇవ = ఇంద్రునివలె, తిష్ఠ = శత్రుహంతకుడవై ఉండుమా. అపః = సస్యములకుపయోగపడెడు జలము లను, క్షేత్రాణి చ = క్షేత్రములనున్ను, సంజనయన్ = మంచి జయము మును గల్గించుచు ఉండుము.

ఇంద్రః = ఏయీ యింద్రుడున్నాడో అతడు, ఏణం = ఈరాజును, అదీధరత్ = స్థిరుడై యుండునట్లు ధరించుగాక. ధ్రువేణ = స్థిరమైన, హవిషా = శాస్త్రప్రకారము ఆచరింపబడిన హోమముచేత, దేవాః = సంతుష్టులైన దేవతలు, తస్మై = ఆయజమానునకు, అధిబ్రువన్ = ఇతడధికుడని చెప్పుదురుగాక. అయం = ఈ, బ్రహ్మణస్పతిః చ = బ్రహ్మణస్పతి గూడ ఇతడధికుడని చెప్పుదురుగాక.

హేరాజన్ = ఓ రాజా! తే = నీ యొక్క, రాష్ట్రం = రాష్ట్రమును రాజా = ప్రకాశించుచున్న, వరుణః = వరుణుడు, ధ్రువం = స్థిరముగా, ధారయతు = పోషించుగాక. దేవః = దానాదిగుణయుక్తుడైన, బృహస్పతిః = బృహస్పతి, ధ్రువః = స్థిరముగా, ధారయతు = ధరించుగాక, ఇంద్రశ్చ అగ్నిశ్చ = ఇంద్రుడు అగ్నియు ఇర్వురున్ను, తే = నీ యొక్క రాష్ట్రం = రాష్ట్రమును, ధ్రువం = స్థిరముగా, ధారయతామ్ = పోషింతురుగాక.

అయం ముహూర్తస్సుముహూర్తోఽస్తు।

ఈ ముహూర్తము శుభప్రదమైన ముహూర్తముగుగాక. అని అక్షతలు వేయవలెను.

ముహూర్తకాలే ఆత్మనః సమీపమానయతి।

బ్రహ్మోపదేశ సమయముగనుక వటువును మిక్కిలి దగ్గరకు తీసి కొని నూతన వస్త్రమాచ్ఛాదించుకొని.

సూ॥ 'సుప్రజా' ఇతి దక్షిణే కర్ణేజపతి,

"సుప్రజాః" అను మంత్రమును వటుని కుడిచెవిలో జపము చేయ వలెను.

(కొంతమంది 'దేవస్యత్వా సవితుః ప్రసవ ఉపనయేఽసౌ సుప్రజా' ఇతి (ఓ శర్మా! సూర్యభగవానుని అనుజ్ఞపొంది నేను నిన్ను నా సమీపము నకు తీసికొని వెళ్ళెదను. ఇతడు సంతానము గలవాడగుగాక అని) కుడి చెవిలో జపించును.

మం॥ సుప్రజాః ప్రజయా భూయాస్సువీరో వీరైః
స్సువర్చా వర్చసా సుపోషః పోషైః॥

అ॥ ప్రజయా = సంతానముచేత, సుప్రజాః = మంచిసంతానము గలవాడవును, వీరైః=పుత్రపౌత్రాదులచేత, సువీరః=యోగ్యులైన తన యాదులుగలవాడవును, వర్చసా = కాంతిచేత,సువర్చాః = మంచి కాంతిగల వాడవును, పోషైః = వృద్ధులచేత, సుపోషః=మంచి వృద్ధి గలవాడవును భూయాః= అవుమా.

తా॥ మంచి సంతానముగలవాడవును, యోగ్యులయిన పుత్రులు గలవాడవును, మంచి కాంతి గలవాడవును, మంచి వృద్ధిగలవాడవును అగుము.

ఓ బ్రహ్మచారీ! సత్సం తానము, వీరులగు పుత్రపౌత్రాదులు గల్గి సువర్చస్వుడవయి, (సువర్చస్వివయి) పోషకులగు పుత్రాదులచే సుపోషు డవై యుండుము అని తాత్పర్యము.

సూ॥ బ్రహ్మచర్యమాగామితి కుమార ఆహ॥

"బ్రహ్మచర్యమ్ ఆగామ్" అను మంత్రమును కుమారుడు చెప్ప వలెను.

## గుర్వర్పణాయ కుమారస్య ప్రార్థనా
## గురువున కర్పించుటకొఱకు కుమారుని ప్రార్థన

మం॥ బ్రహ్మచర్య మాగా ముపమానయస్వ
దేవేన సవిత్రాప్రసూతః

అ॥ అహం = నేను, బ్రహ్మచర్యం = వేదాభ్యాసము నిమిత్తమైన వ్రతమును, ఆగామ్ = పొందితిని, దేవేన = దేవుండగు, సవిత్రా = సూర్యునిచేత, ప్రసూతః = అనుజ్ఞ పొందినవాడవై, త్వం = నీవు, మాం = నన్ను, ఉపనయస్వ = నీ సమీపమునకు తీసికొనుము.

సూ॥ ప్రష్టం పరస్యప్రతి వచనం కుమారస్య॥

ఈ దిగువ ప్రశ్నవాక్యముల నాచార్యుడును సమాధానము కుమారుడున్ను చెప్పవలెను.

తా॥ ఓ ఆచార్యుడా! నేను వేదాభ్యాసముకొఱకు బ్రహ్మచర్య వ్రతమును పూనితినిగాన నీవు సూర్యునిచే అనుజ్ఞను పొంది వేదముపదేశించుకొఱకు నన్ను నీ సమీపమందుంచుకొమ్ము అని వటువు ఆచార్యుని ప్రార్థించును.

ఆచార్యః :-

మం॥ కో నామాసి?
నీ పేరేమి

కుమారః ;-

శ్రీకృష్ణ శర్మా నామాస్మి

నా పేరు శ్రీకృష్ణశర్మ,

ఆచార్యః :-

కస్య బ్రహ్మాచార్యసి శ్రీకృష్ణశర్మన్ ? ॥

నీ వెందునిమిత్తము బ్రహ్మచర్యము చేయుచున్నావు?

కుమారః :-

ప్రాణస్య బ్రహ్మాచార్యస్మి॥

ఆత్మను గుఱించి చేయుచున్నాను.

శేషం పరోజపతి।

మిగిలిన మంత్రములను ఆచార్యుడు జపించవలెను.

(జపించుచున్నాడు.)

మం॥ శ్రీకృష్ణ శర్మైష తే దేవ సూర్యసబ్రహ్మాచారీ

తం గోపాయ సమామృతైష తే సూర్యపుత్రి

స్స దీర్ఘాయుస్సమామృత యాగ్ స్వస్తి

మగ్నిర్వాయు స్సూర్యశ్చంద్రమా ఆపోఽను

సంచరంతి తాగ్ స్వస్తి మను సంచర శ్రీకృష్ణ

శర్మన్॥

అ॥ దేవ సూర్య=దేవుడగు సూర్యుడా! ఏషః=ఈ వటువు, తే=నీ యొక్క, బ్రహ్మచారీ=బ్రహ్మచర్యవ్రతము గలవాడు. తం= అటువంటివానిని, గోపాయ = రక్షించుమా, సః = ఆ బ్రహ్మచారి, మామృత=మరణమును పొందకుండుగాక. హేసూర్య=ఓ సూర్యుడా! ఏషః=ఈ పిల్లవాడు, తే=నీ యొక్క, పుత్రః=కుమారుడు; సంః= ఆ బ్రహ్మచారి, దీర్ఘాయుః=దీర్ఘాయుష్యముగలవాడై, మామృత=అకాల మృత్యువును పొందకుండుగాక. అసౌ=ఓ బ్రహ్మచారీ! అగ్నిః=అగ్ని హోత్రుడును, వాయుః=వాయువును, సూర్యః=సూర్యుడును, చంద్ర మాః=చంద్రుడును, ఆపః=ఉదకములను, యాం=ఏ, స్వస్తిం= శుభమును. అను=క్రమముగా, సంచరంతి=కలిగి ప్రవర్తించుచున్నారో త్వమపి=నీవును, తాం=అటువంటి, స్వస్తిం=శుభమును, అను= అనుసరించి, సంచర=ప్రవర్తింపుమా.

తా॥ ఓ సూర్యుడా! ఈ పిల్లవాడు నీసంబంధమైన బ్రహ్మచర్య మును బూనియున్నాడు. కావున ఈ బాలుని రక్షింపుము. ఓ సూర్యుడా! ఇతడు నీ పుత్రునితో సమానుడుగాన దీర్ఘాయువు నొసగి అకాలమరణమును పొందింపకుము. ఓ పిల్లవాడా! అగ్నియును, వాయువును, సూర్యుడును, చంద్రుడును, ఉదకములును ఎటువంటి శుభముకలిగి ప్రవర్తించుట కలుగు చున్నదో నీవును అటువంటి శుభముకలిగి ప్రవర్తింపుమని యాచార్యుడు పలుకుచున్నాడు.

సూ॥ ప్రత్యగాశిషం చైనం వాచయతి॥

ఆశీః ఫలము వటుని పొందునదిగానే మంత్రములందుండునో వానిని ఈ వటునిచేతగూడ చెప్పించవలెను.

మం॥ అధ్వనా మధ్వపతేః శ్రేష్ఠస్యాధ్వనః

పారమశీయ॥

అ॥ అధ్వనాం=సమస్తసుఖములనెడు, అధ్వపతే=మార్గముల ప్రభువగునో సూర్యుడా! శ్రేష్ఠస్య=శ్రేయస్కరమైన, అధ్వనః=బ్రహ్మచర్యమను మార్గముయొక్క, పారం=అంతమును, అశీయ=పొందెదను.

తా॥ సుఖములకధిపతివగు నో సూర్యుడా! నీయనుగ్రహమువలన శ్రేయస్కరమైన బ్రహ్మచర్యవ్రతమును సంపూర్తి నొందింపగలను అని బ్రహ్మచారి పలుకుచున్నాడు.

అథ ఆచార్యః యోగాదీన్ నవమంత్రాన్ కుమారం వాచయన్ ద్వితీయ చతుర్థౌ స్వయం బ్రువన్ ప్రతిమంత్ర మేకాదశాజ్యాహుతీః కుమారేణ హావయిత్వా :-

పిమ్మట ఆచార్యుడు ఆజ్యభాగాంతమున జేయబడియున్న యగ్ని యందు వటునిచే నీ క్రింది యోగాది నవమంత్రములను చెప్పించుచు తాను మాత్రము 2, 4 మంత్రములను చెప్పి ప్రతి మంత్రమునకు 11 ఆజ్య హోమములను కుమారునిచే చేయించవలెను.

( చే యి ం చి )

ఏకం, ద్వే, త్రీణి, చత్వారి కుమారో జుహోతి।

ఈ పై మాటలు చెప్పి కుమారుడు హోమము చేయవలెను.

(హోమము చేయుచున్నాడు.)

మం॥ యోగేయోగే తవస్తరం వాజేవాజే హవామహే।
సఖాయ ఇంద్రమూతయే స్వాహా॥ ఇంద్రాయేదం
(నమమ)॥

అ॥ యోగేయోగే=ప్రతికర్మయందును, తవస్తరం మిక్కిలి కొనియాడదగిన, ఇంద్రం=ఇంద్రుని, సఖాయః=స్నేహితులమైన మేము

వాజేవాజే=ప్రతియజ్ఞ మందునను, ఊతయే=రక్షణకొఱకు, హవామహే=పిలుచుచున్నాము.

తా॥ ప్రతికర్మమునందును కొనియాడఁదగిన (అశ్వాదులను రథాదులకుఁ గట్టినపుడు నీగమనమునకు శ్రేష్ఠుడైన) ఇంద్రుని (ప్రతియుద్ధమందును) ప్రతి యజ్ఞమందునను మమ్ములను రక్షించుట కొఱకు పిలుచుచున్నాము. ఈ యాహుతి ఇంద్రునకు అర్పితమగుఁగాక, నాకుగాదు.

తత ఆచార్యః

తరువాత ఆచార్యుడు

మం॥ ఇమమగ్న ఆయుషే వర్చసే కృధి ప్రియగ్ం

రేతో వరుణ సోమరాజన్। మాతే వాస్మా

అదితే శర్మ యచ్ఛ విశ్వేదేవా జరదష్టిర్య

థాఽసథాస్వాహా॥ అగ్నివరుణసోమాదితి

విశ్వేభ్యోదేవేభ్య ఇదం (నమమ)।

అ॥ హే అగ్నే=ఓ అగ్నిహోత్రుడా! ఇమం=ఈ పిల్లవానిని ఆయుషే=ఆయుస్సుకొఱకును, వర్చసే=వర్చస్సుకొఱకును, కృధి=చేయుము, హే వరుణ=ఓ వరుణుడా! రాజన్=ప్రభువగు, సోమ=చంద్రుడా! ప్రియం=ఇష్టమైన, రేతః=సారమును, కృధి=కలుగజేయుము, హే అదితే=ఓ అదితీ! అస్మై=ఈతనికి, మాతేవ=తల్లివలెనే, శర్మ=సుఖమును, యచ్ఛ=ఇమ్ము, హే విశ్వేదేవాః=ఓవిశ్వేదేవతలారా! అయం=ఇతడు, జరదష్టిః=ముదిమి పొందువఱకు జీవించు

వాడై, యథా=ఏ ప్రకారముగా, **అసత్**=అగునో, తథా=ఆ ప్రకారముగా, యూయం=మీరు, శర్మ=సుఖమును. యచ్ఛత=ఇండు.

తా॥ ఓ అగ్నిహోత్రుడా! ఈ పిల్లవానిని దీర్ఘాయువు వర్చస్సు గలవానినిగాఁజేయుము. ఓ వరుణుడా! ఓ చంద్రుడా! ఇతనిని గృహస్థునిగాఁజేయుడు. ఓ అదితీ! నీవు తల్లివలెనే సుఖమునిమ్ము. ఓ విశ్వేదేవతలారా! ఈ పిల్లవాడు ముసలివాడగునంతవఱకు జీవించునట్లు మీరీ పిల్లవానికి సుఖమునిండు.

ఈ ఆహుతి అగ్నివరుణ సోమ **అదితి** విశ్వేదేవతలకు అర్పితమగుగాక.

కుమారః :-

కుమారుడు—

**మం॥** శతమిన్ను శరదో అంతిదేవా యత్రానశ్చక్రా

జరసం తనూనాం పుత్రాసో యత్ర పితరో

భవంతి మానో మధ్యా రీరిషతాయుర్గం

తో స్వాహా॥ దేవేభ్య ఇదం॥

**అ॥** దేవాః=ఓ దేవతలారా! యూయం=మీరు, యత్ర=ఏ శతాయుర్దాయముచే, నః=మాయొక్క, తనూనాం=శరీరములకు, జరసం=ముదిమిని, చక్రాః=చేసితిరో, శతమిన్ను=అటువంటి నూఱు అయిన, శరదః=సంవత్సరములు, అంతి=స్వల్పమయినవి. యత్ర=ఏ కాలములో, పుత్రాసః=తనయులు గలవారమై, పితరః=వారికి తండ్రులము, భవంతి=అవుచున్నామో, (ఆ) గంతోః=కాలమృత్యువు

సంభవించువఱకును, నః=అట్టి మాయొక్క, ఆయుః =ఆయుష్యమును మధ్యా=నడిముకాలములో, మా రీరిషత=భంగము చేయకుందురుగాక.

తా॥ ఓ దేవతలారా! మీరు నూఱు సంవత్సరములు ఆయుర్దాయము నొసగి మమ్ముల ముదిమి కలుగునంతవఱకు జీవించువారినిగాఁ జేసినను ఆ కాలము స్వల్పమేఅగును. అదిగాక దారాపుత్రాది పోషణముచే మాయాయుర్దాయమును వ్యర్థముగా వెళ్ళఁబుచ్చు చున్నాము గాన కాల మృత్యువు సంభవించునంతవఱకు మధ్య కాలములో మాయాయువునకు భంగము కలుగనీయకుడు. ఈ ఆహుతి దేవతల కర్పితమగుగాక.

తత ఆచార్యః

పిమ్మట ఆచార్యుడు

మం॥ అగ్నిష్ట ఆయుః ప్రతరాం దధాత్వగ్నిష్టే పుష్టిం
ప్రతరాం కృణోతు। ఇంద్రో మరుద్భిర్ ఋతుథా
కృణోత్వాదిత్యైస్తే వసుభిరాదధాతు స్వాహా॥

అగ్నీంద్రమరుదాదిత్య వసుభ్యఇదం (నమమ)

అ॥ అగ్నిః=అగ్నిహోత్రుడు, తే=నీయొక్క, ఆయుః= ఆయుస్సును, ప్రతరాం=విశేషమైనదానినిగా. దధాతు=చేయుగాక, అగ్నిః=అగ్నిహోత్రుడు, తే = నీయొక్క, పుష్టిం=పోషణమును, ప్రతరాం=వృద్ధిగలదానినిగా, కృణోతు=చేయుగాక! ఇంద్రః=దేవేంద్రుడు, మరుద్భిః = దేవతలతోగూడ, ఋతుథా=ప్రతి ఋతువునందును, పుష్టిం=పోషణము, కృణోతు = చేయుగాక, సః=ఆ యింద్రుడు, ఆదిత్యైః=ద్వాదశాదిత్యులతోడను, వసుభిః = అష్టవసువులతోడను, తే=నీకు, పుష్టిం=పోషణమును, ఆదధాతు=ఎప్పుడును చేయుగాక.

తా॥ అగ్నిహోత్రుడు నీయాయుర్దాయమును పుష్టిని వృద్ధియగు నట్లు చేయుఁగాక, ఇంద్రుడు దేవతలతోను, ద్వాదశాదిత్యులతోను, అష్ట వస్తువులతోను గూడినవాడై ప్రతి ఋతువునందునను ప్రతిక్షణమందునను నీ పోషణమును చేయుగాక. అగ్నీంద్రమరుదాదిత్య వస్తువులకిది యర్పిత మగుగాక.

కుమారః

కుమారుడు

మం॥ మేధాం మహ్యమంగిరసో మేధాగ్ం సప్త ఋషయో

దదుః। మేధాం మహ్యం ప్రజాపతిర్మేధా మగ్నిర్దదా

తు మే స్వాహా॥

అంగిరస్సప్తర్షిప్రజాపత్యగ్నిభ్య ఇదమ్॥

అ॥ అంగిరసః=అంగీరసులు, మహ్యం=నాకొఱకు, మేధాం= జ్ఞాపకశక్తిగల బుద్ధిని, దదుః = ఇత్తురుగాక, సప్త = ఏడుగురైన, ఋషయః=ఋషులు, (కశ్యపుడు మొదలగు మునీశ్వరులు) మేధాం= ధారణాశక్తిగలబుద్ధిని, దదుః =ఇత్తురుగాక, ప్రజాపతిః = బ్రహ్మ, మహ్యం=నాకొఱకు, మేధాం=మేధను, దదాతు=ఇచుగాక, అగ్నిః= అగ్నిహోత్రుడు, మే=నా కొఱకు, మేధాం = మేధను, దదాతు= ఇచ్చుగాక. అంగిరస్సప్తర్షిప్రజాపత్యగ్నిభ్యః =అంగిరస్సప్తర్షిప్రజాపత్య గ్నులకొఱకు, ఇదమ్=ఈ యాహుతి అర్పితమగుగాక.

తా॥ అంగిరస్సులు. సప్తర్షులు, బ్రహ్మయు, అగ్నిహోత్రుడు నా ధారణాశక్తిగలబుద్ధిని అనగా చెప్పిన విషయమును జ్ఞాపకముంచుకో గల్గిన బుద్ధిని నాకు కలుగఁజేయుదురు గాక.

అంగిరసులకు, సప్తర్షులకు, ప్రజాపతులకు అగ్నికిని ఈయాహుతి అర్పితమగుగాక.

మం॥ అప్సరాసు చ యా మేధా గంధర్వేషు చ
యద్యశః । దైవీ యా మానుషీ మేధా సా
మా మావిశతాదిహ స్వాహా ॥
మేధాదేవ్యా ఇదమ్ ॥

అ॥ అప్సరాసుచ=అప్సరసలయందు, యా=ఏ, మేధా=బుద్ధి కలదో, సా=ఆ బుద్ధియును, గంధర్వేషు చ=గంధర్వులయందు, యత్=ఏ, యశః=కీర్తిగలదో, తత్=ఆకీర్తియును, మాం=నన్ను, ఆవిశతాత్=పొందునుగాక. ఉత = ఇంతియేకాదు, దైవీ=దేవతల సంబంధమైనదియు, మానుషీ=మనుష్య సంబంధమైనదియు, యా= ఏ. మేధా=బుద్ధి, అస్తి=కలదో, సా=ఆ బుద్ధి, మాం=నన్ను, ఇహ=ఇప్పుడే. ఆవిశతాత్ = పొందునుగాక.

మేధాదేవ్యై=మేధా దేవతకు, ఇదమ్=ఇది.

(అర్పితమగు గాక).

తా॥ గంధర్వుల యందుండునట్టి కీర్తియు అప్సరసలయందుండునట్టి బుద్ధియు నాకు గలుగుగాక. ఇంతియేకాదు. దేవతల సంబంధమయినదిగాని మనుష్యుల సంబంధమయినదిగాని బుద్ధియంతయు నాకు గల్గుగాక.

మేధాదేవి కొఱకు ఈ యాహుతి అర్పితమగుగాక.

మం॥ ఇమం మే వరుణ శ్రుధీ హవ మద్యాచ మృడయ ।
త్వామ వస్యు రాచకే స్వాహా ॥
వరుణా యేదమ్ ॥

అః॥ హేవరుణ=ఓ వరుణుడా! మే=నాయొక్క, ఇమం= ఈ. హవం=పిలుపును, శ్రుధీ=వినుము; అద్యాచ=ఇప్పుడే, మాం=నన్ను, మృడయ=సుఖపెట్టుము; అహం=నేను, త్వాం= నిన్ను, అవస్యుః=రక్షించు వానిగాఁగోరినవాఁడనై, ఆచకే=స్తోత్రము చేయుచున్నాను.

వరుణాయ=వరుణుని కొఱకు, ఇదమ్=ఇది.

తా॥ ఓవరుణుడా! నిన్ను రక్షకునిగాగోరి స్తోత్రముచేయుచున్నాను. కావున నా పిలుపువిని వచ్చి యిప్పుడే నన్ను సుఖపెట్టుము.

వరుణునికి ఈ యాహుతి అర్పితమగు గాక.

మం॥ తత్త్వాయామి బ్రహ్మణా వందనమాన స్తదాశాస్తే యజ
మానో హవిర్భిః। అహేడమానో వరుణేహ బోధ్యు
రుశగ్ంస మాన ఆయుః ప్రమోషీ స్స్వాహా ॥
వరుణా యేదమ్ ॥

అః॥ ఉరుశంస=అనేకులచే స్తోత్రముచేయఁబడు, హేవరుణ= ఓ వరుణుడా! నః=మా యొక్క, ఆయుః=ఆయుర్దాయమును, మా ప్రమోషీః=భంగపఱుపకుము. అహేడమానః=కోపము లేనివాడవై, ఇహ=ఈ కర్మమునందు నాచేచెప్పఁబడుదానిని, బోధి=తెలిసికొనుము. తత్=అనంతరమందు, త్వా=నిన్ను, యామి=పొందుచున్నాను. యజమానః=ప్రతియజమానుడు, బ్రహ్మణా=వేదము చేత. వంద మానః=స్తోత్రము చేయుచున్నవాడవై, హవిర్భిః=ఆజ్యాది హవిస్సుల చేత తృప్తినొందుచున్నవాడై, తదేవ=నేనుకోరెడుదానినే, ఆశాస్తే= కోరుచున్నాడు.

వరుణాయ=వరుణుని కొఱకు, ఇదమ్=ఇది.

తా॥ ఓ వరుణుడా ! నాయాయుర్దాయమునకు భంగము కలిగింపకుము. నీవు కోపములేనివాడవై, నా ప్రార్థనము వినుము. నేనుకోరెడు దానిని అనంతరము యాచించెదను. ప్రతియజమానుడును నిన్ను ఆజ్యాది హవిస్సులచే, తృప్తినొందించియు వేదములచే ప్రార్థించియు నేను కోరెడి దానినే కోరుచున్నాడు.

ఈ యాహుతి వరుణునకు అర్పితమగు గాక.

మం॥ త్వన్నో అగ్నే వరుణస్య విద్వాన్ దేవస్య హేడోఽవ

యాసి సీష్ఠాః । యజిష్ఠో వహ్నితమ శ్శోశుచానో వి

శ్వా ద్వేషాగ్ంసి ప్రముముగ్ధ్య స్మత్స్వాహా ॥

అగ్నీ వరుణా భ్యామిదమ్ ॥

అ॥ హే అగ్నే = ఓ అగ్నిహోత్రుడా ! విద్వాన్ = సమస్తమును దెలిసిన, త్వం = నీవు, దేవస్య = దేవుడగు, వరుణస్య = వరుణునకు. నః = మాయందు, హేడః = ఏ క్రోధముగలదో, తం = ఆ క్రోధమును అవయాసిసీష్ఠాః = విడిచిపెట్టునట్లు చేయుము. యజిష్ఠః = పూజింపబడినటువంటి వహ్నితమః = అగ్నిహోత్రుడు, శోశుచానః = ప్రకాశించుచున్నవాడై, విశ్వాద్వేషాంసి = శత్రువులకు మాయందుండు సమస్తమైన ద్వేషములను, అస్మత్ = మా వల్లనుండి, ప్రముముగ్ధి = విడిచిపెట్టునట్లు చేయుగాక. అగ్నీవరుణాభ్యాం = అగ్నికిని వరుణునకును, ఇదమ్ = ఇది.

తా॥ ఓ అగ్నిహోత్రుడా ! నీవు సమస్తము దెలిసినవాడవు కాన వరుణునకు మాయందుండు కోపమును విడిచిపెట్టునట్లు చేయుము. అగ్నిహోత్రుడు మాచే పూజింపబడిప్రకాశించుచు శత్రువులకు ఇంతకుపూర్వము మాయందుండు సమస్తవైరములను వారువిడిచిపెట్టునట్లుచేయుగాక. అగ్నికి వరుణునకును ఈయాహుతి అర్పితమగుగాక.

మం॥ సత్వన్నో అగ్నే౽వమో భవోతీ నేదిష్ఠో అస్యా
ఉషసో వ్యుష్టౌ। అవయక్ష్వ నో వరుణగ్ం ర
రాణో వీహి మృడీకగ్ం సుహవోన ఏది స్వాహా ॥
అగ్నీ వరుణా భ్యామిదమ్ ॥

అ॥ హే అగ్నే=ఓఅగ్నిహోత్రుడా ! సః=ఆ ప్రసిద్ధుడవును. అవమః=దేవతలలో ప్రధానుడవునుఅగు, త్వం=నీవు, ఊత=రక్షించుటచే, నః=మాయొక్క, నేదిష్ఠః=సమీపమందుండువాడవు. భవ=అగుము. కదా=ఎప్పుడు, అస్య=ఈ, ఉషసః=ప్రాతఃకాలముయొక్క వ్యుష్టౌ=ప్రారంభముకలుగుచుండగాఅనగాఎప్పుడునుఅనుట, వరుణం=వరుణుని, అవయక్ష్వ=క్రోధములేని వానినిగా ప్రార్థింపుము. త్వం=నీవు, నః=మా కొఱకు, రరాణః=సుఖములనిచ్చుచు, మృడీకం=మాచేనియ్యబడిన హవిస్సును, వీహి=భక్షింపుము. సుహవః=శుభప్రదమైన ఆహ్వానముగలవాడవై, నః=మమ్ములను, ఏధి=వృద్ధి పొందింపుము.

అగ్నీవరుణాభ్యాం=అగ్నిక వరుణునికిని, ఇదమ్=ఇది.

తా॥ ఓ అగ్నిహోత్రుడా ! దేవతలలో నగ్రగణ్యుడవు గాన నీవు మమ్ముల రక్షించుటకొఱకు మా సమీపమందెప్పుడునుండుము. వరుణుని మాయందు కోపములేని వానినిగాఁజేసి మాకు సుఖములనిచ్చుచు మేమిచ్చెడు నాజ్యాది హవిస్సులను భక్షించి మమ్ములవృద్ధి పొందించుచుండుము.

అగ్నికి వరుణునకును ఈ యాహుతిఅర్పితమగుగాక.

మం॥ త్వమగ్నే అయాస్యయా సన్మనసా హితః । అయాసన్

హవ్యమూ హిషేఽయానో ధేహి భేషజగ్గ్ స్వాహా ॥

అయసేఽగ్నయ ఇదమ్ ॥

అ॥ హే అగ్నే=ఓఅగ్నిహోత్రుడా ! త్వం=నీవు. అయాసి= భక్తులకు పొందఁదగినవాడవైతివి. అయాసన్=పొందదగిన వాడవై, మనసా=మనస్సుచేత, హితః=నమస్కరింపఁబడుచున్నావు. అయాసన్=పొందఁదగినవాడవై, హవ్యం=మాచే ఇయ్యఁబడు హవిస్సును, ఊహిషే=దేవతలకొఱకు, వహించుచున్నావు. అయాః=పొందదగిన నీవు, నః=మా కొఱకు, భేషజం=హిత రూపమైన ఔషధమును. ధేహి=కలుగఁజేయుము.

అయసే=పొందదగిన, అన్నయే=అగ్నకి, ఇదమ్=ఇది.

తా. ఓ అగ్నిహోత్రుడా ! నీవు భక్తులకుఁబొందఁదగినవాడవై వారిచే మనస్సునందే ధ్యానింపఁబడుచుంటివు. ఇట్లుభక్తులకుఁ బొందఁదగిన నీవు ఇంద్రాదిదేవతలకు మేమిచ్చెడు హవిస్సును తీసుకొనివెళ్ళి ఇచ్చుచు మాకు శుభములను గలుగఁజేయుము.

పొందఁదగిన అగ్నికి ఈ యాహుతి అర్పితమగుగాక.

సూ. ఇధ్మసన్నహ నాన్యద్భిస్సగ్ం స్ప్రశ్య అగ్నౌ
ప్రహరతి । రుద్రాయ తంతిచరాయేదం నమమ ।
అప ఉపస్ప్రశ్య.

సమిధలకు కట్టిన త్రాడు నీటిలో తడిపి అగ్నిలో హోమము చేయవలెను. రుద్రాయ తంతిచరాయేదం నమమ అని త్యాగము చెప్పవలెను. (రుద్రునకు తంతిచరునకు ఇది నాకుగాదు) నీరు ముట్టుకొని.

సూ. అస్య కర్మణః హోమ ప్రతిష్ఠా సిద్ధ్యర్థం బుద్ధికామః

జయాదిహోమం కరిష్యే ॥

ఈ ఉపనయన కర్మయొక్క హోమప్రతిష్ఠ సిద్ధించుటకై ఐశ్వర్యమును కోరునట్టివాడనై స్రువముతో జయాది హోమమును చేసెదను అని సంకల్పము చేయవలయును.

స్రువేణాజ్యమాదాయ

స్రువముతో నేయి తీసికొనవలెను (తీసికొని)

సూ. ఓం చిత్తం చ స్వాహా ఇత్యాద్యష్ట పంచాశదుప

హోమాన్ హుత్వా ॥

ఓం చిత్తం చ స్వాహా అని మొదలుకొనియున్న ఏబదియెనిమిది ఉపహోమములను హోమము చేయవలయును.

జయాదిహోమములలో చివర ఉన్నవి అనాజ్ఞాతాది హోమములు చేయవలయును.

అనాజ్ఞాతాదులకు ముందుగా సంకల్పము చేయవలెను.

సూ॥ ప్రాణానాయమ్య....శ్రీపరమేశ్వరప్రీత్యర్థం మమ కుమారస్యాయుష్యాభివృద్ధ్యర్థ ముపనయన సిద్ధ్యర్థం యజుర్వేష ప్రాయశ్చిత్తం కరిష్యే। ఓం భువస్స్వాహా వాయవ ఇదం నమమ॥

అ॥ ప్రాణాయామము చేసికొని సంకల్పము చేయవలెను. శ్రీపరమేశ్వరుని ప్రీతికొఱకు, నా కుమారుని ఆయుష్యము వృద్ధిపొందుటకు, ఉపనయనము సిద్ధించుటకున్ను, యజుర్వేష ప్రాయశ్చిత్తమును చేసెదను "ఓం భువస్స్వాహావాయవ ఇదం నమమ" అని స్రువముతో ఒక హోమమును చేయవలెను.

ఈ జయాది హోమములు బ్రహ్మవిసర్జనము వఱకు చేయవలయును.

సూ॥ అనేన ఉపనయన హోమేన భగవాన్ సర్వాత్మకః యజ్ఞేశ్వరః సుప్రీణాతు। సర్వం శ్రీయజ్ఞేశ్వరార్పణమస్తు॥

ఈ ఉపనయన హోమముచేత భగవానుడు సర్వాత్మకుడు అగు యజ్ఞేశ్వరుడు సుప్రీతుడుడగుగాక। సర్వము శ్రీయజ్ఞేశ్వరునకు అర్పణమగుగాక.

సూ॥ అపరేణాగ్ని ముదగగ్రం కూర్చం నిధాయ, తస్మిన్నుత్తరేణ 'రాష్ట్రభృదసీ'తి యజుషోపనేతోప విశతి॥

అగ్నికి పశ్చిమదిక్కున బర్హిస్సును వేసి దాని యందాచార్యుడు 'రాష్ట్రభృత్' అను మంత్రమును చెప్పి ప్రాముఖ్యముగా కూర్చుండవలెను. (కూర్చొనుచున్నాడు)

మం॥ రాష్ట్రభృద స్యాచార్యాసందీ మాత్వద్యోషమ్॥

అ॥ కూర్చమనగా దర్భమయ ఆసనము. హేకూర్చ = ఓకూర్చా! త్వం = నీవు, రాష్ట్రభృత్ = రాజ్యమును ధరించుదానవు, అసి = అయితివి, ఆచార్యాసందీ = ఆచార్యునకాసనమైతివి, త్వత్ = నీకంటె, మా యోషమ్ = వేరుగానుండను.

తా॥ ఓ కూర్చా! నీవు సమస్తమైన రాజ్యమును ధరించుదానవు ఆచార్యులకు ఆసనమైతివిగాన నేను నీమీద కూర్చుండెదను.

కుమారుడు ఆచార్యుని పాదములు పట్టుకొనుట

సూ॥ ఆచార్యః పురస్తాత్ ప్రత్యఙ్ఙాసీనః కుమారో దక్షిణేనపాణినా గురోః దక్షిణం పాదమన్వారభ్యాహ॥ సావిత్రీం భో అనుబ్రూహి ఇతి॥

ఆచార్యుడు ముందుగా ప్రత్యగ్దిశగా కూర్చుండును. కుమారుడు కుడిచేతితో గురువు కుడికాలును పట్టుకొని యిట్లనును - అయ్యా! నాకు గాయత్రినుపదేశింపుడు. అని ప్రార్థింపవలయును.

కేచిదాహుః :-

కొంతమంది చెప్పుదురు.

ఆచార్యాయ వటుః కూర్చందద్యాదగ్ర ముదగ్యథా తథానిధాయ తత్కూర్చే 'రాష్ట్రభృద్యజు షాగురుం. సావిత్రీం భో అనుబ్రూహీతి బ్రూయాత్॥

ఆచార్యునకు వటువు కూర్చముచేయవలెను. ఉత్తరాగ్రమగునట్లు కూర్చమునుంచి 'రాష్ట్రభృ'దను మంత్రముతో గురువు పలుకవలెను. అయ్యా! నాకు సావిత్రి నుపదేశింపుడని కుమారుడనవలెను.

సూ. తస్మా అన్వాహ తత్సవితురితి। పచ్ఛోఽర్ధర్చశ స్తత స్సర్వా వ్యాహృతీర్వ్యాహృతాః పాదాదిష్వంతేషు వాతథార్ధర్చయోరుత్తమాం కృత్స్నాయాం (దద్యాత్) ఉపదేశక్రమః।

ఆకుమారునికి 'తత్సవితుః'అని గాయత్రీ మంత్రమును పలికించి పాదము అర్థము ప్రకారము చెప్పవలయును. పిమ్మట అన్ని వ్యాహృతులు పలుకవలెను. చివర పాదములందు అట్లే ఋక్కులలో చివరదానిని గాయత్రమంత్రీము నివ్వవలెను.

ఉపదేశక్రమము ఇది.

## గాయత్ర్యుపదేశము

సూ. అథ ఆచార్య ఉత్థాయ నమస్సదసే, ఇతి సంపూజ్యసద స్యాన్ ప్రణమ్య గాయత్ర్యుపదేశస్య సుముహూర్తోఽస్త్వితి భవంతో బ్రువంతు, సుముహూర్తోఽస్తు ఇతి సభానుజ్ఞామనుప్రాప్య తస్మా అన్వాహ 'ఓంభూః- తత్సవితుర్వరేణ్య మిత్యాది, కుమారస్య దక్షిణేకర్ణే సముపదిశన్ వాచయత్॥ ఉపదేశక్రమః అయమ్।

తరువాత ఆచార్యుడు లేచి 'సభకు నమస్కారము'అని చెప్పి సద స్యులను పూజించి, నమస్కరించి, 'గాయత్ర్యుపదేశమునకు సుముహూర్తము అవుగాక యని మీరు చెప్పుదురుగాక యనవలెను. సుముహూ

రోఽస్తు 'అని సభయొక్క అనుజ్ఞనుపొంది, ఆ వటుకుమారుని కుడి చెవిలో 'ఓం భూః.... తత్సవితుర్వరేణ్యం మొదలగునవి ఉపదేశించుచు చెప్పించవలెను.

ఉపదేశవిధానము ఇది.

మం॥ ఓం భూః తత్సవితుర్వరేణ్యం।

ఓం భువః భర్గోదేవస్య ధీమహి।

ఓగ్ం సువః ధియోయోనః ప్రచోదయాత్॥

ఓం భూః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి।

ఓం భువః ధియోయోనః ప్రచోదయాత్॥

భూలోక మోంకారరూపమైది. సూర్యభగవానుని అ శ్రేష్ఠమైన భువర్లోక మోంకారరూపమైనది. దేవుని తేజస్సును ధ్యానింతుము. సువర్లోక మోంకారరూపమైనది. ఎవడు మమ్ము ప్రేరేపించెనో, భూలోకమోంకార రూపమైనది. దేవుడైన యా సూర్యభగవానుని శ్రేష్ఠమైన యాతేజస్సును ధ్యానింతుము. భువర్లోక మోంకారరూపమైనది. ఎవడు మాయొక్క బుద్ధులను ప్రేరేపించెనో.

ఓగ్ం సువః తత్సవితుర్వరేణ్యం భర్గోదేవస్య ధీమహి। ధియోయోనః ప్రచోదయాత్॥

సూ. గాయత్ర్యుపదేశముహూర్తస్సుము హూర్తో ఽస్తు।

సువర్లోకమోంకారరూపమైనది. ఎవడు మాయొక్కబుద్ధులను ప్రేరేపించెనో యా దేవుడయిన సూర్యభగవానుని శ్రేష్ఠమైన తేజస్సును ధ్యానింతుము.

గాయత్రీమంత్రమునుపదేశించు ముహూర్తము శుభప్రదము అవు గాక,

అ॥ యః = ఏ సూర్యుడు, నః=మాయొక్క, ధియః=బుద్ధులను ప్రచోదయాత్=ప్రేరేపణము చేయునో, తస్య=అటువంటి, దేవస్య=దేవుడగు. సవితుః=సూర్యునియొక్క, తత్=ఆ ప్రసిద్ధమయినదియు, వరేణ్యం=కోరందగినదియునగు, భర్గః=తేజస్సును, ధీమహి = ధ్యానించుచున్నాము.

సూ. కుమారః 'అవృధ' ఇతి మంత్రేణ స్వముత్తర మోష్ఠం (శ్యావాంతపర్యంతం) ఉపస్పృశ్యాచామేత్॥

అ॥ వటుకుమారుడు 'అవృధ' అను మంత్రమును ఉచ్చరించి ఊర్ధ్వోష్ఠమును (శ్యావాంతము వఱకు) స్పృశించి ఆచమనము చేయవలెను.

మం॥ అవృధమసౌ సౌమ్యప్రాణ స్వమ్మే గోపాయ।

అ॥ అసౌ = ఈనేను, అవృధం=వృద్ధిగలవాడనైతిని. సౌమ్య = శరీరమధ్యమందుండెడి మా! మే =నాయొక్క, స్వం=గాయత్రీరూపమైన ధనమును, గోపాయ=రక్షింపుము.

తా॥ గాయత్ర్యుపదేశముచే నేను శ్రీమంతుడనైతిని. ఓ ప్రాణమా నా హృదయమందుండెడు గాయత్రీరూపమైన ధనమును గాపాడుచుండుము.

సూ. బ్రహ్మణి ఆణీ ఇతి కర్ణౌ యుగపత్కరాభ్యాముపస్పృశ్యాచామేత్॥

అ॥ "బ్రహ్మణి ఆణీ" అను మంత్రముతో ఒక్కసారిగా రెండు చెవులను రెండు చేతులతో స్పృశించి ఆచమనము చేయవలయును.

మం॥ బ్రహ్మణ ఆణీస్థః॥

అ॥ బ్రహ్మణః=గాయత్రీరూపమైన మంత్రముయొక్క, ఆణీ= వినెడు స్థానములైన శ్రోత్రములారా! స్థః=ఉండుడు.

తా॥ ఓ శ్రోత్రములారా! మీరు గాయత్రీరూపమైన మంత్రమును వినెడు స్థానములై యుండుడు.

సూ. సుశ్రవ ఇతి పాలాశం దండం దక్షిణేన
హస్తే నాదత్తే॥

అ॥ సుశ్రవ అను మంత్రమును వటువుచే చెప్పించి వటువు కుడి చేతితో పాలాశదండమును తీసికొనునట్లు చేయవలెను.

ఓం భూః = ....శుభతిథౌ ఆచార్యవటోః ఆయుర్వర్చోయశోబలాభివృద్ధ్యర్థం గోసర్పభయనివృత్త్యర్థం పాలాశదండధారణం కరిష్యే॥

తా॥ 'ఓం భూః' మొదలుకొని శుభతిథౌ వఱకుచెప్పించి ఆచార్యునకు వటువునకును ఆయుష్యము, వర్చస్సు, యశస్సు, బలము, అభివృద్ధిపొందుట కొఱకును, గోవులవలనను సర్పములవలనను భయము తొలగుటకొఱకును పాలాశదండమును ధరించెదను అని చెప్పవలయును.

(చెప్పించవలెను.)

(పాలాశదండమనగా మోదుగుకఱ్ఱ)

మం॥ సుశ్రవ సుశ్రవసం మా కురు యథా త్వగ్ం
సుశ్రవ స్సుశ్రవా అస్యేవ మహగ్ం సుశ్రవస్సుశ్రవా
భూయాసం యథా త్వగ్ం సుశ్రవస్సుశ్రవో దే
వానాం నిధిగోపోఽస్యేవ మహం బ్రాహ్మణానాం
బ్రహ్మణో నిధిగోపో భూయాసమ్॥

అ॥ సుశ్రవః = ఓపాలాశదండమా! మా = నన్ను, సుశ్రవసం = చక్కగా వినువానినిగా, కురు = చేయుమా, సుశ్రవః = ఓపాలాశదండమా, యథా = ఏప్రకారముగాను, త్వం = నీవు, సుశ్రవాః = చక్కగా వినుదానవు,

అసి = అయితివో. సుశ్రవః = ఓపాలాశదండమా! ఏవం = ఈ ప్రకారముగా, అహం = నేను, సుశ్రవాః = చక్కగా వినువాడనై, భూయాసమ్ = అగుదును. సుశ్రవః = ఓ పాలాశదండమా ! త్వం = నీవు, యథా = ఏ ప్రకారముగా, దేవానాం = దేవతల యొక్క, నిధిగోపః = యజ్ఞమును పాలించుదానవు, అసి = అయితివో, ఏవం = ఈ ప్రకారముగా, అహం = నేను, బ్రాహ్మణానాం = బ్రాహ్మణులలో, నిధిః = నిధియైన, బ్రహ్మణః = వేదముయొక్క, గోపః = పాలకుడను, భూయాసమ్ = అగుదును.

తా॥ ఓ పాలాశదండమా ! నీ వే ప్రకారముగా చక్కగా వినుదానవయితివో ఆ ప్రకారముగానే నన్ను జక్కగా వినువానినిగాఁజేయుము. నీవెటుల దేవతల సంబంధమైన యజ్ఞములకు సాధనమై పాలించుచుంటివో నిన్ను ధరించుటచే అటులనే నేను బ్రాహ్మణులయొక్క శ్రేష్ఠమైన వేదాభ్యాసము చేసి వేదమును నిలుపువాడ నయ్యేదను.

సూ. సుశ్రవఇతి మంత్రం కుమారేణ వాచయేత్ ॥

అ॥ సుశ్రవ అనుమంత్రమును కుమారునిచే చదివించవలెను.

సూ. తతఃస్మృతం చమ ఇత్యేవం వటుం వాచయతి ॥

పిమ్మట "స్మృతంచమే"ఇత్యాదిమంత్రములను వటువుచే చెప్పించవలయును.

మం॥ స్మృతం చ మేఽస్మృతం చమే

తన్మ ఉభయం వ్రతమ్ ॥

అ॥ మే = నాకు, స్మృతంచ = మంచి విషయములనాలోచించుటయు, మే = నాకు, అస్మృతం చ = పనికిరానివిషయము ఆలోచింపకుండుటయు, తత్ = ఆ, ఉభయం = రెండును, మే = నాకు, వ్రతమ్ = వ్రతములు అనగా ఆచరింపదగినవి.

తా॥ సత్కార్యముల విషయమై ఆలోచించుటయు, అసత్కార్యముల విషయమై ఆలోచింపకుండుటయు రెండును నేను గ్రహింపఁదగినవి.

మం॥ నిందాచ మేఽనిందాచ మే తన్మ
ఉభయం వ్రతమ్ ॥

అ॥ నిందాచ=అయోగ్యకార్యముల గురించినిందించుటయు, అనిందాచ=దేవతాదులు గురించి నిందించక పోవుటయు, తత్=ఆ, ఉభయం=రెండును, మే=నాకు, వ్రతమ్=వ్రతములు అనగా ఆచరింపఁదగినవి.

తా॥ అయోగ్య కార్యములగురించి నిందించుటయు, దేవతాదుల గురించి నిందచేయకపోవుటయు రెండును నాకు వ్రతములే.

మం॥ శ్రద్ధా చమేఽశ్రద్ధా చమే తన్మ
ఉభయం వ్రతమ్ ॥

అ॥ శ్రద్ధా=చేయదగినపనులవిషయమై ఆసక్తియు, అశ్రద్ధా=చేయఁగూడని పనుల విషయమై ఆసక్తి లేకుండుటయు, తత్=ఆ, ఉభయం=రెండును, మే=నాకు, వ్రతమ్=వ్రతములు అనగా ఆచరింపఁదగినవి.

తా॥ మంచిపనుల విషయమైఆసక్తియు, కూడనిపనుల విషయమై ఆసక్తిలేకుండుటయు రెండును నాకు వ్రతములే.

మం॥ విద్యా చమేఽవిద్యాచ మే తన్మ
ఉభయం వ్రతమ్ ॥

అ॥ విద్యాచ=జ్ఞానమును దెలిసికొనుటయు, అవిద్యాచ=అనృత జడాత్మకమగుదానిని దెలిసికొనలేక పోవుటయు, తత్=ఆ, ఉభయం= రెండును, మే=నాకు, వ్రతమ్=వ్రతము అనగా ఆచరింపఁదగినవి.

తా॥ సచ్చిదానందాత్మకమగు వస్తువును దెలిసికొనుటయు, తదితర మైనదానిని తెలిసికొనకుండుటయు రెండును నాకు వ్రతములై యున్నవి.

శ్రుతం చమేఽశ్రుతం చ మే తన్మ
ఉభయం వ్రతమ్ ॥

అ॥ శ్రుతంచ=వేదశాస్త్రములను వినుటయు, అశ్రుతం చ= పాషండాగమములను వినకుండుటయు, తత్=ఆ, ఉభయం=రెండును, మే=నాకు. వ్రతమ్=వ్రతములు అనగా ఆచరింపఁదగినవి.

తా॥ వేదశాస్త్రములను వినుటయు, వేదబాహ్యములైన పాషండాగ మములను వినకుండుటయు నివి రెండును నాకు వ్రతములు.

మం॥ సత్యం చమేఽనృతం చమే తన్మ
ఉభయం వ్రతమ్ ॥

అ॥ సత్యం=యథార్థమును బల్కుట, అనృతం చ=అసత్యమును పల్కకుండుట, తత్ = ఆ, ఉభయం=రెండును, మే = నాకు, వ్రతమ్= వ్రతములు అనగా ఆచరింపఁదగినవి.

తా॥ యథార్థమునుబల్కుటయు, తనయొక్కగాని యితరులయొక్క గాని ప్రాణములకు భంగము కలిగెడువేళల నబద్ధమాడుటయునివి రెండును నాకు వ్రతములు.

మం॥ తపశ్చ మేఽతపశ్చ మే తన్మ
ఉభయం వ్రతమ్ ॥

అ॥ తపః చ=తపస్సును చేయుట, అతపశ్చ=తపస్సును చేయక పోవుట. తత్=ఆ, ఉభయం=రెండును, మే=నాకు, వ్రతమ్=వ్రతములు.

తా॥ తపస్సును జేయుటయు, శక్తిలేని సమయమున తపస్సును జేయకుండుటయు నివి రెండును నాకు వ్రతములు.

మం॥ వ్రతం చ మేఽవ్రతం చ మే తన్మ
ఉభయం వ్రతమ్ ॥

అ॥ వ్రతం చ=అధ్యయనము చేయుట, అవ్రతం చ=అధ్యయనము చేయకుండుట, తత్=ఆ, ఉభయం=రెండును, మే=నాకు, వ్రతమ్=వ్రతములు.

తా॥ అధ్యయనము చేయుటయు, ఏదైన ఒకఆపత్తుతటస్థించినపుడు అధ్యయనము చేయకపోవుటయు నివి రెండును నాకు వ్రతములు.

మం॥ యద్బ్రాహ్మణానాం బ్రహ్మణి వ్రతం । యదగ్నే
స్సేంద్రస్య సప్రజాపతికస్య సదేవస్య సదేవరాజ
స్య సమనుష్యస్య సమనుష్యరాజస్య సపితృకస్య
సపితృరాజస్య సగంధర్వాప్సరస్కస్య యన్మ ఆత్మ

స ఆత్మని వ్రతం । తేనాహగ్ం సర్వవ్రతో భూ
యాసమ్ ॥

అ. బ్రాహ్మణానాం=బ్రాహ్మణులకు, బ్రహ్మణి=వేద విషయమైన, యత్=ఏ, వ్రతం=వ్రతము కలదో, సేంద్రస్య=ఇంద్రునితో గూడినట్టియు, సప్రజాపతికస్య=బ్రహ్మతోగూడినట్టియు, సదేవస్య=దేవతలతో గూడినట్టియు, సదేవరాజస్య=దేవేంద్రునితో గూడినట్టియు, సమనుష్యస్య=మనుష్యునితో గూడినట్టియు, సమనుష్యరాజస్య=మనుష్యులప్రభువుతోగూడినట్టియు. సపితృకస్య=పితృదేవతలతోగూడినట్టియు, సపితృరాజస్య=యమునితో గూడినట్టియు, సగంధర్వాప్సరస్కస్య=గంధర్వులతోను అప్సరసలతోను గూడినట్టియు, అగ్నేః=అగ్నిహోత్రుని యొక్క, యత్=ఏ, వ్రతం=వ్రతముగలదో, మే=నాయొక్క, ఆత్మనః=జీవునకు. ఆత్మని=పరమాత్మవిషయమై, యత్=ఏ, వ్రతం=వ్రతముకలదో, తేన=ఆపైన చెప్పబడిన వ్రతములతో గూడినవాడనై, అహం=నేను, సర్వవ్రతః=అన్నివ్రతములు చేసినవాడను, భూయాసమ్=అగుదును.

తా. వేదమునుగుఱించిన బ్రాహ్మణులయొక్క వ్రతమును, శ్రేష్ఠత్వమును సృజించుట, దాతృత్వము, దేవతలను రంజింపఁజేయుట, మంచి వాక్యములు పల్కుట, ప్రజలను రక్షించుట, సంతానము కల్గునట్లుచేయుట, ఓర్పుగా నుండుట, దేవతలను స్తోత్రము చేయుట, శుశ్రూషయందు నేర్పుగలుగుట ఈ మొదలగు గుణములు పొందుటకు ఇంద్రుడు మొదలయిన సమస్తమయిన దేవతలతో సక్రమముగా గూడిన అగ్నిహోత్రుని యొక్క వ్రతమును పరమాత్మ విషయమై నా జీవునియొక్క వ్రతమును జేసినవాడనై యన్ని వ్రతములఁ జేసినవాడనగుదును.

## గోదానమ్

సూ. గురోవరం తే దదామితి గురవే వటుర్వరం దద్యాత్ ॥

గౌర్వైవర ఇతి శ్రుతేః ।

## గోదానము

ఓ ఆచార్యుడా ! నీకు వరమును ఇచ్చుచున్నాను అని గురువునకు వటువు వరమైన గోవునీయవలెను.

సూ. గురుస్సప్తదశ కృత్వోఽపాన్య ॥

వరమనగా గోవని వేదమున గలదు. గురువు 17 సార్లు ప్రాణాయామము చేయవలెను. (చేసి)

"దేవస్య త్వా" ఇతి గాం ప్రతిగృహ్ణాతి ॥

ఆచార్యుడు "దేవస్యత్వా" అను మంత్రము చదివి గోవును ప్రతిగ్రహించును.

రుద్రాయ గామితి మంత్ర సన్నామః ॥

"రుద్రాయ గామ్" అని మంత్ర సన్నామము.

మం. దేవస్య త్వా సవితుః ప్రసవే । అశ్వినోర్బాహుభ్యామ్ ।
పూష్ణో హస్తాభ్యాం ప్రతిగృహ్ణామి । రాజా త్వా వరుణో
నయతు దేవి దక్షిణే రుద్రాయ గామ్ । తేనామృత
త్వమశ్యామ్ । వయో దాత్రే । మయో మహ్యం

మస్తు ప్రతిగ్రహీత్రే । క ఇదం కస్మా అధాత్

కామః కామాయ । కామో దాతా ! కామః ప్రతి

గ్రహీతా । కామగ్ం సముద్రమావిశ । కామేన త్వా

ప్రతిగృహ్ణామి । కామైతత్తే । ఏషాతే కామ దక్షిణా ।

ఉత్తాన స్త్వాంగిరసః ప్రతిగృహ్ణాతు, ఇతి॥

అ॥ హేప్రతిగృహ్యమాణ ద్రవ్య ! ! = ప్రతిగ్రహింపబడే ఓ ద్రవ్యమా ! సవితుః దేవస్య = సూర్యదేవునియొక్క. ప్రసవే = ప్రేరణము జరుగగా, అశ్వినోః = అశ్వినీదేవతల సంబంధమైన, బాహుభ్యాం = బాహువులతోను, పూష్ణః = పూష(సూర్య)సంబంధమగు, హస్తాభ్యాం = హస్తములతోను, త్వా = నిన్ను, ప్రతిగృహ్ణామి = స్వీకరించుచున్నాను, హేదక్షిణే దేవి ! = ఓ దక్షిణాదేవీ ! వరుణః రాజా = రాజగు వరుణుడు, గాం = గోరూపమైన, త్వా = నిన్ను, రుద్రాయ = రుద్రుని కొఱకు, నయతు = పొందించుగాక, తేన = ఆరుద్రుని పొందించుటచేత. అనగా ప్రతిగ్రహ దోషము లేకపోవుట వలన, అహం = నేను, అమృతత్వం = నరకాభావమను దానిని. అశ్యామ్ = పొందుదును. ఇయంచదక్షిణా = ఈదక్షిణాదేవి, దాత్రే = దాతకు, వయః అస్తు = పక్షిరూపిణియయి దాతను స్వర్గమును చేర్చుగాక యని యర్థము, ప్రతిగ్రహీత్రే = పరిగ్రహించునట్టి, మహ్యం = నాకు, మయః అస్తు = సుఖమగుగాక. ఇదం – ఈ ద్రవ్యము, కః = ఏ ప్రజాపతి, కస్మై = ఏ ప్రజాపతికి, అదాత్ = ఇచ్చెను ? అంతర్యామి రూపముగా దాత ప్రతిగ్రహీతలకు ప్రేరకుడగుట వలన, తథా = అదే విధముగా, కామః = కాముడు, కామాయ = కాముని కొఱకు, దత్తవాన్ =

ఇచ్చెను, ఎట్లు ప్రజాపతి అదృష్టప్రేరకుడో, అటులనే కాముడు దృష్ట ప్రేరకుడు గనుక అందువలన, కామ ఏవ = కాముడే, దాతా = దాత; కామ ఏవ = కాముడే, ప్రతిగ్రహీతాచ=ప్రతిగ్రహీత కూడను. తతః = అందువలన, హే దక్షిణే ! = ఓ దక్షిణాదేవీ ! సముద్రసమం = సముద్రమువంటి, కామం = కాముని, ప్రవిశ = ప్రవేశింపుము, స్వర్గాది ఫల విషయము కదా కామము (కాముడు) దాత; ఐహిక సుఖ విషయమగు కామము (కాముడు) ప్రతిగ్రహీత, కామేన = కామమనే (కాముడనే) నిమిత్తముచేత, త్వా = నిన్ను, ప్రతిగృహ్ణామి = ప్రతి గ్రహించెదను. హేకామ ! = నాహృదయములో నుండెడు ఓ కామమా ! తత్ ఏతత్ = ఆ యీ ద్రవ్యము, తే = నీ కొఱకు, భవతి = అగుచున్నది. హే కామ = ఓ కాముడా ! తే = నీప్రీతి కొఱకు, ఏషా = ఇది, దక్షిణా= దక్షిణగా అయినది. ఆంగీరసః = అంగిరో గోత్రములో పుట్టిన, ఉత్తానః= ఉత్తాను డను మహర్షి, త్వా = నిన్ను, ప్రతిగృహ్ణాతు = ప్రతిగ్రహించు గాక.

సూ. అథాచార్యః ప్రత్యఙ్ముఖమాసీనం కుమారం 'ఉదాయుషా' ఇత్యనేన మంత్రేణోత్థాప్యవాచయతి॥

అ॥ పిమ్మట ఆచార్యుడు పడమట దిక్కుగా కూర్చున్న వటు కుమారుని 'ఉదాయుషా' అను మంత్రము చదువుచు లేవదీసి వానిచే చెప్పించవలెను.

మం॥ ఉదాయుషా స్వాయుషో దోషధీనాగ్ం రసేనో

త్పర్జన్యస్య శుష్మేణోదస్థా మమృతాగ్ం అను॥

అ॥ అహం=నేను, అమృతాన్=దేవతలను, అను = అనుసరించి ధ్యానించుటకు, స్వాయుషా=స్వకీయమయిన నూఱు సంవత్సరముల

పరిమితిగల, ఉదాయుషా = ఆయుర్దాయముతోడను, ఉదోషధీనాం = ఓషధుల యొక్క, రసేన = బలకరమైన రసముతోడను, పర్జన్యస్య = మేఘుని యొక్క, ఉచ్ఛుష్మేణ = బలముతోడను, ఉదస్థామ్ = లేచుచున్నాను.

తా॥ నూఱు సంవత్సరములు పరిమితిగల నాయాయుర్దాయము తోడను బలహేతువులగు ఓషధులరసము మేఘుని జలము వీనితోడను గూడిన వాడనై దేవతలను ధ్యానము చేయుటకు లేచి నిలుచుండెదను.

సూర్యదర్శనమ్

సూ. తచ్చక్షురితి సూర్యం దృశే ఇత్యంతం ఆచార్యవాచితైర్దశ భిర్మం త్రైర్వటు రాదిత్యము పతిష్ఠతే। (ఉపస్థాయ)

సూర్యుని దర్శించుట

'తచ్చక్షుః' అను మంత్రము మొదలుకొని 'సూర్యందృశే' అను మంత్రము వఱకు ఆచార్యునిచే చెప్పబడిన పది మంత్రములతోను వటువు సూర్యుని సేవించవలెను. (సేవించి)

మం॥ తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్రముచ్చరత్॥

అ॥ చక్షుః = నేత్రములయందు, దేవహితం = ఇంద్రునిచే ఉంచ బడినదియు, పురస్తాత్ = తూర్పుదిక్కున. ఉచ్చరత్ = బయలుదేరివెళ్ళు చున్నదియు, శుక్రం = శుభ్రమైనదియునగు, తత్ = ఆప్రసిద్ధమైన సూర్యతేజస్సును.

మం॥ పశ్యేమ శరదశ్శతమ్॥

అ॥ శతం = నూరైన, శరదః = సంవత్సరములు, పశ్యేమ = చూచెదము.

తా॥ నేత్రములయందు దేవేంద్రునిచే నుంచఁబడినదియు, తూర్పు దిక్కున నుదయించుచున్నదియు, పరిశుద్ధమును అయిన సూర్యతేజస్సును నూఱు సంవత్సరముల పర్యంతము చూచుచుందుము,

మం॥ జీవేమ శరదశ్శతమ్॥

అ॥ శతం=నూఱైన, శరదః=సంవత్సరములు, జీవేమ=బ్రతుకుదుము.

తా॥ సూర్యుని జూచుటచే నూఱు సంవత్సరములు జీవింపగలము.

మం॥ నందామ శరదశ్శతమ్॥

అ॥ శతం=నూఱు, శరదః=సంవత్సరములు నందామ=ఆనందింపగలము.

తా॥ నూఱు సంవత్సరముల పర్యంతము ఆనందించుచు ఉండగలము,

మం॥ మోదామ శరదశ్శతమ్॥

అ॥ శతం = నూఱైన, శరదః = సంవత్సరములు మోదామ = బ్రహ్మానందమును పొందెదము.

తా॥ నూఱు సం॥రముల పర్యంతము బ్రహ్మానందమును పొందుచుందుము.

మం॥ భవామ శరదశ్శతమ్॥

అ॥ శతం = నూఱయిన, శరదః = సం॥రములు భవామ = సంపత్తుగల వారమై యుందుము.

తా॥ నూఱు సం॥రముల పర్యంతము సంపదగల వారమై యుందుము

మం॥ శృణు వామ శరదశ్శతమ్॥

అ॥ శతం = నూరైన. శరదః = సం॥రము, శృణవామ = వేద శాస్త్రములను వినుచుందుము.

తా॥ నూఱు సం॥రముల పర్యంతము వేదశాస్త్రములను వినుచుందుము.

మం॥ ప్రబ్రవామ శరదశ్శతమ్॥

అ॥ శతం శరదః = నూఱు సం॥రముల పర్యంతము ప్రబ్రవామ = చక్కగా మాట్లాడువారము కాగలము,

తా॥ నూఱు సం॥రముల పర్యంతము చక్కగా మాట్లాడుచుండగలము.

మం॥ అజీతా స్స్యామ శరద శ్శతమ్॥

అ॥ శతం = నూరైన, శరదః = సం॥రములు, అజీతాః = హింసింపఁబడని వారమై, స్యామ = అయ్యెదము.

తా॥ నూఱు సం॥లముల పర్యంతము హింసలేనివారమై యుండగలము.

మం॥ జ్యోక్చ సూర్యం దృశే॥

అ॥ జ్యోక్ = చాలకాలము, సూర్యం = సూర్యుని, దృశే = చూచుటకొఱకు, సమర్థాః = సమర్థుల మయ్యెదము,

తా॥ జీవించియున్నంతకాలము, అంధత్వము లేక మంచి దృష్టి గలవారమై యుందుము.

సూ॥ యం కామయేత నాయా మచ్ఛిద్యేతేతి తముత్తరయా దక్షిణే హస్తే గృహ్ణీయాత్॥ అథకామ్య విధిమాహ॥

అ॥ స్నాతకవ్రత పర్యంతమునీవటుడు నన్నువిడువకుండ యుండవలెనని యాచార్యుడు కోరినచో క్రిందవగు 'యస్మిన్ భూతంచ' అను మంత్రమును చెప్పి ఆతని కుడిచేతితో వటుని కుడిచేయి పట్టుకొనవలెను.

మం॥ యస్మిన్ భూతంచ భవ్యంచ సర్వే లోకాస్సమా హితాః॥

తేన గృహ్ణామి త్వా మహం మహ్యం గృహ్ణామి త్వామహం

ప్రజాపతినా త్వా మహ్యం గృహ్ణామి యజ్ఞశర్మన్॥

అ॥ యస్మిన్ = ఏ బ్రహ్మయందు, భూతంచ = గడచినవియు భవ్యంచ = జరుగబోవుననియు, వర్తమానం = జరుగుచున్నవియునగు, సర్వే = సమస్తమైన, లోకాః = లోకములు, సమాశ్రితాః = నిలిచియున్నవో, తేన = ఆ బ్రహ్మయొక్క ఆజ్ఞచే, అహం = నేను, త్వాం = నిన్ను, గృహ్ణామి = గ్రహించుచున్నాను, అసౌ అథవా యజ్ఞశర్మన్ = ఈ ఉపనయన వటువా లేదా యజ్ఞశర్మా ! త్వా = నిన్ను, మహ్యం = నాకొఱకు, ప్రజాపతినా = బ్రహ్మదేవునిచేత, గృహ్ణామి = గ్రహించుచున్నాను.

తా॥ జరిగినదియు జరుగుచున్నదియు జరుగబోవునదియు నగు ప్రపంచమునకు సృష్టికర్తయగు నే బ్రహ్మయందు సమస్తలోకములు నిలిచియున్నవో ఆ బ్రహ్మయొక్క అనుమతిచే నిన్ను నా మనసునం దెప్పుడును ధ్యానము చేయుచుండెదను,

సూ॥ కుమారః త్ర్యహమేత మగ్నిం ధారయతి । క్షారలవణ వర్జనంచ॥

అ॥ కుమారుడు మూడహోరాత్రములు ఈయగ్ని నవిచ్ఛిన్నముగా నిలిపుకొనవలెను. కారము, ఉప్పు ఈ మూడురోజులు విడువవలెను.

సూ॥ అస్మిన్నే వాగ్నౌ సాయం ప్రాత స్సమిధ ఆదధ్యాత్। త్ర్యహాదూర్ధ్వ మాసమావర్తనాత్యాయం ప్రాతర్లౌకికాగ్నౌ సమిదాఽఽధానమ్ । సాయమేవేత్యేకే॥

అ॥ ఈ యగ్నిలోనే సాయంకాలమందును ప్రాతఃకాలమందును సమిధలను ఉంచవలెను అనగా హోమము చేయవలెను, మూడురోజులు దాటిన తరువాతనుండి సమావర్తనము వఱకు సాయంకాలమునను ప్రాతఃకాలమునను లౌకికాగ్నిలో సమిధలను హోమము చేయవలెను. సాయంకాలమందే అని కొందఱు చెప్పిరి.

శ్లో॥ అగ్నికార్యం వటుః కుర్యాత్ సంధ్యయోరుభయోరపి ।
సాయమేవేత్యేకే ।

పై విధివాక్య శ్లోకార్థమువలన "సాయమేవేత్యేకే" అవి నిధి వాక్యము పేక్షణీయమైనది. ఏకే పక్షమాచారములోలేదు.

అగ్నికార్యమ్ అగ్నికార్యము

సూ॥ పరిత్వేతి పరిమృజ్య॥

అ॥ 'పరిత్వాగ్నే' అను మంత్రము చెప్పి అగ్నికీశాన్య భాగము నుండి ప్రదక్షిణముగ అలకవలెను.

సూ॥ వటురాచమ్య = వటువు ఆచమనము చేసి సంకల్పము చెప్పుకొనవలెను.

ఏవం గుణ....శుభతిథౌ శోభనే ముహూర్తే శ్రీమాన్. గోత్రః.... నామధేయోఽహం శ్రీపరమేశ్వర ప్రీత్యర్థం ఆయుర్వర్చో యశోబలాభి వృద్ధ్యర్థం ప్రాతరగ్నికార్యం కరిష్యే॥

**అ॥ ఇట్లు** సంకల్పము చెప్పుకొని ఇటువంటి గుణములు గల శుభ తిథియందు శోభన ముహూర్తమందు శ్రీమాన్ గోత్రము నామధేయము చెప్పుకొని నేను శ్రీపరమేశ్వరప్రీతి కొఱకు ఆయుష్యము, వర్చస్సు, యశస్సు బలమును అభివృద్ధి పొందుటకు ప్రాతఃకాలమున చేయవలసిన అగ్నికార్యమును చేసెదను అని సంకల్పము చెప్పుకొనవలెను.

మం॥ పరిత్వాఽగ్నే పరిమృజా మ్యాయుషాచ ధనేన చ ।
సుప్రజాః ప్రజయా భూయాసగ్ం సువీరో వీరై
స్సువర్చా వర్చసా సుపోషః పోషై స్సుగృహో
గృహై స్సుపతిః పత్యా సుమేధా మేధయా సు
బ్రహ్మ బ్రహ్మచారిభిః॥

అ॥ హే అగ్నే = ఓ అగ్నిహోత్రుడా; అహం = నేను, త్వా = నిన్ను, ఆయుషాచ = ఆయుర్దాయముచేతను, ధనేనచ = ధనముచేతను పరిమృజామి = అంతటను శోధించుచున్నాను: అహం = నేను, ప్రజయా = సంతానముచేత, సుప్రజాః = మంచి సంతానముగలవాడనై, వీరైః = తన యులచేత, సువీరః = మంచి పుత్రులుగలవాడనై, వర్చసా = కాంతిచేత,

సువర్చాః = మంచికాంతిగలవాడనై, పోషైః = వృద్ధులచేత, సుపోషః = మంచి వృద్ధిగలవాడనై గృహైః = గృహములచేత, సుగృహః = మంచి గృహముగలవాడనై, పత్యా = రక్షించు ఆచార్యునిచేత, సుపతిః = మంచి పరిపాలకుడుగలవాడనై. మేధయా = జ్ఞాపకశక్తిగల బుద్ధిచేత, సుమేధాః = మంచి బుద్ధిగలవాడనై, బ్రహ్మచారిభిః = సహపాఠకులైన బ్రహ్మచారుల తోడ, సుబ్రహ్మ = మంచి వేదపఠనముగలవాడనై, భూయాసమ్ = అగుదును.

తా॥ ఓ అగ్నిహోత్రుడా! ఆయుర్దాయమును, ధనమును ప్రార్థించి నీవలన పుచ్చుకొనుటచే నీ భక్తవాత్సల్యమును పరీక్షించినవాడనైతిని. నేను మంచి సంతానముకలవాడను, మంచి పుత్రులు కలవాడను, మంచి కాంతికలవాడను, మంచి వృద్ధికలవాడను, మంచిగృహములు కలవాడను, మంచి యాచార్యుడు కలవాడను, మంచి జ్ఞాపకశక్తికల బుద్ధిగలవాడను, మంచి వేదపాఠముగలవాడను నీ యను గ్రహముచే నయ్యెదను.

(ఈ అగ్నికార్యమునకు సంకల్పముచేసిన పిమ్మట అగ్నికి అష్ట దిక్కులందు అరిసెలు, చక్కిలాలు శక్తికొలది సమర్పించవలెను. ఇది లోకాచారముగా సర్వత్ర జరుగుచున్నది)

సూ॥ పరిమృజ్య అలంకృత్య అధ సమిధ మాదాయ
తస్మిన్నుత్తరై స్సమిధ ఆ దధ్యాత్॥

తుడిచి అక్షతలతో అలంకరించవలెను. పిమ్మట చెప్పబోవు 12 మంత్రములచేతను మంత్రమున కొకసమిధ చొప్పున 12 హోమములు చేయవలయును.

మం॥ అదితేఽను మన్యస్వ । అనుమతేఽను మన్యస్వ ।
సరస్వతేను మన్యస్వ । దేవ సవితః ప్రసువ॥

అ॥ హేఅదితే = దేవతలకు తల్లివైన ఓ అదితిదేవీ ! అనుమన్యస్వ=నాచేత చేయబడుచున్న కర్మను అంగీకరింపుము; హే అనుమతే=ఓ పౌర్ణమాసీదేవతా ! అనుమన్యస్వ = అంగీకరింపుము: హే సరస్వతే ! ఓ సరస్వతీదేవీ ! అనుమన్యస్వ= అంగీకరింపుము: హేసవితః= ప్రేరకుడవగు, దేవ=ఓ పరమేశ్వరుడా ! ప్రసువ = ప్రేరణచేయుము. హే అదితే=అఖండుడవగు ఓ పరమాత్మా ! హే అనుమ ! = సమస్తమును దెలిసిన పరమాత్మా ! హే సరస్వతే ! = సర్వవ్యాపకుడవగు పరమాత్మా ! సవితః = సృష్టికర్తవయిన, హే దేవ ! = ఓ పరమాత్మా, నాచేత చేయిఖడుచున్న కర్మలను అంగీకరింపుము.

తా॥ ఓ అదితిదేవరా, ఓ పౌర్ణిమాసీదేవతా, ఓ సరస్వతీదేవీ, ఓ పరమేశ్వరా, ఓ పరమాత్మా, నేను చేయు ఈ కర్మలను అంగీకరింపుము.

ఈ మంత్రమును హోమమునకు ఆదిని చదువవలెను.

ఇతి పూర్వపరిషేచనమ్ । అని పూర్వపరిషేచనము.

అదితే ఽను మన్యస్వ ఇతి దక్షిణతః ప్రాచీనమ్ ।
ఇతి దక్షితః ప్రాచీనమ్ । అనుమతేను మన్యస్వ
ఇతి పశ్చాదు దీచీనమ్ । సరస్వతేఽను మన్యస్వ
ఇత్యుత్తరతః ప్రాచీనమ్ । దేవ సవితః ప్రసువ
ఇతి సమంతమ్॥

అదితేఽను మన్యస్వ అని దక్షిణమునుండి తూర్పునకు
అనుమతేఽను మన్యస్వ అని పశ్చిమమునుండి ఉత్తరమునకు,
సరస్వతేఽను మన్యస్వ అని ఉత్తరమునుండి తూర్పునకు

దేవసవితః ప్రసువ అని అన్ని దిక్కులకు అని హోమాదిలో చదువవలెను.

అ॥ హే అదితే = దేవతలకు తల్లివైన ఓ అదితిదేవీ ! అనుమన్యస్వ = నాచేత చేయబడుచున్న కర్మను అంగీకరింపుము; హే అనుమతే = ఓ పౌర్ణమాసీదేవతా ! అనుమన్యస్వ = అంగీకరింపుము: హే సరస్వతే ! ఓ సరస్వతీదేవీ ! అనుమన్యస్వ = అంగీకరింపుము: హే సవితః = ప్రేరకుడవగు, దేవ = ఓ పరమేశ్వరుడా ! ప్రసువ = ప్రేరణచేయుము. హే అదితే = అఖండుడవగు ఓ పరమాత్మా ! హే అనుమ ! = సమస్తమును దెలిసిన పరమాత్మా ! హే సరస్వతే ! = సర్వవ్యాపకుడవగు పరమాత్మా ! సవితః = సృష్టికర్తవయిన, హే దేవ ! = ఓ పరమాత్మా, నాచేత చేయిఖడుచున్న కర్మలను అంగీకరింపుము.

తా॥ ఓ అదితిదేవరా, ఓ పౌర్ణిమాసీదేవతా, ఓ సరస్వతీదేవీ, ఓ పరమేశ్వరా, ఓ పరమాత్మా, నేను చేయు ఈ కర్మలను అంగీకరింపుము.

ఈ మంత్రమును హోమమునకు ఆదిని చదువవలెను.

ఇతి పూర్వపరిషేచనమ్ । అని పూర్వపరిషేచనము.

అదితే ఽను మన్యస్వ ఇతి దక్షిణతః ప్రాచీనమ్ ।
ఇతి దక్షితః ప్రాచీనమ్ । అనుమతేను మన్యస్వ
ఇతి పశ్చాదు దీచీనమ్ । సరస్వతేఽను మన్యస్వ
ఇత్యుత్తరతః ప్రాచీనమ్ । దేవ సవితః ప్రసువ
ఇతి సమంతమ్॥

అదితేఽను మన్యస్వ అని దక్షిణమునుండి తూర్పునకు
అనుమతేఽను మన్యస్వ అని పశ్చిమమునుండి ఉత్తరమునకు,
సరస్వతేఽను మన్యస్వ అని ఉత్తరమునుండి తూర్పునకు

దేవసవితః ప్రసువ అని అన్ని దిక్కులకు అని హోమాదిలో చదువవలెను.

తినుటచేతను, సమేధయ=వృద్ధినొందింపుము, అగ్నయే = అగ్నికొఱకు, ఇదమ్ = ఇది.

తా॥ ఓ యగ్నిహోత్రుడా ! గొప్పవాడవు ప్రజ్ఞగలవాడవు నగు నీకొఱకు సమిధను తెచ్చితిని, ఓ అగ్నిహోత్రుడా ఈ సమిత్తుచే నీవెట్లు ప్రకాశించెదవో ఆప్రకారము నన్ను ఆయుస్సుచేతను వర్చస్సుచేతను లాభము చేతనుజ్ఞాపకశక్తి గల బుద్ధిచేతను అన్నభక్షణచేతను వృద్ధినొందింపుము.

మం॥ ఏధోఽస్యేధిషీ మహి స్వాహా॥ అగ్నయ ఇదం నమమ॥

అ॥ ఏధః=అగ్నిప్రకాశించు సాధనము, అసి=అయితివి: ఏధిషీ మహి=మేమును ప్రజ్వలింపఁజేయుచుంటిమి. ఇదం=ఇది, అగ్నయే= అగ్నికొఱకు, నమమ=నాకుగాదు.

తా॥ ఓ ఇంధనమా ! అగ్ని ప్రజ్వలిల్లుటకు నీవు సాధనమైతివి మేమును నిన్ను ప్రజ్వరింపజేఁయు వారమైతిమి. ఇది అగ్నికొఱకు అర్పితమగుగాక, (నాకుగాదు)

మం॥ సమిదసి సమేదిషీ మహి స్వాహా॥ అగ్నియఇదంనమమ॥

అ॥ త్వం=నీవు, సమిత్=ఇంధనము, అసి=అయితివి; సమేధిషీ మహి= నిన్ను ప్రజ్వలింపజేయు కర్తలమైతిమి, ఇదం=ఇది అగ్నయే= అగ్నికొఱకు అర్పితమగుగాక; నమమ=నాకుగాదు.

తా॥ పైదాని తాత్పర్యమే దీనికిని,

మం॥ తేజోఽసి తే మయి ధేహి స్వాహా॥

అగ్నయ ఇదం నమమ॥

అ॥ తేజః = ప్రజ్వరిల్లుటకు సాధనమయినందున ప్రకాశకరము, అసి = అయితివి; తేజః = తేజస్సును, మయి = నాయందు, ధేహి = ఉంచుము,

తా॥ ఓ ఇంధనమా ! నీవు ప్రజ్వరిల్లుటకు సాధనమయితివి. అటువంటి నీవు తేజస్సు నాకుఁ గలుగఁజేయుము.

మం॥ అపో అద్యాన్వ చారిషగ్ం రసేన సమసృక్ష్వహి ।

పయస్వాగ్ం అగ్న అగమంతం మాసగ్ం సృజ

వర్చసా స్వాహా॥ అగ్నయ ఇదం నమమ॥

అ॥ అద్య = ఇప్పుడు, అపః = సమిధలనుంచుటయను కర్మను అను = క్రమముగా, అచారిషం = చేయుచున్నాను; రసేన = శ్రద్ధతో, సమసృక్ష్మహి = కూడినవాడనుగా అయ్యెదను; హేఅగ్నే – ఓ అగ్నిహోత్రుడా ! అహం = నేను, పయస్వాన్ = ఆజ్యాదిహవిస్సు గలవాడనై, త్వాం = నిన్ను, అగమం = వచ్చెదను. తం = అటువంటిమా = నన్నువర్చసా = కాంతితోడ. సంసృజ = కూర్చుము, ఇదం = ఇది, అగ్నయే = అగ్నికొఱకు, మమన = నాకుగాదు,

తా॥ నేను శ్రద్ధగలవాడనై నీవు ప్రజ్వరిల్లుటకు నింధనములనుంచుచుంటిని. ఆజ్యము మొదలగు హవిస్సు గల వాడవై ప్రతిదినము నీవద్దకు వచ్చుచుందును. కావున ఓ అగ్నిహోత్రుడా ! ఇట్టి నన్ను కాంతి గలవానినిగాఁ జేయుము.

మం॥ సంమాఽగ్నే వర్చసా సృజ ప్రజయాచ ధనేన

చ స్వాహా॥ అగ్నయ ఇదం నమమ॥

అ॥ అగ్నే != ఓ అగ్నిహోత్రుడా । మా = నన్ను, వర్చసా = వర్చస్సుతోడను, ప్రజయా చ = సంతానము తోడను. ధనేనచ = ధనము తోడను, సంసృజ = కూర్చుము, ఇదం = ఇది, అగ్నయే = అగ్నికి.

తా॥ ఓ అగ్నిహోత్రుడా ! నన్ను వర్చస్సు సంతానము ధనము కలవానినిగాఁ జేయుము. ఇది అగ్నికి అర్పితమగుగాక నాకుకాదు,

మం॥ విద్యున్మే అస్య దేవా ఇంద్రో విద్యా ద్సహ

ఋషి భిస్స్వాహా॥ ఇంద్రాయేదం నమమ॥

అ॥ దేవా = దేవతలు, అస్య = ఈ. మే = నన్ను, (ద్వితీయార్థమందు షష్ఠి) విద్యాత (విద్యుః) గుర్తెఱుగుదురుగాక; ఇంద్రః = ఇంద్రుడు, సహర్షిభిః = మునీశ్వరులతోగూడ, విద్యా = గుర్తెఱుంగుగాక, ఇదం = ఇది, ఇంద్రాయ = ఇంద్రునకు, మమన = నాకు గాదు.

తా॥ సమస్తమైన దేవతలును, ఇంద్రుడును, మునీశ్వరులును నే జేయు కర్మలను చూచుచుందురుగాక, ఇది ఇంద్రునకు అర్పితమగుగాక.

మం॥ అగ్నయే బృహతే నాకాయ స్వాహా॥ అగ్నయే

బృహతే నాకాయేదమ్॥

అ॥ బృహతే = గొప్పవాడును, నాకాయ = నాకుడగుపేరు గలవాడునగు, అగ్నయే = అగ్నిహోత్రుని కొరకు, ఏషా = ఈ, సమిత్ = ఇంధనము. దీయతే ఈయబడుచున్నది ఇదం = ఇది, బృహతే = గొప్పవాడగు, నాకాయ = నాకుడు అను పేరుగల, అగ్నయే = అగ్నికి.

తా॥ మహాత్ముడును నాకుడనెడు పేరుగలవాడునగు అగ్నిహోత్రుని కొఱకు, ఈ సమిధ ఈయబడుచున్నది. ఇది గొప్ప నాకనాముడను అగ్నికి అర్పితమగుగాక.

మం॥ ద్యావా పృధివీభ్యాగ్ం స్వాహా॥ ద్యావా

పృధివీభ్యా మిదమ్॥

అ॥ ద్యావా పృధివీభ్యాం= స్వర్గము భూలోకములకు,

తా॥ స్వర్గము భూలోకము ఈ సమిధను ఇచ్చుచున్నాను.

మం॥ ఏషా తే అగ్నే సమి_త్తయా వర్ధస్వ

చాప్యాయస్వ చ తయాఽహం వర్ధమానో

భూయాస మాప్యాయ మానశ్చ స్వాహా॥

అగ్నయ ఇదమ్॥

అ॥ అగ్నే = ఓఅగ్నిహోత్రుడా! తే=నీ కొఱకు, ఏషా = సమిత్=ఇంధనము, దీయతే=ఈయఁబడుచున్నది: తయా=ఆసమిధచే, వర్ధస్వ=వృద్ధిపొందుము; ఆప్యాయస్వ = సంపూర్ణుడవగుము; అహం= నేను, తయా=ఆసమిధచేత, వర్ధమానః=వృద్ధిపొందినవాడను, ఆప్యాయ మానః=సంపూర్ణుడను, భూయాసమ్=అయ్యెదను.

తా॥ ఓ అగ్నిహోత్రుడా! ఈసమిధను నీకిచ్చుచున్నాను. ఈ సమిధచే నీవు వృద్ధిపొంది సంపూర్ణుడవు కమ్ము, నేనును వృద్ధిపొంది సంపూర్ణుడ నయ్యెదను.

మం॥ యో మాఽగ్నే భాగినగ్ం సంతమధా భాగం
చికీర్షత్యభాగ మగ్నేతం కురు మామగ్నే భా
గినం కురు స్వాహా॥ అగ్నయ ఇదమ్॥

అ॥ అగ్నే = ఓ అగ్నిహోత్రుడా ! యః = ఎవడు, మా = నేను, భాగినం = భాగముగలవాడనై సంతం = ఉన్నవాడనగుచుండగా, అథ = అనంతరము, అభాగం = భాగము లేనివానినిగా, చికీర్షతి = చేయ నిశ్చయించుచున్నాడో; అగ్నే = ఓ అగ్నిహోత్రుడా ! తం = వానిని, అభాగం = భాగము లేని వానినిగా, కురు = చేయుము.

తా॥ ఓ అగ్నిహోత్రుడా ! నేను భాగము కలవాడనయియుండగా నెవడు నన్ను భాగములేని వానినిగా జేయఁదలచునో, వానిని భాగమురేని వానినిగాఁ జేసి నన్ను భాగముగలవానినాఁ జేయుము.

మం॥ సమిధ మాధాయాగ్నే సర్వవ్రతో భూయాసగ్
స్వాహా॥ అగ్నయ ఇదమ్॥

అ॥ అగ్నే = ఓ అగ్నిహోత్రుడా! సమిధం = సమిత్తును, ఆధాయ = ఉంచి, సర్వవ్రతః = సమస్త వ్రతములుఁ జేసినవాడను, భూయాసమ్ = అయ్యెదను.

తా॥ ఓ అగ్నిహోత్రుడా ! ఈ సమిధను నీయందుంచుటచే. నేను సమస్తమైన వ్రతములను జేసి పరిపూర్ణమైన వాడ నయ్యెదను. ఇది అగ్నికి అర్పితమగుగాక.

మం॥ భూస్స్వాహా॥ అగ్నయ ఇదం నమమ॥

భువ స్స్వాహా॥ వాయవ ఇదం నమమ॥

సువ స్స్వాహా॥ సూర్యాయేదం నమమ॥

ఓం భూర్భువ స్సువ స్స్వాహా॥

ప్రజాపతయ ఇదం నమమ॥

అని హోమములు చేయవలెను.

సూ॥ అంతే తూష్ణీం పరిసమూహ్య॥-

అని చివర మౌనముగా అగ్నిచుట్టును ఉదకమును ప్రోక్షించవలెను.

అగ్న్యుపస్థానమ్.

మం॥ అదితేఽను మన్యస్వ - ఇతి దక్షిణతః ప్రాచీనమ్ ।
అనుమతేఽను మన్యస్వ - ఇతి పశ్చా దుదీచీనమ్ ।
సరస్వతేఽను మన్యస్వం ఇత్యు త్తరతః ప్రాచీనమ్ ।
దేవ సవితః ప్రసువ॥ ఇతి సమంతమ్॥

అర్థము ఇదివఱకు చెప్పబడినది.

మం॥ యత్తే అగ్నే తేజస్తే నాహం తేజస్వీ భూయాసమ్।

యత్తే అగ్నే వర్చస్తే నాఽహం వర్చస్వీ భూయాసమ్ ।

యత్తే అగ్నే హరస్తే నాహం హరస్వీ భూయాసమ్॥

అ॥ హే అగ్నే = ఓ అగ్నిహోత్రుడా ! తే = నీ సంబంధమయిన యత్ తేజః = కాంతిరూపమైన యేతేజస్సు కలదో, తేన = ఆ తేజస్సుచేత అహం = నేను, తేజస్వీ = కాంతిరూప తేజస్సుగలవాడను, భూయాసమ్ అగుదునుగాక, హే అగ్నే = ఓ అగ్నీ ! తే = నీ సంబంధమయిన, యత్ = ఏ, వర్చః = ఏ వర్చస్సు (బలము) కలదో, తేన = ఆ వర్చస్సు (బలము)చేత, అహం = నేను, వర్చస్వీ = వర్చస్సు (బలము) కలవాడను, భూయాసమ్ = అగుదునుగాక.

హే అగ్నే = ఓ అగ్ని దేవుడా ! తే నీ సంబంధమయిన, యత్ = ఏ, హరః = రశ్మిరూపముమైన తేజస్సు గలదో, తేన ఆరశ్మిరూపమయిన తేజస్సుచేత, అహం హరస్వీ - రశ్మిరూప తేజస్సుగలవాడను, భూయాసమ్ = అగుదునుగాక,

తా॥ ఓ అగ్నీ ! నీసంబంధమయిన తేజస్సుచే నేను తేజస్సు గలవాడనగుదునుగాక, ఓఅగ్నీ! నీ సంబంధమయిన బలముచే నేను బలముగలవాడనగుదును గాక. ఓ అగ్నీ నీ సంబంధమయిన రశ్మిరూప తేజముచే నేను రశ్మిరూప తేజముగలవాడ నగుదునుగాక,

అగ్నికున్న కాంతిరూపమైన తేజస్సు, బలము, రశ్మిరూప తేజస్సు, ఈ మూడును నాకు అనుగ్రహింపు మని వటువు అగ్నిని ప్రార్థింపవలెను.

మం॥ మయి మేధాం మయి ప్రజాం మయ్యగ్నిస్తేజో దధాతు ।

మయి మేధాంమయి ప్రజాం మయీంద్ర ఇంద్రియందధాతు॥

మయిమేధాం మయి ప్రజాంమయి సూర్యో భ్రాజోదధాతు।

అ॥ మయి=నాయందు మేంధా=తెలివిని అనగా గ్రంథమును తదర్థమును ధారణచేయు శక్తిని, మయి = నాయందు, ప్రజాం=సంతానమును (పుత్రాదులను), మయి=నాయందు, తేజః=శరీరకాంతిని (తేజస్సును). అగ్నిః=అగ్నిహోత్రుడు, దధాతు=కలుగఁజేయుఁగాక, ఇంద్రః=ఇంద్రుడు. మయి=నాయందు, మేధాం=తెలివిని, మయి=నాయందు, ప్రజాం=సంతానమును, మయి = నాయందు, ఇంద్రియం=రేతస్సును (చక్షురాది పాటవమును) దధాతు = కలుగఁజేయుఁగాక; సూర్యః = సూర్యుడు, మయి = నాయందు, మేధాం=తెలివిని, మయి=నాయందు, ప్రజాం=సంతానమును, మయి=నాయందు, భ్రాజః = దీప్తిజాతమును (ప్రకాశమును) దధాతు = కలుగఁజేయుఁగాక.

తా॥ అగ్నిహోత్రుడు తెలివిని సంతానమును కాంతిని, ఇంద్రుడు తెలివిని సంతానమును రేతస్సును, సూర్యుడు తెలివిని సంతానమును ప్రకాశమును నాకు గలుగఁజేయుదురుగాక.

మం॥ మా నస్తోకే తనయే మాన ఆయుషి మానో గోషు
మానో అశ్వేషు రీరిషః వీరాన్మానో రుద్రభామితో
వధీర్హ విష్మన్తో నమసా విధేమతే
త్ర్యాయుషం జమదగ్నేః కశ్యపస్య త్ర్యాయుషం
యద్దేవానా స్త్రియుషం తన్మే అస్తు త్ర్యాయుషమ్ః

అ॥ హేరుద్ర=ఓ రుద్రుడా ! నః=మాయొక్క, తోకే=పుత్రుడు మున్నగు వారి విషయములో, మారీరిషః=హింసను చేయవద్దు; తనయే= వాని పుత్రుని విషయములో, ఆయా పుత్ర పౌత్ర వ్యతిరిక్తుడైన మనుష్యుని పట్లను, మా = వద్దు నః = మా యొక్క, గోషు = పశ్వాదులపట్లను. అశ్వేషుచ=గుఱ్ఱములపట్లను మా రీరిషః = హింసను సలుపవలదు; హే రుద్ర ఓ రుద్రుడా ! వీరాన్ = శౌర్యముగల మా వారలను, భామితః=క్రుద్ధుడవై. మా వధీః=వధచేయకుము:వయం చ= మేమున్ను, హవిష్మన్తః = హవిస్సులు గలవారలమై, నమసా=నమస్కారములతో, తే = నీకు, విధేమ=పరిచర్య చేయుదుము, జమదగ్నేః=జమదగ్నిమునీశ్వరునకు, యత్=ఏ, త్ర్యాయుషం = బాల్యయౌవన వార్ధక్య రూపమయిన మూడవస్థలు గలవో, కశ్యపస్య = కశ్యపునియొక్క, యత్= ఏ; త్ర్యాయుషం = మూడవస్థలును, మే = నాకు, అస్తు = కలుగుగాక.

తా॥ ఓ రుద్రుడా ! మా పుత్రాదుల విషయములోను, పౌత్రాదుల విషయములోను, పుత్ర పౌత్ర వ్యతిరిక్త మనుష్యాదులలోను, మా పశ్వాదులలోను, అశ్వములపట్లను హింస సలుపవలదు. ఓ రుద్రుడా ! నీవు క్రుద్ధుడవై శౌర్యమ్ముగల మావారలను హింసింపకుము, మేమున్ను హవిస్సులు గల వారలమై నమస్కారములు చేయుచు నీకు పరిచర్య చేయుచుందుము.

జమదగ్నికిని కశ్యపునకును దేవతలకును బాల్యయౌవన వార్ధక్య రూపమైన యే మూడవస్థలు గలవో, ఆమూడవస్థలును నాకు గలుగవలయునని బాలుడు చెప్పుచున్నాడు.

సూ॥ -భస్మనా శిరోలలాట వక్షస్కంధేషు తిలకాని కుర్యాత్॥

ఆయగ్ని యంధి భస్మముతో శిరస్సునందును, నొసటను, వక్షము మీదను, భుజములమీదను బొట్లుంచుకుని క్రింది మంత్రముతో నమస్కరించ వలెను.

మం॥ మేధావీ భూయాసం ; తేజస్వీ భూయాసం ।
వర్చస్వీ భూయాసం । బ్రహ్మవర్చస్వీ భూయాసమ్।
ఆయుష్మాన్ భూయాసం అన్నాదో భూయాసమ్।
యశస్వీ భూయాసం సర్వసమృద్ధో భూయాసం॥

అ॥ తా॥ మేధాశక్తి గలవాడను అయ్యేదను; తేజస్సు గలవాడను అయ్యేదను వర్చస్సుగలవాడ నయ్యేదను; బ్రహ్మవర్చస్సుగలవాడ నయ్యేదను; పూర్ణాయుర్దాయము గలవాడ నయ్యేదను; అన్నపుష్టి గలిగి అన్నము తినువాడ నయ్యేదను; యశస్సు కలవాడ నయ్యేదను; సర్వవిధములయిన సమృద్ధిగలవాడ నయ్యేదను.

మం॥ పునస్త్వాత్యారు ద్రావసవ స్సమింధతాం
పున ర్బ్రహ్మణో వసునీథ యజ్ఞైః । ఘృతేన
త్వన్తనువో వర్ధయస్వ సత్యా స్సంతు యజ
మానస్య కామా స్స్వాహా॥ అగ్నయే వసునీథా యేదమ్॥

అ॥ హే అగ్నే = ఓ అగ్నిహోత్రుడా ! ఆదిత్యాః = ద్వాదశాదిత్యులు, రుద్రాః = ఏకాదశరుద్రులు, వసవః = అష్టవసువులు, త్వా = నిన్ను, సమింధతామ్ = బాగుగా ప్రకాశింపజేయుదురుగాక; హేవసునీథ ! = (వసుధనం తన్నిమిత్తా నీథా స్తుతిర్యస్యసః=వసునీథః । యద్వా వసూని నయతీతి= వసునీథః, తత్సంబుద్ధిః) ధనము నిమిత్తమైన స్తోత్రముగల వాడా లేక ధనములను గల్గించువాడా ! బ్రాహ్మణాః = బ్రాహ్మణులైన ఋత్విగ్యజమానులు, యజ్ఞైః= యజ్ఞములచేత (యజ్ఞములు చేసి) త్వాం= నిన్ను, పునః = తిరిగి, సమింధతామ్ = బాగుగా ప్రకాశింపజేయుదురుగాక; త్వంచనీవున్ను తనువః=నీ శరీరమును. ఘృతేన=మే మిచ్చిన నేతితో వర్ధయస్వ = పెంచుకొనుము; యజమానస్య = యజమానుని యొక్క, కామాః=కోరికలు, సత్యాః సంతు=సత్యములగుగాక; నీవు వృద్ధిగలవాడవైనని తరువాత యజమానుని కోరికలు సత్యము లవగలవు. ఇదం=ఇది, అగ్నయే వసునీథాయ=వసునీథుడైన అగ్నికి అర్పితము.

తా॥ ఓ అగ్నిహోత్రుడా ! ద్వాదశాదిత్యులు, ఏకాదశ రుద్రులు, అష్టవసువులును నిన్నుచక్కగా ప్రకాశింపజేయుదురుగాక; ఓధనమును గల్గించు అగ్నే । బ్రాహ్మణులైన ఋత్విగ్యజమానులు, యజ్ఞములు చేసి నిన్ను మఱల ప్రకాశింపజేయుగాక. నీవును నీ శరీరమును యజ్ఞములలో హోమ రూపముగా మేమిచ్చిన నేతితో వృద్ధి పొందించుకొనుము. నీవు వృద్ధిగల వాడవైన తరువాత యజమానుని కోరికలు నీకృపవలన సత్యములు అగు గాక.

అనేన ప్రాతరగ్ని కార్యేణ భగవాన్ సర్వాత్మకః
యజ్ఞేశ్వరః సుప్రీణాతు ।
సర్వం శ్రీయజ్ఞేశ్వరార్పణమస్తు॥

ప్రాతఃకాలమునఁ జేసిన ఈ అగ్ని కార్యముచేత సర్వాత్మకుడయిన యజ్ఞేశ్వర భగవానుడు సుప్రీతుడగుగాక. సమస్తము శ్రీయజ్ఞేశ్వరునకు అర్పితమగుగాక,

స్వస్తి శ్రద్ధాం మేధాం యశః ప్రజ్ఞాం విద్యాం శ్రియం బలమ్ ।
ఆయుష్యం తేజ ఆరోగ్యం దేహిమే హ వ్యవాహన॥
శ్రియం దేహిమే హవ్యవాహన ఓం నమ ఇతి।

స్వస్తియగుగాక, ఓ హవ్యవాహనా ! నాకు శ్రద్ధను, మేధను, యశస్సును. ప్రజ్ఞను, విద్యను. బుద్ధిని. శ్రీని, బలమును, ఆయుష్యమును, తేజస్సును, ఆరోగ్యమునున్ను అనుగ్రహించి యిమ్ము - అని ప్రార్థింపవలెను.

శ్లో॥ యస్య స్మృత్యాచ నామోక్త్యా తపో హోమక్రియాదిషు ।
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యోవందే త మచ్యుతమ్॥

ఏ దేవుని స్మరించుటచేతను, నామ కీర్తనము చేత నుతపస్సు హోమము అనుష్ఠానమున్నుగువానిలో లోపమున్నను ఆలోపము గణింపబడక వెంటనే సంపూర్ణత్వము గల్గునో, అట్టి దేవుడగు అచ్యుతుని నమస్కరించెదను - అనినమస్కరించవలెను.

శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం హుతాశన ।
యద్ధుతం తు మయాదేవ పరిపూర్ణం తదస్తుతే॥

ఓ అగ్నిదేవుడా । మంత్రములోగాని అనుష్ఠానములోగాని భక్తిలోగాని లోముగల్గి నేను దేనిని హోమముచేసితినో అది నీ యనుగ్రహము వలన పరిపూర్ణము అవుగాక - అని ప్రార్థింపవలెను.

## గోత్రాది పఠనమ్ గోత్రాదులను పఠించుట

ఓం చతుస్సాగర పర్యంతం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు।
ఋషి - గోత్రనామ - అహం భో అభివాదయే ।

ఓం నాల్గుసముద్రముల వఱకున్న గోవులకు బ్రాహ్మణులకున్ను శుభము అవుగాక, ఫలాన ఋషులు గోత్రము, నామధేయమున్ను గల నేను నమస్కరించుచున్నాను అని చెప్పవలెను.

ఇత్యగ్నికార్యమ్ ఈఅగ్నికార్యమును సదా చేసికొనవలెను
అగ్నికార్యము సమాప్తము

ఆచమ్య ఆచమనము చేయవలెను

సూ॥ ఏవమన్యస్మిన్నపి సదారణ్యా దేధానాహృత్య॥
(అగ్ని కార్యం కుర్యాదితి శేషః ।

ఈ ప్రకార మీ దీక్షాంతమునుండి స్నాతకమునుండి సమిధలను తెచ్చి సాయం ప్రాతఃకాలములందు లౌకికాగ్నియందు వ్రేల్చు (హోమముచేయు) చుండవలయును.

సూ॥ ఉత్తరయా సగ్ంశాస్తి॥
మంత్రములుచేత కుమారు నీక్రింది విధమున నాజ్ఞాపించుచున్నాడు.

ఆచార్య :-
మం॥ బ్రహ్మచార్యసి॥

బ్రహ్మచారివయితివి. స్వేచ్ఛగా తిరుగటయు మాటలాడుటయు తినుటయు చేయకుము.

కుమారః :- బాఢం!!
(కామచారవాద భక్షణకామో నభవామి

చిత్తము. అని వటు డనవలెను.

(స్వేచ్ఛగా తిరుగుట, మాటలాడుట, తినుట అను పనులు చేయు వాడను కాను)

ఆచార్య :-

మం॥ అపోఽశాన॥

నా సెలవు లేకయు నుదకపానము చేయుము గాని ఆకలి కోర్చుకొనుము.

కుమారః :- బాఢమ్॥ చిత్తము,

ఆచార్య :-

మం॥ కర్మ కురు॥

మననిమిత్తమైన విధ్యుక్త కర్మ నేను చెప్పకున్నను చేయుము.

కుమార :- బాఢమ్॥ చిత్తము,

ఆచార్య :-

మం॥ మా సుషుప్థాః॥

మేము నిద్రించిన పిమ్మట నిద్రించి మా కంటె ముందు లెమ్ము. పగలు నిద్రిపకుము.

కుమార :- బాఢమ్॥ చిత్తము.

ఆచార్య :-

మం॥ భిక్షాచర్యం చర॥

నీకు భోజనమమరినను మా నిమిత్తము మాధుకరము చేయుము.

కుమార :- బాఢమ్॥ చిత్తము.

ఆచార్య :-

మం॥ ఆచార్యధీనో భవ :-

నా యాజ్ఞలేక యాజనాది కర్మలఁ జేయుము.

కుమార:- బాఢమ్॥ చిత్తము.

భవద్ధి రన నుజ్ఞాతస్సన్ యాజనాది కర్మ నకరో॥

మీ అనుజ్ఞలేకుండగ యాజనాది కర్మలచేయకుము.

భిక్షాకార్యమ్ — భిక్షాకార్యము :-

సూ॥ తతోగురుం మాతర మన్యాగ్ంశ్చ వృద్ధాన్
నమస్కృత్య భిక్షాం యాచయేత్॥

పిమ్మట ఆచార్యునకు, తల్లికిని, ఇతరులైన పెద్దలకును నమస్కరించి భిక్షను యాచించవలెను.

సూ॥ భవాన్ భిక్షాం దదాతు ఇతి పురుషం
భవతి భిక్షాం దేహి ఇతి స్త్రియం యాచయేత్॥

పురుషుని యాచించునపుడు' భవాన్ భిక్షాం దదాతు' అని స్త్రీని యాచించునపుడు 'భవతి ! భిక్షాం దేహి' అనియు చెప్పి భిక్షను యాచించవలెను.

సూ॥ ఓం చతుస్సాగర పర్యంతం గోబ్రాహ్మణేభ్యః శుభం భవతు।
అర్థము ఇది వరకు చెప్పబడినది.

....——ఋషి........గోత్ర——....
సూత్రీ....శాఖాధ్యాయీ నామా అహం భో అభివాదయే ।
అని ప్రవర చెప్పించవలెను.

సూ॥ అథాస్మై అరిక్తం పాత్రం ప్రయచ్ఛన్నాహ మాతర మేవాగ్రే భిక్షస్వేతి బోధాయన గృహ్య సూత్రాత్॥

ఆజ్ఞానంతరము ఆచార్యుడు వటువున కేదయిన ఒక వస్తువుతో గూడిన భిక్షాపాత్ర నిచ్చి ముందు తల్లినే యాచింపుమని చెప్పవలెను.

(తల్లిని ముందుగ యాచింపుమని బోధాయన గృహ్య సూత్రము చెప్పుచున్నది)

సూ॥ వాసశ్చరుర్థీ ముత్తరయాఽఽదత్తేఽదత్పరిధాప్య గురోర్వా సస్తే దదామీతి దద్యాత్॥

ఉపనయనమునాడు తనకు గట్టిన వస్త్రమును వటుడు ఓగురువరా! ఈ వస్త్రమును నీకిచ్చుచున్నాను అనగా, నాచార్యుడు 17 సార్లు ప్రణవము చేసి మునుపటివలె మంత్రయుక్తముగా నూతన వస్త్రమును ధరింపఁజేసి వటు డిచ్చు వస్త్రమును క్రింది మంత్రము ద్వారా చెప్పి పుచ్చుకొనవలెను.

మం యస్యతే ప్రథమ వాస్యగ్ం హరామస్తం త్వా విశ్వే
అవంతు దేవాః । తం త్వా భ్రాతర స్సువృధో
వర్ధమాన మనుజాయంతాం బహవ స్సుజాతమ్॥

అ॥ యస్య=ఏతే+నీ యొక్క, ప్రథమ వాస్యం+ మొదట ధరింపఁ బడిన వస్త్రమును, హరామః= తీసికొనుచున్నామో, తం=అటు వంటి. త్వాం=నిన్ను, విశ్వేదేవాః=విశ్వేదేవతలు లేక సమస్తమైన దేవతలును, అవంతు=రక్షింతురుగాక; వర్ధమానం = వృద్ధిపొందువాడవును. సుజాతం=యోగ్యమైన జననముగలవాడవును అగు, తం = అటువంటి, త్వాం=నిన్ను, సువృధః=యోగ్యమైన వృద్ధిగలవారును, బహవః = అనే

కులునైన, భ్రాతరః=నీ సహోదరులు, అనుజాయంతామ్=నిన్ననుసరించి పుట్టుచుందురుగాక.

తా॥ ఓకుమారుడా ! నీవు పూర్వము ధరించిన వస్త్రమును మేము తీసికొంటిమి. ఇటువంటి నిన్ను విశ్వేదేవతలు రక్షింతురుగాక; మంచి వృద్ధియు యోగ్యమైన జననమును నీకు ప్రాప్తించినట్లుగా నీ సహోదరులును వృద్ధిగలవారై యనేకులు పుట్టుదురుగాక.

కారికాః - కారికలు

శ్లో॥ గాయత్రీం గురుణాదిష్టాం తిష్ఠన్నా సూర్య మభ్యసేత్ ।
సూర్యేఽస్త శిఖరం ప్రాప్తే సాయం సంధ్యా ముపక్రమేత్॥

వటుడు గురూపదేశమైన గాయత్రిని సూర్యుడు పడమటి కొండకుఁ జేరువఱకు నిలిచి వల్లించి, సాయం సంధ్యను ప్రారంభించి నిత్యము రెండు పూటల చేయుచుండవలెను.

అగ్నికార్యం వటుః కుర్యాత్ సంధ్యయోరుభయోరపి ।
తతోఽభివాదయే ద్వృద్ధాన్ అసావహమితి బ్రువన్॥

సంధ్యావందనానంతరము అగ్నికార్యము రెండుపూటలఁ జేయవలెను. పిమ్మట ప్రవర చెప్పి పెద్దల కభివందనములు చేయవలెను.

ఆదిమధ్యావసానేషు భవచ్ఛబ్దోప లక్షితః ।
బ్రాహ్మణ క్షత్రియ విశాం భిక్షాచర్యం యథాక్రమమ్॥
బ్రహ్మక్షత్రియ విశాం భిక్షాచర్యం యథాక్రమ్॥

బ్రహ్మ క్షత్రియ వైశ్యులు మొదట, నడుమ, కొనను భవాచ్ఛబ్దమును జేర్చి క్రమాలంకారముగా భిక్ష చేయవలెను.

తతః ఆశీర్వాదః - పిమ్మట ఆశీర్వాదము

(అనగా బ్రాహ్మణులు 'భవతి భిక్షాం దేహి యనియు, రాజులు 'భిక్షాం భవతి దేహి' యనియు, వైశ్యులు 'భిక్షాం దేహి భవతి' యనియు చేయవలెను.

# అథపాలాశ ప్రయోగః

## పాలాశ ప్రయోగము

(పాలాశకర్మ = మోదుగుచెట్టు మొదటఁజేయు సంస్కారము)

మూ॥ కేచిత్పాలాశం కర్మ కుర్వంతి త్రీణ్యహాని ప్రత్య
హమామ భైక్ష మాచరేత్ । చతుర్థేఽహన్యన్న సగ్గ్స్కారేణ
సగ్స్కృత్యాచార్యేణ సహప్రాచీముదీచీం వాదిశ ముపనిష్క్రమ్య॥

పాలాశకర్మచేయుట కొందఱి మతము. ఉపనయన దీక్ష 3 రోజులును ఆమభిక్షచేసి నాలుగవ రోజున భిక్షచేసి నన్నము సంపాదించి యాచార్యునితో గూడి గ్రామము యొక్క తూర్పునకుగాని యుత్తరమునకు గాని వెళ్ళి మోదుగుచెట్టు మొదట నీపాలాశకర్మను చేయవలెను. (మోదుగు కొమ్మ అగ్ని కు త్తరమున పాతి దాని క్రింద చేయుటాచారము.

శ్లో॥ శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయే త్సర్వ విఘ్నో పశాంతయే॥

శుక్లాంబధరుడు. సర్వవ్యాపకుడు, శశివర్ణుడు. చతుర్భుజు, ప్రసన్న వదనుడు నగు విఘ్నేశ్వరుని సర్వవిఘ్నములు నశించుటకై ధ్యానింపవలయును.

సర్వేభ్యో మహాజనేభ్యోనమః॥
మహాజనులందఱకు నమస్కారము చేయవలయును.
ఓం కేశవాయ స్వాహా ఆచమ్య

ఓం కేశవాయ స్వాహా అని ఆచమనము చేయవలయును.

ఏవంగుణ.......... శుభ తిథౌ ధర్మపత్నీ సమేతస్య
మమ కుమారస్య (ప్రణవ, శ్రద్ధా) మేధాజనన సిద్ధ్యర్థం:

ఇట్టిగుణములుగల....——....శుభతిధిని ధర్మపత్నీ సమేతుడైన నా యొక్క కుమారునకు (ప్రణవము, శ్రద్ధ) మేధాలాభము గల్గుటకు.

ఆయుష్యాభి వృద్ధ్యర్థం పాలాశం కర్మ కరిష్యమాణః
తదంగత్వేన తదాదౌ శుద్ధ్యర్థం వృద్ధ్యర్థ్యం........
పుణ్యాహ వాచనం కరిష్యే॥

ఆయుర్దాయము వర్ధిల్లుటకు పాలాశకర్మను చేయదలచినవాడవై దానికి అంగముగా దానియొక్క ఆదిలో శుద్ధికొఱకు వృద్ధికొఱకును. పుణ్యాహ వచనము చేయించెదను అని చెప్పవలెను.

ఆదౌ నిర్విఘ్నేన పరి సమాప్త్యర్థం
శ్రీమహాగణాధిపతి పూజాం కరిష్యే॥

మొదట నిర్విఘ్నముగా పూర్తి యగుటకు శ్రీమహాగణాధిపతి పూజను చేసెదను అని చెప్పవలెను.

గణాధిపతి పూజాం కృత్వా పుణ్యాహం చ కుర్యాత్॥
అథ పాలాశ వృక్షమూలే త్రీణ్యుదగ పవర్గాణి
స్థండిలాని కల్పయిత్వా॥ తేషు యథాక్రమ మావాహ్య॥

ఆమోదుగు కొమ్మల క్రింద నుత్తరస సమాప్తిగా 3 మంటపముల నాసాదనచేసి వానిపై నుత్తర సమాప్తిగా (ప్రణవశ్రద్ధా) మేధాదేవతల నావాహన చేయవలెను।

మం॥ యశ్ఛందసా మృషభో విశ్వరూపః ।

ఛందో భ్యోఽధ్య మృతాత్సం బభూవ ।

సమేంద్రో మేధయా స్పృణోతు ।

అమృతస్య దేవధారణో భూయాసమ్ ।

శరీరం మే విచర్ షణమ్ ।

జిహ్వా మే మధు మత్తమా ।

కర్ణాభ్యాం భూరి విశ్రువమ్ ।

బ్రహ్మణః కోశోఽసి మేధయా పిహితః ।

శ్రుతం మే గోపాయ॥ ఇతి ప్రథమస్థం డిలే)

ప్రణవమావాహయామి స్థాపయామి పూజయామి॥

అ॥ యః=ఏది, ఛందసాం=వేదములకు, ఋషభః= ప్రధానమైనదో, విశ్వరూపః=సర్వరూపమయినదో, (సః-=ఆ ప్రణవము) అమృతాత్=అమృత స్వరూపములగు, ఛందోభ్యః=వేదములలో, సంబభూవ=సారభూతమై ప్రకాశించుచున్నది. ఇంద్రః=పరమేశ్వరరూపమగు, సః=ఆ ప్రణవము, మా=నన్ను, మేధయా=ప్రజ్ఞచేత, స్పృణోతు=సంతో

షింపఁజేయుఁగాక, దేవః = (ప్రకాశస్వరూపమగు) ఓ ప్రణవమా ! అమృతస్య = (అమృతత్వమునకు హేతు భూతమగు) బ్రహ్మజ్ఞానమును, ధారణః=ధరించువాడను, భూయాసం= అయ్యెదనుగాక.

మే =నాయొక్క, శరీరం= దేహము, విచర్షణం= యోగ్యమయినది, (భూయాత్ =అగుగాక) మే =నాయొక్క, జిహ్వా= నాలుక. మధుమత్తమా = మధురభాషణము గలది, (భూయాత్ = అగుగాక) కర్ణాభ్యాం= రెండుచెవుల నుండి, భూరి= విస్తారముగా, విశ్రువం =వినియెదనుగాక. (నా దేహేంద్రియములు ఆత్మజ్ఞానార్హములగుగాక) (ఓ పణవమా ! నీవు) బ్రహ్మణః= పరమాత్మకు, కోశః=నివాసస్థానము, అసి =అయితివి. మేధయా = సామాన్య ప్రజ్ఞచేత, పిహితః=కప్పఁబడితివి. మే =నాయొక్క, శ్రుతం = శ్రవణ పూర్వకమైన ఆత్మజ్ఞానాదికమును, గోపాయ =రక్షించుమా ।

ఈ మంత్రములు మేధాకాముడు జపింపవగినవి) ఇతి = అని, ప్రథమ స్థండిలే=మొదటి మండపములో, ప్రణవం =ప్రణవ దేవతను, ఆవాహయామి= ఆవా హనముచేసి, స్థాపయామి = స్థాపనచేసి, పూజయామి =పూజ చేసెదను అని చెప్పవలెను.

తా॥ ప్రణవము వేదత్రయములలో సారభూతమయి ప్రకాశించుచున్నధి. ఇదియే సర్వస్వరూపము. పరమేశ్వర స్వరూపమగు ఈ ప్రణవము నన్ను మేధావంతునిగా నొనర్చుఁ గాక. ఓ ప్రణవమా । నేను అమృతస్వరూపమగు బ్రహ్మజ్ఞానమును ధరించువాడ నయ్యెదగాక. నా దేహము ఆరోగ్యముగలది యగుగాక, నానాలుక మధుర భాషములు గలది యగుగాక, నాచెవులు చక్కగా వినుటకు సమర్థములగుగాక. అనగా నా దేహము ఇంద్రియములు బ్రహ్మజ్ఞానార్హములగుగాక. ఓ ప్రణవమా ! నీవు పరబ్రహ్మమునకు కోశభూతమైన దానవు, (కోశమనగా ఒర. కత్తి ఒర యందు ఎటులనుండునో పరబ్రహ్మము నైతము ప్రణవవం దట్లేయుండును,

కావున ప్రణవ మిచట బ్రహ్మమునకు కోశస్థానముగా చెప్పఁబడింది) లౌకిక ప్రజ్ఞచేత అచ్ఛాదింపఁ బడితివి (అనగా సాధారణ ప్రజ్ఞగల వారలు నీమాహాత్మము నెఱుంగజాలరని తాత్పర్యము.) అట్టి నీవు శ్రవణ పూర్వకమగు ఆత్మజ్ఞానమును సంరక్షించుము. (అనగా రాగద్వేషా దికముచేత చిత్తము పరిభూతమగుటగాని లేక తదర్థ విస్మరణముగాని లేని విధమున నన్ను రక్షించుమని తాత్పర్యము. శరీరపాటవము లేని యెడల శ్రవణాద్యనుష్ఠానమునకే యోగ్యుడు కాఁజాలడు. వాగింద్రియము పరుష భాషణశీలమయిన యెడల శీలము సర్వదా ఏకాకారము కావున జ్ఞానోపదేష్ట యందును అట్టి పరుష భాషణము నుపయోగించుట సంభవము కావున జ్ఞానోపదేశము నైతము సంభవింపదు. కర్ణములకు చెవుఁడు తటస్థించిన గ్రంథశ్రవణమే సంభవింపదు. ఇట్లే అన్ని అవయవములకు గ్రహించు నది. ఇచ్చట జిహ్వాకర్ణశ్రవణములనే గ్రహించినను సర్వవిధ శరీరపాట వమునకు బోధకముగానే మనము గ్రహింపవలయును. కావున కండ్లు మొదలగు సకలావయవములు కూడ చక్కగా ఆయాక్రియల నిర్వహణ మునకు సమర్థములయి యుండవలయుననియే ఉపాసకుని అభిప్రాయము) ఈరెండు మంత్రములు మేధాకాముడు దేహారోగ్యకాముడు పఠింపవలసినవి, అని మొదటి మంటపములో ప్రణవ దేవతను ఆవాహనచేసి స్థాపనచేసి పూజించెదను. అని చెప్పవలయును.

మం॥ శ్రద్ధయాఽగ్ని స్సమిధ్యతే ।
శ్రద్ధయా విందతే హవిః ।
శ్రద్ధాం భగస్య మూర్ధని॥
వచసాఽఽవేదయా మసి॥
ప్రియగ్ం శ్రద్ధే దదతః॥

ప్రియగ్ం శ్రద్ధే దిదాసతః

ప్రియం భోజేషు యజ్వసు ।

ఇదం మ ఉదితం కృధి ।

యథా దేవా అసురేషు ।

శ్రద్ధా ముగ్రేషు చక్రిరే ।

ఏవం భోజేషు యజ్వసు । అస్మాక ముదితం కృధి ।

శ్రద్ధాం దేవా యజమానాః । వాయుగోపా ఉపాసతే ।

శ్రద్ధాగ్ం హృదయ్యయాఽఽకూత్యా ।

శ్రద్ధయా హూయతే హవిః ।

శ్రద్ధాం ప్రాతర్హవామహే । శ్రద్ధాం మధ్యం దినం పరి ।

శ్రద్ధాగ్ం సూర్యస్య నిమ్రుచి । శ్రద్ధే శ్రద్ధాపయేహ మా ।

శ్రద్ధా దేవా నధి వస్తే । శ్రద్ధా విశ్వ మిదం జగత్ ।

శ్రద్ధాం కామస్య మాతరమ్ । హవిషా వర్ధయామసి, ఇతి।

ద్వితీయ స్థండిలే శ్రద్ధామావాహయామి స్థాపయామి పూజయామి॥

అ॥ శ్రద్ధయా = శ్రద్ధచేతను, శ్రద్ధయనగా శాస్త్ర విషయములందు అధిక విశ్వాసముగల చిత్తవృత్తి దానియందభిమానముగల దేవతకూడ ఆపేరు గలదియే) అధిక విశ్వాపముగల అనన్యభక్తిచేత, అగ్నిః = ఈ యగ్నిహోత్రము, సమిధ్యతే = బాగుగ ప్రజ్వలింప చేయఁబడుచున్నది. హవిశ్చ = హవిస్సుకూడ (శ్రద్ధయా = శ్రద్ధచేత, విందతే = లభ్యమగుచున్నది, భగస్య = సౌభాగ్యము యొక్క, మూర్ధని = శిరస్సునందు, పైన ఉన్నటువంటి, శ్రద్ధాం = శ్రద్ధను, వచసా = వాక్యముచేత, ఆవేదయామసి = (జనుల యెదుట 'శ్రద్ధ సౌభాగ్యమునకు హేతువు' అను విషయమును) వెల్లడిచేయుదుము.

హేశ్రద్ధే = ఓ శ్రద్ధాదేవీ ! దదతః = ఇప్పుడు ఇచ్చుచున్న నా యొక్క, ప్రియం = ఇష్టము సిద్ధించుఁగాక. శ్రద్ధే = ఓ శ్రద్ధా! దిదాసతః = ఇటుపైనగూడ, ఇవ్వదలచియున్న నా యొక్క, ప్రియం = అభీష్టము నెరవేరుగాక, భోజేషు = భోగపరులగు జంతువుల విషయమునను, యజ్వసుచ = యజమానుల విషయమునను, ప్రియమ్ = అభీష్టము సిద్ధించుగాక ఇదం మే ఉదితం = యజమానులపట్ల నాకు అభీష్టము కల్గవలయునని చెప్పబడిన దానిని, కృధి = అధికముగా కల్గఁజేయుము.

యథా = ఏవిధముగా లోకములో దేవాః = దేవతలు, ఉగ్రేషు = తీవ్రస్వభావముగల, అసురేషు = రాక్షసులపట్ల, శ్రద్ధాం చక్రిరే = తప్పక ఈరాక్షసులు చంపఁదగినవారుఅనెడు దృఢాభిలాషను గల్గియుండిరో, ఏవం = ఇటులనే, భోజేషు = ఫల భోగములందు, యజ్వసుచ = వానిని సాధించునట్టి యజమానులయందును అభీష్టమును, ఉదితం కృధి = కల్గజేయుము,

హే దేవాః = ఓ ఇంద్రాది దేవతలారా! యజమానాః = ఈ యజమానులు, వాయుగోపాః = తమప్రాణములను రక్షించుకొనుచు, శ్రద్ధాం = శ్రద్ధను, ఉపాసతే = సేవించుచున్నారు, హృదయ్యయా = హృదయ శుద్ధిగల, ఆకూత్యా = సంకల్పక్రియచేత, శ్రద్ధాదేవికి అత్యాదరమున సేవించుచున్నారు. హవిః = హోమము కూడ, శ్రద్ధయా = శ్రద్ధగా, హూయతే = హోమము చేయఁబడుచున్నది.

శ్రద్ధాం = శ్రద్ధాదేవిని. ప్రాతః = ఉదయకాలమున, హవామహే = ప్రార్థనతో పిలుచుచున్నాము. (తథా = అటులనే) మధ్యందినం పరి = మధ్యాహ్నకాల సమీపమున గూడ, శ్రద్ధాం = శ్రద్ధాదేవిని, ప్రార్థనతో పిలుచుచున్నాము. సూర్యస్య = సూర్యుని యొక్క, నిమ్రుచి = అస్తమయ వేళఁగూడ, శ్రద్ధాం = శ్రద్ధాదేవిని, ప్రార్థనతోపిలుచుచున్నాము. హే శ్రద్ధే ఓ శ్రద్ధాదేవీ, ఇహ = ఈ కార్యమునందు, మాం = నన్ను శ్రద్ధాపయ = నమ్మకముగల వానినిగాఁజేయుము.

శ్రద్ధా = ఈ శ్రద్ధాదేవి, దేవాన్ అధివస్తే = ఈ దేవతలయందు నివసించియున్నది. విశ్వమిదం ఈజగమంతయు, శ్రద్ధా = శ్రద్ధామయమైయున్నది. (అభిలాషయు నమ్మకము లేకుండగా ఎవరును వ్యవహరింపరు గనుక). కామస్య మాతరం — కోరబడిన ఫలములను అనుగ్రహించునట్టి. శ్రద్ధాం = శ్రద్ధాదేవిని, హవిషా = ఈహవిస్సుతో వర్ధయామసి = వృద్ధిగల్గి సంతుష్టురాలినిగాఁ జేయుచున్నాము, చేయుచుందుము)

అని రెండవ మండపలో శ్రద్ధాదేవిని ఆవాహనచేసి స్థాపనచేసి పూజించుచున్నానని చెప్పవలెను.

తా॥ అధిక విశ్వాసముగల అనన్యభక్తితో అగ్నిని ప్రజ్వరిల్లఁజేయుచున్నాము. శ్రద్ధవలననే హవిస్సు లభించుచున్నది శ్రద్ధ సౌభాగ్యమునకు హేతువని ప్రకటించుచున్నాము. ఓ శ్రద్ధాదేవీ! ఇప్పుడు ఇచ్చ

చున్నపుడు, ముందు ఈయఁబోవునపుడును నాకు ఇష్టము సిద్ధించుగాక, భోగపరులగు జంతువులయు, యజమానులయు విషయమున అభీష్టము నెరవేరుగాక. అనుగ్రహింపుము. దేవతలు రాక్షసుల విషయమై ఈ రాక్షసుల సంహారము కావలయునని యెట్లు గట్టి శ్రద్ధగల్గి యుందురో అటులనే ఫల భోగములందు. అవి కల్గించు యజమానులయందును ఇష్టమును గల్గిఁ జేయుము.

ఓ ఇంద్రాది దేవతలారా ! ఈ యజమానులు తమ ప్రాణములను రక్షించుకొనుచు శ్రద్ధాదేవిని హృదయ శుద్ధి గల్గిన సంకల్పక్రియతో అత్యాదరముగల్గి సేవించుచున్నారు. హోమముగూడ శ్రద్ధతోఁ జేయుచున్నారు. శ్రద్ధాదేవిని త్రిసంధ్యలయందు ప్రార్థనచేసి పిలుచుచున్నాము. ఓదేవీ ! ఈ కార్యమునందు నాకు విశ్వాసము గల్గింపుము. ఈ శ్రద్ధాదేవి దేవతలెల్లరలోను నివసించియున్నది, ఈజగత్తంతయు శ్రద్ధామయమైయున్నది. అభిలాషయు విశ్వాసమును లేకుండగా ఎవరును వ్యవహరించలేరుగదా ! కోరిన కోర్కెలనన్నిటిని ప్రసాదించునట్టి శ్రద్ధాదేవిని హవిస్సుతో సంతుష్టురాలినిగా చేయుచు ఉన్నాము.

అని రెండవ మంటపములో శ్రద్ధాదేవిని అవాహనముచేసి స్థాపన చేసి పూజించుచున్నాను. అని చెప్పవలెను.

మం॥ మేధా దేవీ జుషమాణా న ఆగా ద్విశ్వాచీ
భద్రా సుమనస్యమానా । త్వయా జుష్టా జుషమ్మా
ణా దురుక్తా న్బృహ ద్వదేమ విదథే సువీరాః ।
త్వయా జుష్ట ఋషిర్భవతి దేవి త్వయా బ్రహ్మా

గతశ్రీ రుత త్వయా । త్వయా జుష్ట శ్చిత్రం విందతే
వసు సానో జుషస్వ ద్రవిణో నమేధే మేధాం మ
ఇంద్రో దదాతు మేధాం దేవీ సరస్వతీ । మేధాం మే
అశ్వినా ఉభా వాధత్తాం పుష్కర స్రజౌ । అప్సరా
సు చ యా మేధా గంధర్వేషు చ యన్మనః ।
దైవీం మేధా సరస్వతీ సామాం మేధా సురభి ర్జు
షతాగ్ స్వాహా॥ ఆమా మేధా సురభి ర్విశ్వరూపా
హిరణ్యవర్ణా జగతీ జగమ్యా । ఊర్జస్వతీ పయ
సా పిన్వమానా సా మాం మేధా సుప్రతీకా జు
షంతామ్ । మయి మేధాం మయి ప్రజాం మయ్య
గ్ని స్తేజో దధాతు మయి మేధాం మయి ప్రజాం
మయీంద్ర ఇంద్రియం దధాతు మయి మేధాం

మయి ప్రజాం మయి సూర్యో భ్రాజో దధాతు॥

ఇతి తృతీయస్థండిలే మేధామావాహయామి స్థాపయామి పూజయామి॥

అ॥ విశ్వాచీ = తెలిసికొనదగిన వన్నిటిని అవగాహన చేసికొనుట యందు సమర్థమయినదియు, భద్రా = కళ్యాణమునకు హేతువయినదియు, సుమనస్యమానా = అనుగ్రహముతో గూడిన మనస్సు గలదియు, జుషమాణా = సంతోషపెట్టఁబడుచున్నదియు నగు మేధాదేవీ = మేధాదేవత, నః = మమ్ములను, ఆగాత్ = చేరుగాక. హే దేవి ! ఓ దేవీ!(నీవు వచ్చుటకు పూర్వము) దురుక్తాన్ = పురుషార్థములకు నుపయోగింపని దుష్ట శబ్దములను, జుషమాణాః = సేవించుచు (తరువాత) వచ్చిన) త్వయా = నీచేత జుష్టాః = సేవింపఁబడిన, వయం = మేము, విదథే = జ్ఞాన ప్రకాశము గల్గిన మీదట, సువీరాః = మంచి పుత్ర శిష్యాదులతో గూడిన వారమై, బృహత్ = సర్వవక్తలకంటె గొప్పదయిన బ్రహ్మతత్త్వమును, వదేమ = చెప్పుటకు సమర్థులమై యుందుముగాక.

హే దేవి = ఓ మేధాదేవీ ! త్వయా = నీచేత, జుష్టః = అనుగ్రహింపఁబడిన పురుషుడు, ఋషిః = ద్రష్ట లేక మంత్రద్రష్టయగుచున్నాడు, త్వయా = నీచేత, జుష్టః = అనుగ్రహింపఁబడిన పురుషుడు, బ్రహ్మా భవతి = బ్రాహ్మణుడు అగుచున్నాడు లేక బ్రహ్మత్వమును పొందుచున్నాడు. ఉత = మఱియు, త్వయా = నీచేత, జుష్టః = అనుగ్రహింపఁబడిన పురుషుడు, ఆగతశ్రీః = పొందఁబడిన సంపదగలవాడు, భవతి = అగుచున్నాడు. (నీచే అనుగ్రహింపఁబడినవాడు) చిత్రం = వివిధమైన, వసు = ధనమును, విందతేచ = పొందుచున్నాడు కూడను. హే మేధే = ఓ మేధాదేవీ ! సా = అట్టి నీవు, ద్రవిణేన = మాకు ఈయఁదగిన ప్రశస్తమగు ధనముతో గూడ, నః = మమ్ములను, జుషస్వ = అనుగ్రహింపుము.

మే = నా కొఱకు, ఇంద్రః = ఇంద్రుడు, మేధాం = మేధను. దధాతు = ఇచ్చుగాక, సరస్వతీ దేవీచ = సరస్వతీదేవియును, మేధాం = మేధను, దదాతు = ఇచ్చుఁగాక. పుష్కరస్రజా = సరోజమాలతో గూడియున్న, ఉభౌ అశ్వినౌ = అశ్వినీదేవత లిర్వురును, మే = నాకు, మేధాం = మేధాశక్తిని, ఆధత్తామ్ = కలుగఁజేయుదురుఁగాక.

యాచ మేధా = ఏమేధ, అప్సరాసు = అప్సరస్త్రీలలో, వర్తతే = ఉన్నదో, యాచ = ఏమేధ, గంధర్వేషు = గంధర్వులయందు, మనః = మనన సామర్థ్యరూపమున గాని, ధైర్యరూపమున గాని యున్నదో: యాచ సరస్వతీ = వేదశాస్త్రరూపమైన యే సరస్వతి, దైవీ = దేవతలయందున్నదో, సురభిః = శోభనమైనఖ్యాతిగలదియు, అన్నికోరికలను ఇచ్చునది యునగు, సామేధా = అట్టిమేధాశక్తి (దేవత)మాం = నన్ను జుషతామ్ = సేవించుగాక.

సురభిః = సురభియైనదియు, విశ్వరూపా = సర్వవస్తువులను నిరూపించుటయందు నేర్పుగలదియు, హిరణ్యవర్ణా = హితము రమణీయము నగు స్వభావము గలదియు లేదా ప్రకాశించు అక్షరములు గలదియు, జగతీ = అంతటను అడ్డులేక ఉంటూన్నదియు, జగమ్యా = పురుషార్థకామము లచే పొందఁదగినదియు, ఊర్జస్వతీ = వాసనాబలములుగలధియు, సరస్వతీ = సరస్వతి యైనదియు, పయసా = క్షీరాదులతో, మాం = నన్ను, పిన్వమానా = తడుపుచున్నదియునగు, సామేధా = ఆమేధాదేవి, ఆ = వచ్చి, సుప్రతీకా = మంచి ఉపక్రమముగలదై, మాం = నన్ను, జుషతామ్ = ఎల్లప్పుడును అనుగ్రహించుఁగాక. ఎల్లప్పుడును నాయందే యుండుగాక.

అగ్నిః = అగ్ని, మయి = నాయందు. మేధాం = మేధాశక్తిని మయి = నాయందు, ప్రజాం = అవిచ్ఛిన్నమగు సంతతిని, మయి = నాయందు, తేజః = బ్రహ్మవర్చస్సును, వీర్యపుష్టిని, దధాతు = కలుగఁజేయుఁగాక.

ఇంద్రః=ఇంద్రుడు, మయి=నాయందును, మేధాం=మేధాశక్తిని,మయి= నాయందు,ప్రజాః=అనిచ్ఛిన్నమగు సంతతిని. మయి=నాయందు, ఇంద్రియం=వీర్యపుష్టిని, దధాతు = కల్గఁజేయుఁగాక. సూర్యః = సూర్యుడు. మయి= నాయందు మేధాం=మేధాశక్తిని,మయి=నాయందు, ప్రజాం = అవిచ్ఛన్న మగు సంతతిని, మయి=నాయందు భ్రాజః = శత్రుభీకరమైన ప్రతాపమును, దధాతుక = ఉంౘఁజేయుసుఁగాక,

అని మూడవ మంత్రమున మేధాదేవిని ఆవాహనచేసి స్థాపనచేసి పూజచేసెదను. అని చెప్పెను.

తా॥ సర్వశక్తి సంపన్నయు, భద్రయు, అనుగ్రహముగల మనస్సు గలదియు, సంతోషకరియునగు ఓ మేధాదేవతా : మమ్ము నీవు చేరుగాక. ఓదేవీ ! దుష్ట శబ్దములుగల మేము నిన్ను సేవించి నీవలన ప్రకాశము నొంది మంచి పుత్రశిష్యాదులుగల వారమై అందరికంటె గొప్పగా బ్రహ్మతత్త్వమును బోధించుశక్తి గల వారమగుదుము గాక,

ఓ మేధాదేవీ ! నీచే అనుగ్రహింపఁబడిన పురుషుడు మంత్రద్రష్ట కాగలడు; బ్రాహ్మణుడు అవగలడు; లేక బ్రహ్మత్వమును పొందగలడు. సంపన్నుడు కాగలడు; వివిధ ధనములను పొందఁగలడు, ఓ మేధాదేవీ : నీవు ప్రశస్తమగు ధనము నొసగి మమ్ము ననుగ్రహింపుము,

ఇంద్రుడు, సరస్వతీదేవి, అశ్వినీదేవతలును నాకు మేధాశక్తిని గల్గఁజేయుదురుగాక.

ఏమేధ అప్సరసలలో నున్నదో, ఏది గంధర్వులయందు మనన సామర్థ్యముగా గాని ధైర్యముగా గాని యున్నదో, వేదశాస్త్ర రూపిణియగు ఏ సరస్వతి, దేవతలయందున్నదో, యశస్సును, కోరికలను ఇచ్చునట్టి ఆమేధాదేవత నన్ను అనుగ్రహించుగాక,

ఆమేధాదేవత పరిమళమువలె అంతటను ఉండును. సర్వవస్తువులను నిరూపించు శక్తిగలది. హితరమణీయ శీలము గలది, లేదా ప్రకాశమానా క్షరములు గలది, అంతటను నిరాఘాటముగ నుండునది, పురుషార్థకామము లచే పొందఁదగినది, వాసనాబలములు గలది, సరస్వతి యైనదియు, క్షీరాదు లతో నన్ను తడుపుచున్నది, మంచి ఉపక్రమము గల్గియున్నదియు నగు అట్టి మేధాదేవి సదా నాయందుండి నన్ననుగ్రహించుగాక.

అగ్ని యింద్రుడును సూర్యుడును నాకు మంచి మేధాశక్తిని అవిచ్ఛిన్న సంతానమును, బ్రహ్మవర్చస్సును, వీర్యపుష్టిని. శత్రుభీకరమైన ప్రతాపమును కలుగఁజేయుదురుగాక. అని చెప్పి మూడవ మంటపమున మేధాదేవతను ఆవాహనచేసి స్థాపనచేసి పూజించుచున్నాను అని చెప్ప వలెను.

సూ॥ ప్రణవశ్రద్ధా మేధా దేవతాభ్యో నమః ।
ధ్యానావాహనాది షోడశోపచారపూజాం కుర్వన్
అపూప సహిత కృసరాన్నం చ నివేదయేత్ ।

ప్రణవదేవతకు శ్రద్ధాదేవతకు మేధా దేవతకును నమస్కారము చేయవలయిను. ధ్యానము, ఆవాహనము మొదలగు 16 ఉపచారములతో పూజను చేయుచు అప్పములతో ఖుఖాన్నమును నైవేద్యము పెట్ట వలయును

ప్రణవ శ్రద్ధా మేధాదేవతాః
సుప్రీతా స్సుప్రసన్నా వరదా భవంతు॥

ప్రణవ వతయు శ్రద్ధాదేవతయు మేధాదేవతయు సుప్రీతి సుప్ర సన్నతయు గలవారై వరముల నిచ్చువారగుదురు గాక అని చెప్పవలెను.

ఆచమ్య.........ఏవంగుణ.... ...
శుభతిథౌ మమ కుమారస్య
(ప్రణవ శ్రద్ధా) మేధా జనన సి
ద్ధ్యర్థం పాలాశహోమం కరిష్యే॥

ఆచమనముచేసి సంకల్పము చెప్పి నాకుమారునకు (ప్రణవ శ్రద్ధా) మేధా దేవతానుగ్రహము గల్గుటకు పాలాశహోమమును చేసెదను అని చెప్పవలయును.

అగ్నిం ప్రజ్వాల్య షట్పాత్ర ప్రయోగం కుర్యాత్।
అగ్నిని ప్రజ్వరిల్లఁజేసి షట్పాత్ర ప్రయోగమును చేయవలెను.
అగ్నిం ధనాది ఆజ్య భాగాంత పర్యంతం కుర్యాత్॥

అగ్ని ఇంధనము మొదలుకొని ఆజ్యభాగము చివరవరకు చేయవలెను.

యశ్ఛంద సామిత్యేకాదశ
ఆజ్యాహుతీః కుమారగ్ం హావయిత్వా॥

'యశ్ఛందసాం' మొదలగు మంత్రములతో పదునొకండు ఆజ్య హోమములు కుమారునిచే చేయించవలెను.

మంత్రమున్ను కుమారుడే; అన్నిటికిని 'ఛందోభ్య ఇదం నమమ అని త్యాగము చేయవలయును.

మం॥ యశ్ఛం దసా మృషభో విశ్వరూపః

ఛందోభ్యోఽధ్య మృతా త్సం బ భూవ।

సమేంద్రో మేధయా స్పృణోతు । అమృతస్య

దేవ ధారణో భూయాసగ్గ్ స్వాహా॥

ఛందోభ్య ఇదం నమమ॥

అ॥ అని హోమము చేయించవలెను.

అర్థతాత్పర్యములు చెప్పఁబడినవి.

మం॥ శరీరం మే విచర్షణం। జిహ్వా మే మధు మత్తమా।

కర్ణాభ్యాం భూరి విశ్రువమ్। బ్రహ్మణః కోశోఽసి మేధ

యా పిహితః । శ్రుతం మే గోపాయ స్వాహా॥

ఛందోభ్య ఇదం నమమ॥

అ॥ అని హోమము చేయించవలెను.

అర్థతాత్పర్యములు వ్రాయఁబడినవి.

మం॥ ఆవహంతీ వితన్వానా । కుర్వాణా చీర మాత్మనః।

వాసాగ్ంసి మమగావశ్చ । అన్నపానే చ సర్వదా ।

తతో మే శ్రియమావహ। లోమశాం పశుభి స్సహ స్వాహా॥

ఛందోభ్య ఇదం నమమ॥

అని హోమము చేయించవలెను.

అ॥ శ్రీకాముడు హోమము చేయవలసిన మంత్రములు.

తతః = మేధను కలుగఁజేసిన తర్వాత, ఆత్మనః = నాకు, వాసాంసి = వస్త్రములను. గావః చ = గోవులను, అన్నపానేచ = అన్నపానీయములను, సర్వదా = ఎల్లప్పుడు, ఆవహంతీ = సంపాదించుచున్నదై, (అటుల సంపాదించిన వానిని) వితన్వానా = విస్తరింపఁ జేయుచున్నదై, (అటుల విస్తరింపఁ జేసిన దానిని) చీరం = దీర్ఘకాలముండు దానిగా, కుర్వాణా = చేయుచున్నట్టి, (ఏ సంపదగలదో అట్టి) లోమశాం = అజాది విశిష్టమైన శ్రియం = సంపదను. పశుభిఃసహ = పశువులతోఁ గూడ, (ఓ ప్రణవమా !) మే = నాకు, ఆవహ = పొందింపుము. స్వాహా = స్వాహాపదమిచట హోమార్థమయిన మంత్ర మిది యని సూచించుటకుగాను చెప్పఁబడినది.

తా॥ ఓ ప్రణవమా ! నాకు మేధను శరీరపాటవమును కలుగఁజేసిన మీదట అన్నపానీయములను, గోవులను, వస్త్రములు మొదలగు వానిని కలుగఁజేయుచు అట్టి వానిని వృద్ధిచేయుచు ఆవృద్ధిచేసిన వానిని చిరకాలముండునటుల చేయునట్టి సంపదను గూడ నాకు గలుగఁజేయుము. కేవలము గోవులు మాత్రమే గాక మేకలు, గొఱ్ఱెలు మున్నగు పశువులు గూడ నాకు కలిగియుండుగాక యని తాత్పర్యము. (మేధ లేని వానికి సంపదలున్న యెడల వాడు దుష్టుడై దుర్వ్యయముల నొనర్చి చెడిపోవును కావున మేధను కలుగఁ జేసిన తరువాతనే సంపదను కలుగఁ జేయుమనియు. సంపదలేని యెడల చిత్తశుద్ధికయి ఆచరించవలసిన యాగాద్యనుష్ఠానము సైతము ఆచరింపవలను పడదు కావున మేధను కలుగఁజేసిన పిదప అవశ్యము సంపదను కూడ నొసంగుమని తాత్పర్యము.

I H

మం॥ ఆ మా యంతు బ్రహ్మచారిణ స్వాహా॥

ఛందోభ్య ఇదం నమమ॥

అని హోమము చేయించవలెను.

అ॥ బ్రహ్మచారిణః = విద్యార్థులగు బ్రహ్మచారులు, మా = నన్నుఁ గూర్చి, ఆయంతు = వచ్చెదరు గాక.

మం॥ యశో జనేఽసాని స్వాహా॥

ఛందోభ్యం ఇధం నమమ॥

అని హోమము చేయించవలెను.

అ॥ జనే = జనులయందును, యశః = యశస్సుగలవాడను, అసాని = అయ్యెదను గాక.

మం॥ శ్రేయాన్ వస్య సోఽసాని స్వాహా॥

ఛందోభ్య ఇదం నమమ॥

అని హోమము చేయవలెను.

అ॥ వస్యసః = ధనికుని కంటె, శ్రేయాన్ = శ్రేష్ఠుడను, అసాని = అయ్యెదను గాక.

మం॥ తం త్వా భగ ప్రవిశాని స్వాహా॥

ఛందోభ్య ఇదం నమమ॥

అని హోమము చేయించవలెను.

అ॥ భగ = పూజ్యమైన ఓ ప్రణవమా ! తం = (ఆబ్రహ్మకు కోశభూతమైన) ఆ, త్వా = నిన్ను, ప్రవిశాని = ప్రవేశించి తత్స్వరూపుడ నయ్యెదను.

మం॥ సమా భగ ప్రవిశ స్వాహా॥

ఛందోభ్య ఇదం నమమ॥

అని హోమము చేయించవలెను.

అ॥ భగ=పూజ్యమైన ఓ ప్రణవమా ! సః = ఆ ప్రసిద్ధమైన నీవు. మా=నన్ను. ప్రవిశ = ప్రవేశించుమా !

మం॥ తస్మిం త్స హస్ర శాఖే । ని భగాహం

త్వయి మృజే స్వాహా॥

ఛందోభ్య ఇదం నమమ॥

అని హోమము చేయించవలెను.

అ॥ భగ = పూజ్యమగునో ఓంకారమా ! సహస్రశాఖే = శివ విష్ణ్వాది రూపభేదములు గలదానివలెఁగనఁబడు. తస్మిన్ = ఆ. త్వయి = నీయందు. (ప్రణవమునందు) అహం = నేను, ప్రాపకృత్యాం = నే నొనర్చిన పాపకార్యమును) నిమృజే = ప్రక్షాళనము చేసికొనుచున్నాడను.

మం॥ యథాఽఽపః ప్రవతా యంతి । యథా మాసా

అహర్జరమ్ । ఏవం మాం బ్రహ్మచారిణః । ధా త

రాయ న్తు సర్వత స్వాహా ॥

ఛందోభ్య ఇదం నమమ॥

అని హోమము చేయించవలెను.

అ॥ ఆపః = ఉదకములు, ప్రవతా = పల్లమైనదిగా, యథా = ఏవిధముగా, మాసాః = మాసములు, అహర్జరం = సంవత్సరమునీగూర్చి (గచ్ఛంతి = పోవుచున్నవో) ఏవం = ఈ విధముగా, ధాతః = సర్వజగత్కారణమగు ఓ ప్రణవమా ! బ్రహ్మచారిణః = బ్రహ్మచారులు, మా = నన్నుగూర్చి, సర్వతః = అంతటనుండి, ఆయంతు = వచ్చెదరుగాక.

మం॥ ప్ర తి వే శో౽సి ప్రమా భాహి ప్రమాపద్యస్వ

స్వాహా ॥

ఛందోభ్య ఇదం నమమ ॥

అని హోమము చేయించవలెను.

అ॥ (ఓ ప్రణవమా ! నీవు) ప్రతివేశః = సమీపమునందున్న గృహము (అనగా గృహమువలె సకలదుఃఖ నివారకమని యర్థము), అసి = అయితివి, మా = నన్ను, ప్రభాహి = ప్రకాశింపఁజేయుమా ! మా = నన్ను, ప్రపద్యస్వ = పొందుమా !

తా॥ విద్యాభిలాషులైన బ్రహ్మచారులు నన్నుగూర్చి వచ్చెదరుగాక. శాంతచిత్తులగు బ్రహ్మచారులు నాసమీపమునకు వచ్చెదరుగాక.

(ఈ మంత్రమునకు మొత్తముగా కలిసి అనేకసంఖ్యలుగల విద్యార్థి బృందము నా సమీపమునకు వచ్చుగాక అని ఒకరి మతము)

'ఈయాచార్యు డెందరినో విద్యావంతుల నొనర్చినాడు' అనెడు కీర్తి విశేషమును జనసమూహమునందు నేను పొందెదనుగాక.

ఐశ్వర్యవంతునికంటె అతిశయమైన మాన్యతగలవాడ నయ్యెదనుగాక.

(ఇదివఱకుఁ జెప్పఁబడిన మంత్రములందు మేధాప్రాప్తి ఐశ్వర్య ప్రాప్తి మున్నగు సకలేప్సితములను కోరియున్నాడు. ఇప్పుడీ మంత్రము నందు విద్యాప్రాప్తికిని ఐశ్వర్యాదికమునకును ప్రయోజనభూతమగు ఓంకారవాచ్య బ్రహ్మముతోడ ఐక్యమును ప్రార్థించుచున్నాడు.)

ఓ పూజ్యమయిన ప్రణవమా! నేను పరబ్రహ్మమునకు కోశభూతమగు నిన్ను ప్రవేశించుచున్నాడను. బ్రహ్మకు కోశభూతమగు నీవున్నూ నన్ను ప్రవేశించుము. అనగా పరబ్రహ్మమునకు కోశభూతమగు తత్స్వరూపుడనే అయ్యెదను. నీవున్నూ నన్ను ప్రవేశించుము అనగా మనకిద్దరకు భేదమున్నదని తలంచెడి అజ్ఞానమును సమూలముగా నిర్మూలనము చేయుమని భావము.

ఓ పూజ్యమగు ప్రణవమా! శివవిష్ణ్వాద్యనేక రూపములు (లేక పెక్కువేదశాఖలు) గల నిన్ను స్మరించి నా పాపములను పోగొట్టుకొనియెదను,

నీళ్ళు పల్లపు ప్రదేశమునకు ఎట్లుపోవునో, మాసములు సంవత్సరమునుగూర్చి యెట్లుపోవునో అదేవిధముగా ఓ ప్రణవమా! నా సమీపమునకు అధ్యయనార్థము నలుదిక్కులనుండి బ్రహ్మచారులందఱు వచ్చెదరు గాక.

ఓ ప్రణవమా! నీవు నిన్నుపాసించువారలకు సమీపమునందున్న గృహమువంటిదానవు, అనగా గృహమువలె సకలదుఃఖములను నివారించుదానవు. కావున ఆత్మతత్త్వమును నాకు ప్రకాశింపఁజేయుము.

(నీ నిష్ఠయే సంసారశ్రమాపనోదన క్షమమయినది కావున ఆత్మస్వరూపమును వాస్తవముగా ప్రకాశింపఁజేయుమని భావము.) నన్నుగూడ పొందుము. (రసవిద్ధమయిన లోహము రసమయిన విధముగా నన్నుపొంది నన్నుగూడ తన్మయుని చేయుమని భావము).

జ్ఞాపిక : విద్యాప్రకరణమునందు శ్రీకాముని గుఱించి చెప్పుటధనార్థమని గ్రహించవలయును. ఆ ధనము శాస్త్రీయ విహితకర్మల నాచరించుట కొఱకనియు, విహితకర్మలు ఉపాత్త దురితక్షయార్థమనియు, దురితక్షయమయిన పిదప జ్ఞానోత్పత్తి కలుగుననియు శ్రీమదాచార్యులువారు భాష్యమునందు చెప్పి ఇందులకు ప్రమాణముగ శ్రీమన్మహాభారతము శాంతి పర్వమునందుగల మోక్షధర్మములోని ఈ క్రింది శ్లోకము నుదహరించిరి—

శ్లో॥ జ్ఞానముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః।
యథాఽఽదర్శతల ప్రఖ్యే పశ్యత్యాత్మాన మాత్మని ॥
(భార. మోక్ష. 204-8)

సూ॥ ఇధ్మసన్నహనాన్యద్భి స్సృగ్ స్పృశ్యఅగ్నౌ ప్రహరతి ।
రుద్రాయ తంతి చరాయేదం నమమ ॥

సమిధల ప్రోగులను నీటితోముట్టుకొని అగ్నిలో వేయవలెను రుద్రుడగు తంతిచరునకు ఇది అర్పితమగుగాక ; నాకుగాదు. అని హోమము చేయవలెను.

అప ఉపస్పృశ్య॥

నీరు ముట్టుకొనవలయును. (ముట్టుకొని)

సూ॥ అస్య కర్మణః హోమ ప్రతిష్ఠా సిద్ధర్థ మృద్ధికామః
జయాది హోమం కరిష్యే॥

అ॥ ఈ కర్మకు హోమ ప్రతిష్ఠ సిద్ధించుటకు ఐశ్వర్యమును కోరువాడనై జయాది హోమములను చేసెదను - అని చెప్పవలయును.

మూ॥ స్రువేణాజ్యమాదాయ

స్రువముతో ఆజ్యమును తీసికొనవలెను.

ఓం చిత్తం చ స్వాహా....

ఈమాటలు పలికి.

జయాది బ్రహ్మ విసర్జనాంతే

జయ మొదలుకొని బ్రహ్మ విసర్జనము వఱకు చెప్పి చివర

స్వస్తి శ్రద్ధాం మేధాం

.... .... .... .... .... ....

అహం భో అభివాదయే॥

"స్వస్తి శ్రద్ధాం మేధాం" మొదలుకొని "అహం భో అభివాదయే" వఱకు చెప్పవలెను.

అనేన పాలాశ హోమేన భగవాన్ సర్వాత్మకః
శ్రీ యజ్ఞేశ్వర స్సుప్రీణాతు । సర్వం
శ్రీ యజ్ఞేశ్వరార్పణమస్తు॥

ఈ పాలాశ హోమముచేత భగవానుడు సర్వాత్మకుడునగు శ్రీ యజ్ఞేశ్వరుడు సుప్రీతి గల్గియుండుగాక. అంతయు శ్రీయజ్ఞేశ్వరున కర్పణ మగుగాక.

అపరేణాగ్నిం వటుః వస్త్ర మేఖలాజినం
దండాగ్శ్చ పాలాశే స్థాప్య

అగ్నికి మరొకవైపు వటువు వస్త్రమును మేఖలను అజినమును దండమును మోదుగుచెట్టుమీద నుంచవలెను.

అన్యాని నూతన వస్త్రాణి ధారయేత్॥

ఆవస్త్రమును గురువున కిచ్చి ఇతరములైన నూతన వస్త్రములను ధరించవలెను,

## ధారణ విధానమ్ ధారణ విధానము

ఆచమ్య

ఆచమనము చేయవలెను. (చేసి)

'సుశ్రవ' ఇతి మంత్రేణ అన్య దండ మాదాయ

'సుశ్రవ' అను మంత్రముతో మరొక దండమును తీసికొనవలెను. (తీసికొని)

"దేవత_స్త్వేతి" ద్వాభ్యాం వాసోఽభిమంత్ర్య

"రేవతీస్త్వా"అను రెండు మంత్రములతో వస్త్రమును అభిమంత్రింప వలెను. (అభిమంత్రించి)

"యా అకృంతన్న వయన్నితి" తిసృభిః వాసః పరిధాప్య

"యా అకృంతన్నపయన్" అను మూడు మంత్రములతో వటువు నకు బట్ట కట్టవలెను, (కట్టి)

ఆచమ్య

ఆచమనము చేయవలెను. (చేసి)

ఆచార్యః "పరీదమి"తి
పరిహితం కుమారమభి మంత్రయతే॥

ఆచార్యుడు 'పరీదం' అను మంత్రముతో కుమారుని అభిమంత్రింప వలయును.

"ఇయం దురు_క్తేతి" ద్వాభ్యాం మేఖలాం ధారయిత్వా॥

"ఇయం దురుక్తా" అను రెండు మంత్రములతో మేఖలను ధరింప చేయవలయును.

బ్రాహ్మణాన్ భోజయిత్వా ।

బ్రాహ్మణులకు భోజనము పెట్టవలెను.

కర్మణః పుణ్యాహం కృత్వా

సహాచార్యః గృహమాగచ్ఛేత్ ।

పుణ్యాహకర్మను చేసి వారితో కలిసి ఆచార్యుడు ఇంటికి రావలెను.

బ్రాహ్మణాశీర్వాదః

ఇంటికి వచ్చి బ్రాహ్మణులచే ఆశీర్వాదము చేయించవలెను.

ఉపనీతస్య ధర్మా ఉపదిష్టాః)

వటువునకు ధర్మములు ఉపదేశింపబడినవి.

హరిః ఓం తత్సత్

సమాప్తము

# బ్రహ్మచర్య ధర్మములు

త్రయోవర్ణా ద్విజాయతః అనగా బ్రహ్మణ క్షత్రియ వైశ్యులు ద్విజాతులు లేక ద్విజులు అని యర్థము, త్రైవర్ణికులకు ఉపనయనము అయినది మొదలు బ్రహ్మచర్యవ్రతము ప్రారంభమగును. ఈ వ్రతమందు సుమారు 25 సంగరములు గడుపవలయును. బ్రాహ్మణులకు 8 వ, క్షత్రియులకు 11 వ, వైశ్యులకు 12 వ సంగరములలో ఉపనయనము చేయవలెను. గర్భోత్పత్తి మొదలు సంగరములను గణింపవలెను.

వేదవిద్యనభ్యసించుట వేదమూలమున సద్గురుసమీపమున జరుపబడు. సంస్కారమును "ఉపనయనము" అందురు. ఈ సమయమున గాయత్రీ మంత్రమును ఉపదేశింతురు. "నగాయత్ర్యాః పరో మంత్రః" అన్నారు గదా! గాయత్రితో సమమైన మంత్రము మరొకటిలేదు. గాయత్రి మహిమను మహర్షులు స్మృతులలోను పురాణములలోను సహస్రముఖాలతో కీర్తించియున్నారు. ఇతరములయిన విద్యాతపస్సులు బ్రాహ్మణునకు ఏవి లేకపోయినను గాయత్రీ జపమున్నచో ఆతడు దుష్టబ్రాహ్మణుడు కాకుండ రక్షింపఁబడునని చెప్పుటచేతనే గాయత్రికి ఎంతయో మహిమ గలదని తెలియుచున్నది.

"గాయత్రీ మాత్రసారోఽపి న చదుర్బ్రాహ్మణో భవేత్ ।"

ఉపనయనమైన తర్వాత ద్విజుడు గురుకులమున 12 సంవత్సరములు బ్రహ్మచర్యమును నడపుచు ఒక వేదమునైనను పూర్తిచేయవలయును.

సూ॥ ద్వాదశవర్షాణ్యేకవేదే బ్రహ్మచర్యం చరేత్ ।

(గౌ. ధ. సూ. 2-51)

ఒక్కొక్క వేదములో 12, 12 సం॥ములు చొప్పున బ్రహ్మచర్యము జరుపవచ్చును. కాని యది విధి కాదు. మఱియు ఋషులమతమున కలియుగములో దీర్ఘ బ్రహ్మచర్యము పనికిరాదు. కాబట్టి 12 సం॥రములే బ్రహ్మచర్యముచాలును, దీనినిబట్టి బ్రాహ్మణుడు కనీసము 20 సం॥రముల వయస్సులోను, క్షత్రియుడు 23 సం॥రముల వయస్సులోను, వైశ్యుడు 24 సం॥రముల వయస్సులోను వివాహము చేసికొనుట శాస్త్రసమ్మతమని తెలియును. శూద్రుడు గురుకులమున కేగనక్కరలేదు. కావున ఆయుర్దాయములో నాల్గవవంతు అనగా 25 ఏండ్ల వయస్సు వఱకు ఆతడు అవివాహితుడుగానుండి పిమ్మట వివాహమాడవలయును.

బ్రహచర్యాశ్రమములో బహు ప్రయోజనములు సాధింపవలసి యున్నవి.

1) ద్విజులు వేదమునభ్యసించుట ఇతరులుపురాణేతిహాసముల పఠించుట.

2) ఇంద్రియముల నిగ్రహించుట నలవఱచుకొని మనస్సును పరమార్థ జీవితమున కనుకూలముగాఁ జేసికొనుట.

3) శరీరమును భోగపరము కాకుండ సహించుదానిగాఁ జేసికొనట,

4) శారీరిక తేజస్సును వృద్ధినొందించుట.

5 దీర్ఘాయుష్యమునకు తగిన అవకాశములను వృద్ధినొందించుకొనుట.

వీటి ఫలితములను మానవుడు గృహస్థాశ్రమములో చక్కగా అనుభవింప గల్గును. గృహస్థాశ్రమములో భోగములను తగినరీతిననుభవించుటకును, భోగములలోఁబడి ధర్మమును విస్మరింపకుండుటకు, వివేకియై లౌకికవైదిక ధర్మములను నిర్వర్తించుటకును బ్రహ్మచర్యాశ్రమము యొక్క శిక్షణము సహకరించును.

బ్రహ్మచర్యాశ్రమములో ఉపర్యుక్తమైన శారీరిక మానసిక సాధనకంగములుగ నియమములనేకములు గలవు.

1) బ్రహ్మచారి వాఙ్నియమము గల్గియుండవలెను.

2) ,, చేష్టానియమము గల్గియుండవలెను.

3) ,, ఉదర నియమము గల్గియుండవలెను.

4) ,, అత్యవసరమైన సత్యవాక్యమునే పల్కవలెను.

5) ,, తనకర్తవ్యమునకు మించిన యేపనిలోను జోక్యము కల్గించుకొనరాదు.

6) ,, సత్త్వగుణవర్ధకమగు నాహారమునే మితముగనే తిన వలయును.

సూ॥ వాగ్బాహూదరసం యమః । (గౌ. ధ. 2-27)

7) బ్రహ్మచారి భిక్షచేసి యాహారము తెచ్చుకొని దానిని గురువునకు చూపి యాతని యనుజ్ఞనుగైకొని భుజింపవలయును.

సూ॥ నివేద్య గురవేఽనుజ్ఞాతో భుంజీత । (గౌ. ధ 2-15)

8) ఉప్పు, పులుపు. కారము మున్నగు రజోగుణ ప్రకోపకములైన పదార్థములను భుజింపరాదు.

9) మత్తు గల్గించునే పదార్థమును సేవింవరాదు.

10) మాంసమును భక్షింపరాదు,

సూ॥ యథా క్షౌరలవణ మధుమాంసానీతి ।

(ఆ. ధ. సూ. 1-4-6)

11) గంధమాల్యాది సుగంధ వస్తువులను ధరింపరాదు.

12) పగలు నిద్రపోరాదు.

13) కాటుకపెట్టుకొనుట మొదలగు శృంగార విషయములను వీడ వలయును.

14) తైలాభ్యంగము చేయరాదు.

15) విలాసార్థమై బండి మొదలగు వాహనముల నధిష్ఠింపరాదు.

16) చెప్పులను తొడగరాదు.

17) కామమును దరి చేరనీయరాదు.

18) క్రోధమునకు దూరుడు కావలయును.

19) దేనియందును లోభమును పొందరాదు.

20) వివేకమును వీడరాదు.

21) వదరుబోతుగా నుండరాదు.

22) వీణా వాదనాదుల యందనురక్తుడు కారాదు.

23) ఉష్ణోదకముతో స్నానము చేయరాదు.

24) సుగంధాదులచే విలాసముగా దంతధావనాదులు చేయరాదు.

25) దేనిని చూచినను సంతోషముతో పొంగిపోరాదు.

26) నృత్యగానములందు సక్తుడు కారాదు.

27) పరుల దోషముల నెంచరాదు.

28) ప్రమాదముల చెంత పోరాదు.

29) ఈ విషయములనే గౌతమధర్మసూత్ర మిట్లు చెప్పుచున్నది :-

సూ॥ వర్జయేన్మధుమాంసగంధమాల్యదివాస్వప్నాం
జనాభ్యంజన యానోపానచ్ఛత్ర కామక్రోధ లోభ
మోహవాదవాదన స్నాన దంతధావన హర్ష నృత్త
గీత పరీవాదభయాని॥ (గౌ.ధ. 2-18)

30) బ్రహ్మచారి యిట్టి నియమములుగలవాడై. భిక్షచే జీవించుచు సాయం ప్రాతఃకాలములం దగ్నికార్యము చేసికొనుచుండవలయును,

సూ॥ అగ్నీంధన భైక్షచరణే। (గౌ.ధ. 2-11)

31) సంధ్యావందనమును గ్రామముయొక్క బయటకుపోయి చేసికొనవలయును.

సూ॥ బహిః సంధ్యత్వంచ ।

32) బ్రహ్మచారి ప్రధానముగ చేయవలసిన ధర్మము రేతస్సంరక్షణము. ఆ ధర్మము చెడినచో బ్రహ్మచర్యవ్రతము చెడినట్లే.

శ్లో॥ కామాద్ధి స్కందయన్ రేతో
హినస్తి వ్రత మాత్మనః । (మను. 2-103)

అట్లు బ్రహ్మచర్యము పోగొట్టుకొన్నవారికి అవకీర్ణియని పేరు. అవకీర్ణికి ఘోరములైన ప్రాయశ్చిత్తములు విధింపఁబడినవి.

కాబట్టి బ్రహ్మచర్యమునకు భంగముకల్గించు ప్రసక్తులన్నియు బ్రహ్మచారికి నిషేధింపఁబడినవి. శృంగారవిషయమునకు సంబంధించినవన్నియు పరిహరించవలసినవే.

33) చివరకు వటువు అద్దములో తనముఖమును చూచుకొనుటకూడ నిషిద్ధమైయున్నది.

34) బ్రహ్మచారి స్త్రీలముఖమును చూడరాదు; వారితో సంభాషింపరాదు.

35) బ్రహ్మచారి అధ్యయనము చేయునపుడు గురుదక్షిణ నేమియు నీయనక్కరలేదు.

ప్రాచీన భారతఖండములో ప్రజలు ఉచిత భోజనసౌకర్యము చేసెడివారు. గురువు నిరపేక్షముగ చదువుచెప్పి యువకులను విద్యాసంపన్నులను చేసెడివాడు.

పేదవాని కుమారుడైనను మహాపండితుడు కావచ్చును. ప్రస్తుత కాలములో నవనాగరికత యెక్కువయినది.

ఇది యొకరకముగా దుష్కాలము. ఇప్పుడున్న సంఘవ్యవస్థ అట్టి సదుపాయములేవియు లేవు.

వర్తమానకాలములో ధనికుని బిడ్డనికే ఉన్నత విద్యావకాశముకాని పేదవాని బిడ్డకు లేదు.

వెనుకటికాల మిప్పటివలె కాక ప్రధానవిషయములలో సంఘ సమత్వముండెడిది.

గురుకులములో బ్రహ్మచారుల మధ్య పూర్ణ సామ్య వ్యవస్థయుండెను. మహారాజు బిడ్డడు తన యంతఃపురసౌధము దిగివచ్చి, బిచ్చగాని బిడ్డతోఁగలిసి గురుకులమున చేరుట, యాతనివలెనే జోలికట్టి బిక్షమెత్తికొని నియమముల పాటించుట, కటికనేలను శయనించుట – ఈ పనులు జరుపుచు, కాలక్షేపము చేయుచుండెడివాడు.

ప్రస్తుతము మనదేశమున పూర్వపద్ధతి విద్యావిధానములేదు. అయినను పైనచెప్పిన బ్రహ్మచర్యవిధానమును విద్యార్థులలో నెలకొల్పుట కభ్యంతరాలుండఁజాలవు. విద్యావిధానములో నేమి మార్పువచ్చినను సర్వ వర్ణములవారికి పురాణేతిహాసముల బోధించుట మిక్కిలి ఆవశ్యకము.

ప్రాచీన భారతఖండమున బ్రహ్మచారి యీ విధముగా ఇంద్రియ నిగ్రహము, శరీరదార్ఢ్యము, కష్టసహిష్ణుత, విద్యావివేకములు అలవఱచు కొనెడువాడు. గురుకులమును వీడునపుడు గురువుగారి కేదయిన గురుదక్షిణ నీయఁదలచి గురువు నభిప్రాయము గన్గొనుట, సాధారణముగా గురు

రాజునొద్దకో, ధనికునియొద్దకో పోయి యాచించుటయు, వారాతని కోర్కె నవశ్యము పాటించుటయు జరుగుచుండెడివి. గురుకులమును వీడి స్నాతక బ్రహ్మచారి వచ్చి యేదయిన నడిగినచో ఇచ్చితీరవలయునను నియమము గృహస్థులపైనను, రాజులపైనను ధర్మశాస్త్రకర్తలు పెట్టినారు.

(మను. 11-1)

ఈవిధముగా గురుకులమును పూర్తిచేసికొని. బ్రహ్మచారి యింటికి తిరిగివచ్చుటకు సమావర్తనమని పేరు. ఇంటికివచ్చి అభ్యంగనస్నానమును చేసి బ్రహ్మచర్యాశ్రమమును సమాప్తిచేయుటకు చేయఁబడు సంస్కార మేదిగలదో దానికే స్నాతకమని పేరు.

ఉపర్యుక్తములగు బ్రహ్మచారికి గల నిషేధములన్నియు ఇప్పటి నుండి రద్దగును. (తొలగును)

పూర్వములోలేని అద్దము చూచుకొనుట, కాటుకపెట్టుకొనుట మొ॥వి యీనాడే ప్రథమమున జరుగును. ఇప్పుడు వివాహమునకు ముందు జరుగు స్నాతకములో పెండ్లికొడుకునకు అద్దము చూపుట, కాటుకపెట్టుట అనునవి జరుగును. బ్రహ్మచారి అట్టి నియమములు పాటించినవాడు కాకపోవుటచే స్నాతక సమయములందు ఒక్కసారిగా ఈ కార్యము లాచరించుచున్నారు. దీనివలన మన సంఘము ఎంత దిగజారిపోయినదాయని విచారము గల్గుచున్నది.

## ఉ ప సం హా ర ము

1) మొదట సంస్కారము అను పదముయొక్క వ్యుత్పత్తి మీమాంసకాదుల నిర్వచనము, పిమ్మట ఏయే యర్థములందెవరెవరు ప్రయోగించినారు ? అను విషయము వివరింపఁబడినది.
2) మతభేదముచే సంస్కారసంఖ్యాభేదము. గౌతమ మహర్షి ననుసరించి నలుబది సంస్కారముల వివరమును చెప్పబడినవి.

3) ఆత్మగుణములు - దయా. క్షాంత్యాదులు ఎనిమిది, సత్యదాన సత్సహవాస, సత్ప్రవర్తనములు. సంస్కార ఆత్మగుణముల ప్రయోజనము, సర్వవర్ణ సామాన్యనియమములును విశదీకరింపఁబడినవి.

4) సంస్కారముల భిన్న భిన్న ప్రయోజనములు, వ్యక్తిత్వము, యొక్క నిర్మాణ వికాసములు ఆధ్యాత్మిక మహత్త్వము సంస్కారముల విభిన్న అవస్థలును వివరింపఁబడినది.

5) ఉపనయన శబ్దము యొక్క వ్యుత్పత్త్యర్థ విశేషములు స్పష్టీకరింపఁబడినవి.

6) ఉపనయనముయొక్క యుక్తాయుక్తకాలములు చెప్పఁబడినవి.

7) ఉపనయన కాలాతిక్రమణ దోషనివారణకు ప్రాయశ్చిత్తములు వివరింపఁబడినవి.

8) ఉపనయన సంస్కార ప్రయోజనములు చూపఁబడినవి.

9) ఉపనయన సంస్కారమున కర్తృతగలవారెవరో చెప్పఁబడినారు.

10) ఉపనయనము చేయవలసిన రోజుల సంఖ్య విషయము స్పష్టపఱచఁబడినది.

11) ఉపనయన మంత్రార్థతాత్పర్యములు వ్రాయబడినవి.

12) గౌతమమహర్షి ప్రోక్తములగు బ్రహ్మచర్య ధర్మములు వివరింపఁబడినవి.

ద్విజులెల్లరును ఈ ఉపనయన సంస్కారము అను శీర్షికపై వ్రాయఁబడిన విషయమునందును సమీక్షించి అవగాహనచేసికొని ఆచరించి సంస్కార ప్రయోజనములను సాధించి తరింతురుగాక.

—— ఇతిశమ్ ——

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 10 | 7 | నాన్వేన | నాన్యేన |
| 11 | 11 | ఋణవా | ఋణవాన్ |
| 13 | 23 | మాశ్రితస్సర్వే | మాశ్రిత్య సర్వే |
| 14 | 9 | ధ్యానకో | ధాన్యకో |
| 14 | 20 | జీలేత్తు | జీవేత |
| 16 | 9 | సంస్కార | సంస్కారము |
| 16 | 14 | గర్భాదాన | గర్భాధాన |
| 18 | 3 | సా_త్త్వక | సాత్త్వక |
| 18 | 16 | వ్రతకావే | వ్రతకాలే |
| 18 | 16 | కుర్యాలేద్విధి | కుర్యాద్విధి |
| 23 | 22 | ర్సంస్కారాః | త్సంస్కారాః |
| 24 | 3 | గుణములకంటె | గుణములకంతకంటెను |
| 25 | 23 | కొరి | కొరకే |
| 26 | 1 | లంమ్భము | లమ్భము |
| 28 | 20 | నిత్యస్తాం | నిత్యాస్తాం |
| 30 | 17 | పొందినటు | పొందినట్లు |
| 32 | 2 | కర్మయంతః | కర్మ యన్తః |
| 36 | 6 | స్ఫృహ | స్పృహ |
| 37 | 1 | బూయా | బ్రూయా |
| 38 | 20 | సత్రాపత్ర | సత్పాత్ర |
| 39 | 20 | నప్రునంతి | నపునంతి |
| 44 | 3 | ప్రతిక్రియ | చేయుక్రియ |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 44 | 19 | అష్టఅత్మ | అష్టఆత్మ |
| 45 | 19 | వంతముగు | వంతమగు |
| 66 | 11 | చంద | ఛంద |
| 66 | 18 | శుభపల | శుభఫల |
| 66 | 20 | మహావిష్ణు | మహావిష్ణో |
| 66 | 20 | రాజ్ఞియా | రాజ్ఞయా |
| 67 | 8 | శుభఫద | శుభఫల |
| 69 | 9 | ద్రువం | ధ్రువం |
| 69 | 11 | ద్రువం | ధ్రువం |
| 69 | 16 | దేవారి | దేవాః |
| 69 | 18 | బ్రహ్మణస్మృతి | బ్రహ్మణస్పతి |
| 70 | 3 | సిదమయినధి | సిద్ధమయినది |
| 71 | 14 | ఇంద్రసం | ఇంద్రసఖం |
| 71 | 17 | వనావను | నావను |
| 81 | 16 | పునసీర్ధర్భా | పునస్త్రీర్ధర్భా |
| 83 | 3 | వెంటుకలను | వెంట్రుకలను |
| 85 | 10 | దులరిచేత | దులచేత |
| 85 | 12 | నిష్టాద్య | నిష్పాద్య |
| 87 | 5 | నీకు గాదు | నాకుగాదు |
| 88 | 15 | యునిగు | యునగు |
| 90 | 19 | గ్నా | అవగ్నా |
| 97 | 4 | ఆపతులను | ఆపదలను |
| 97 | 10 | స్థివిరగ్ం | స్థవిరగ్ం |
| 98 | 12 | గృహేభః | గృహేభ్యః |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 99 | 3 | స్యాంజకా | స్యాంజలౌ |
| 90 | 21 | సుదడు | సుడు |
| 99 | 21 | మొలగు | మొదలగు |
| 100 | 8 | స్మతిగ్గ్రం | స్మృతిగ్గ్రం |
| 100 | 14 | ఆదిత్య | ఆదిత్యః |
| 100 | 15 | నిత | చేత |
| 103 | 5 | ప్రాణముచేతల | ప్రాణములచేత |
| 104 | 1 | మగ్రభీతే | మగ్రభీత్ |
| 104 | 17 | హాసమును | హస్తమును |
| 104 | 20 | అగ్రభిత్ | అగ్రభీత్ |
| 105 | 6 | భుగుడను | భగుడను |
| 107 | 18 | అతకాయ | అంతకాయ |
| 124 | 16 | ఇచుగాక | ఇష్చగాక |
| 127 | 23 | హోయందు | మాయందు |
| 128 | 3 | ఏది | ఏధి |
| 129 | 11 | అన్నయే | అగ్నయే |
| 129 | 12 | బొందద | బొంద |
| 129 | 20 | తడివి | తడిపి |
| 130 | 20 | భువస్స్వాహా | భువస్స్వాహా |
| 131 | 1 | తాత్మర్య | తాత్పర్య |
| 131 | 5 | తుకుడగు | తుడగు |
| 132 | 15 | గాయత్ర మంత్రీము | గాయత్రీ మంత్రము |
| 133 | 1 | రోగ్కస్తు | రోగో అస్తు |
| 133 | 9 | ఓం భూవః | ఓం భువః |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 133 | 11 | మోంకారూప | మోంకార రూప |
| 141 | 2 | దద్వాత్ | దద్యాత్ |
| 146 | 3 | శ్రృతమ్ | శృతమ్ |
| 152 | 1 | సమిర | సమిద |
| 152 | 6 | జాఅవేదసే | జాతవేదసే |
| 152 | 12 | యొక్క | కొఱకు |
| 153 | 10 | మమన | నమమ |
| 154 | 6 | సృష్వహి | సృక్ష్మహి |
| 157 | 10 | భాగమురేని | భాగములేని |
| 158 | 12 | మన్యస్వం | మన్యస్వ |
| 160 | 1 | మేంధా | మేధాం |
| 160 | 15 | రుద్రభూమి | రుద్రభామి |
| 161 | 3 | ఆయే-పుత్రపౌత్ర వ్యతిరిక్తుడైన మనుష్యునిపట్ల | ఆయుషి-ఆయుస్సునందు |
| 161 | 16 | శౌర్యమ్యు | శౌర్యము |
| 162 | 13 | పునస్త్వాత్యా | పునస్త్వాదిత్యా |
| 164 | 4 | విద్యాంశ్రియం | విద్యాంబుద్ధింశ్రియం |
| 164 | 20 | లోముగల్గి | లోపముగల్గి |
| 166 | 12 | కుమార | కుమారః |
| 166 | 16 | నిద్రిపకుము | నిద్రింపకుము |
| 167 | 4 | నాయాజ్ఞలేక ....ము | ఆచార్యునకు అధీనుడవగుము |
| 167 | 6 | భవది | భవద్భి |
| ,, | | నకరోధి | నకరోమి |
| 167 | 7 | చేయకుము | చేయను |

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 185 | 8 | శుతం | శ్రుతం |
| 187 | 6 | ఛందోభ్యం | ఛందోభ్య |
| 188 | 12 | ప్రాప | పాప |
| 191 | 20 | వాదనై | వాడనై |
| 194 | 15 | ద్విజాయతః | ద్విజాతయః |
| 194 | 15 | బ్రహ్మణ | బ్రహ్మ |
| 197 | 5 | యనుజ్ఞి | యనుజ్ఞ |
| 200 | 3 | సంఘవ్య | సంఘ |